శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(వార్షిక సంచిక)

**Journal of the Telugu Academy**

KAKINADA.



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

కవిమూర్ధన్య, కవికంఠీరవ, శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.
శ్రీ బండారు తమ్మయ్యగారు.
వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
భాషాప్రవీణ, శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

---

## విషయసూచిక

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౭ | హేవిలంబిసంవత్సరము చైత్ర, వైశాఖ-జ్యేష్ఠాషాఢమాసములు | సంచిక ౧, ౨

## మన్మథసంవత్సరము - విషయసూచిక

# దుర్ముఖిసంవత్సరము - విషయసూచిక

# సౌందరనందము

"గాండీవి"

శ్రీ డాక్టరు వేమూరి వెంకటరామనాథము, M. A., Ph. D. గారి "సౌందర్యసమీక్ష" యను గ్రంథమున కీవ్యాసము విమర్శనప్రాయమైనది.

"నాటకరచనలోని రససామ్యముగల సన్నివేశములను బోలి" యున్నవనియు, "సన్నివేశసౌందర్యమునకు నగుణారుణదీపిక" లనియు వీరు పేర్కొనిన సన్నివేశములు రెండు (1) కేళీమందిరమున "సుందరి విశేషకము రచించుకొను మధురఘటికలో" బుద్ధుని భిక్షాగమనతన్నిర్గమనములు "తెప్పపాటంతలో" "సుందరీనందుల ప్రణయవాహినిలోఁ గల్లోలము లుప్పతిల్లుట". (2) నందునిచేతిలో బుద్ధుఁడు భిక్షాపాత్రము నిడి యతనిని విహారమునకుఁ దీసికొనిపోవుట. ఈరెండు సన్నివేశములును మూలమునుండి యథాతథముగా భిక్షుఁ గైకొన్నవే.

"సౌందరనందమునందలి ప్రతిసర్గలోని యావిష్కరణమును సమాప్తియు నాటకరంగప్రారంభసమాప్తులనుబోలి" యున్నట్లు వ్రాసి వీ రిచ్చిన యుదాహరణములలో "సూర్మికలమధ్య హంసనా" నొప్పు నందుని సందిగ్ధమూర్తిచిత్రణమును, "సుందరీప్రాణధనము భిక్షులకు దక్కుటతో" సర్గమంతయు చేయుటయు మూలానుసరణములై యున్నవి.

శ్రీ వేంకటరామనాథముగారిధోరణిని జూడ సౌందరనందమును గథాకథనములో నన్నయస్థానమున నిలుపునట్లు తోఁచెడి. ప్రథమసర్గ శాక్యర్షి మహాత్మ్యముతో నంత మొందుటకు మూలకవియే హేతుభూతుఁడు. పరిచారికలు కార్యాంతరనియుక్తలై బుద్ధునిపిలుపు వినకపోవుట, యొకపరిచారిక యీసంగతి గమనించి నందునికిఁ దెలుపుట, సుందరిస్థితిని జూచి "చెలియయొక్రర్తు రాకొమరు నిక్కవ మారసి వచ్చుటకుఁ" బోవుట, మూలమునుండి గ్రహించిన వే.

సుందరీనందులు గౌతమబుద్ధుఁడు మొదలగు ముఖ్యపాత్రలే కాక చెలికత్తెలు బాలబాలికలుగూడ నత్యంతసార్థకముగాఁ బ్రవేశ పెట్టఁబడి రనియు, 'ఆత్మసముండగు' భిక్షుకునిచే నందునకు దీక్ష నిప్పించుటచే నందునిహృదయవేదన నిరూపించుట కవకాశము కలిగిన దనియు, నిది "కథాసౌందర్యము నినుమడింపఁజేసి రసవంతముగ" నున్నదనియు వీరు వ్రాసినారు. వీరు పేర్కొనిన సార్థకపాత్రలలో బాలబాలికలుతప్ప తక్కినవారందఱు మూలమునుండి దిగివచ్చినవారే. వీరు చెప్పిన యాత్మసముండగుశిష్యుఁడు మూలమునందలి యానందుఁడే. 'ఆ, యానందుఁడును మున్ను నీవలెనె నన్నర్థించె వేభంగులన్' అని యాంధ్రసౌందరనందకర్తలు సప్తమసర్గలోఁ జెప్పిన యానందుఁ డితఁడే యని చెప్పవలసియున్నది.

నూతనములు నపూర్వములు నని శ్రీ వేంకటరామనాథముగా రుదాహరించిన యలంకారములలో రెండు మూఁడు మూలమునందలివే కాని స్వతంత్రములు కావు.

"పరక త్రుంచక నిల్చి కురంగియో యనన్"
"స్థితోచ్చ కర్ణో వ్యపవిద్ధ శష్పా
భ్రాంతం మృగం భ్రాంతముఖీ మృగీవ"
"పెనువెల్లువపై నెదురేఁగునట్టి యుడుపముబోలె"
"జగామ దుఃఖేన వివర్త్యమానః
ప్లవః ప్రతిస్రోత ఇవాపగాయాః"

(పై యలంకారములుగల పద్యము లాంధ్రీకరణములే కాని స్వతంత్రములు కావు. విస్తరభీతిచే శ్లోకములను బూర్తిగా నీలేదు.)

ఇంతవఱకు మూలమును జూడకపోవుటచేఁ బొటమిల్లిన లోపములను దిఙ్మాత్రముగా సూచించితిని. ఇఁకఁ గవిత్వతత్త్వవిచారవిమర్శనా

పఠనజనిత సంస్కారకారణమున సంభవించిన ప్రమాదములను గొంచె ముదాహరింతును.

సౌందరనందము లాక్షణికముగా ప్రబంధ మగునా యను ప్రశ్న నటుంచుదము. ఇందు పురవర్ణనలు, నగరవర్ణనలు మొదలగు నవి లేవు. లక్షణగ్రంథము నెడమచేతఁ బట్టి అష్టాదశవర్ణనలు కుడిచేత గుణింపలేదు. ప్రథమసర్గలో తొలుతనే- సీసపద్యమున కేర్పడినవి కాఁబోలు- నాలుగువర్ణముల వర్ణనయు "అచటి విప్రులు మెచ్చరు... ...అనుచు చేయనేలేదు." అని మొదటిపుటతోనే ప్రబంధములపై దండయాత్ర కారంభించినారు.

ప్రబంధశబ్దము ముక్తకేతరసకలదృశ్యశ్రవ్యకావ్యసామాన్య వాచి యని లక్షణకర్తల సిద్ధాంతము. ఆంధ్రప్రబంధములను సమ్య క్పరిశీలనము చేసినచో వర్ణనలు, శైలి యను రెండు విశిష్టలక్షణములు నేత్రవిషయీభావమును భజించును. ఈ రెండు లక్షణములు సరిపోక పోయినను ప్రబంధశబ్దము వర్తించుట కభ్యంతరము లేదు. సౌందర నందమున నష్టాదశవర్ణనలు లేవు. శైలి పురాణోచిత మనఁదగి యున్నది.

ఒకవేళ సౌందరనందమున నష్టాదశవర్ణన లుండి, యవి పెక్కు ప్రబంధములలోవలెఁ గాక కథాగతితోఁ బొంది పొసఁగియుండెనేని వాని నప్పుడు విశిష్టగుణములుగాఁ బేర్కొనవలసిన యావశ్యక ముఁ డును. అవి లేనప్పుడు తత్ప్రసంగముతోఁ బనిలేదు.

ఇట్లే ప్రబంధములందలి పురవర్ణనలఁగూర్చియుఁ జాతుర్వర్ణ వర్ణనలుగూర్చియు నిరసింపవలసినప్రసక్తి కనఁబడదు. అసలు పారిజాత పహరణమువంటి కొన్నిప్రబంధములలో నీవర్ణనలు లేనేలేవు. కళా పూర్ణోదయమున నీవర్ణనలందుసయితము కథావిషయములు నిర్వహింపఁ బడెనవిధము శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి వ్యాసరాజము

బఠించినవారికెల్లఁ గరతలామలకము. ఇవ్విధమున నే యనావశ్యకముగాఁ బ్రబంధముల ప్రసంగము తెచ్చుచు వానికన్న సౌందరనందము మిన్నగ నున్న దని వ్రాయుచుండుటయుఁ గలదు.

కవిత్వతత్త్వవిచారవిమర్శనమునఁ గళాపూర్ణోదయప్రభావతీప్రద్యు మ్నములందలి నాటకగుణములు ప్రదర్శింపఁబడియుండుటచేఁ దదనుసరణ పరత్వమునఁగాఁబోలు సౌందరనందము 'ప్రబంధరూపమున వేషము వేసి కొన్న నాటక'మని నిరూపింప యత్నించిరి. అట్లు నిరూపించుట కుదాహ రించిన సన్నివేశాదులు పెక్కు మూలమునందలివే యని విశదపఱిచి యున్నాను. ఇట్లే 'పాత్రచిత్రణానైశిత్యము, సంభాషణానైశిత్యము' తిక్కనభారతములోవలె "విపులముగా నల్లుకొనిపోయినట్లు" వ్యక్తము చేయుచు, నీ రెండుగుణములు వరూథినీసత్యభామల పాత్రచిత్రణమునఁ గొలఁదిగా గోచరించినను 'నీ నైశిత్యము ప్రస్ఫుటము కాలే' దని వ్రాసి నారు. ఇట్లనుటలో నతిశయోక్తి లేదని' సౌందరనందమునుగూర్చి వీరు వ్రాసినను వీరివ్రాఁతలలో నతిశయోక్తులు కలవనుటలో నతిశయోక్తి లేదని నాయభిప్రాయము.

## సౌందరనందవిమర్శకులు గమనింపవలసిన విషయము:—

సౌందరనందము నెవరు విమర్శించినను మూలకథకును దీనికిని గలభేదములను వాని యౌచిత్యానౌచిత్యములను బ్రప్రథమమునఁ జర్చించి, యాంధ్రీకృతభాగములందలి యనువాదపద్ధతిని బ్రదర్శించి యాపైని నిష్పాక్షికముగా సహృదయతతో విమర్శనము వ్రాయవలసి యుండును.

## ఆంధ్రసౌందరనందము-మార్పులు-తదౌచిత్యానౌచిత్యములు:—

(1) అశ్వఘోషుఁడు బౌద్ధధర్మోపదేశప్రతిపాదనతత్పరుఁడై సౌందరనందకావ్యమును రచించియుండుటచే నందు బౌద్ధమతధర్మాము లతివిస్తృతి నందినవి. ఆంధ్రసౌందరనందమున నివి యుపేక్షింపఁబడినవి.

(2) నందునకు సన్న్యాస మిప్పించువిషయము మూలమున సుసమాధేయమై యుండఁగా నాంధ్రసౌందరనందమున నయుక్తముగ నున్నది.

నందుఁడు తనయనిష్టతను మొదటిసారి యానందునితో జెప్పినను మరల బుద్ధుఁడు బోధించినపిమ్మట నట్లే యని యంగీకరించి మూకీభావ మును వహించినాఁడు. సంతోషముతో సన్న్యాసస్వీకారమున కంగీకరింపక పోయినను నామాత్రపువైముఖ్య ముపేక్షార్హము. ఈమాత్ర మనిష్టము గలవానికైన సన్న్యాస మీయవలసిన యగత్యము బుద్ధుని కేల యన్నచో నందుఁడు బాహ్యాశ్రయుఁ డగుటచేఁ బరాశ్రయమునఁ గాని ముక్తుఁడు కాఁడు. అతని మృదుజ్ఞానము నావరించియున్న క్లేశరజమును దొలఁగింప యత్నించుటచే—

"ఇహోత్తమేభ్యోపి మత స్సభూమో
య ఉత్తమం ధర్మ మవాప్య నైష్ఠికమ్
అచింతయిత్వా సుగతం పరిశ్రమమ్
శమం పరేభ్యో ప్యుపదేష్టు మిచ్ఛతి."

అను బుద్ధోపదిష్టమగు నుత్తమోత్తమ లక్షణమునకు బుద్ధుఁడే లక్ష్యభూతుఁ డయ్యెననుట బౌద్ధధర్మావిరుద్ధ మగుటయేగాక యనుకూల త్వమునుగూడ ధరించుచున్నది. "సర్వేక్షు బీజం హి దదర్శ తస్యే" త్యాదిశ్లోకములలో నీవిషయములను వ్యాఖ్యానించుచు నశ్వఘోషుఁడు కథ నడపినాఁడు.

ఆంధ్రసౌందరనందమున నిట్లు సమాధానపడుట కవకాశము కన్పట్టదు. ఆంధ్రసౌందరనందమునందు వర్ణితమైన బలాత్కార సన్న్యాససంఘటన మనౌచిత్యపూరితమై రసభంగహేతు వగుచున్న దని చెప్పకతీరదు.

సీ. సుడి వెట్టి లోఁగొను నడిసంద్రపుఁదుపాను
గడవ నీఁదెడి యీఁతగాని వోలె

గీ. భిక్షుమండలిచేఁ జిక్కి పెనఁగులాడి,
వేఁడుకొని, బిట్టుగా విలపించి, కసరి
విసివి, చేష్టలు దక్కి, సొమ్మసిలి, వ్రాలి
సుందరీప్రాణధనము భిక్షులకు దక్కె.

ఈపద్యమును రచింపమానినచో నందునిసన్యాస మింతభయంకర రూపము దాల్చెడిదికా దని తలంపనగును.

(3) బుద్ధుఁడు నందుని హిమాలయమునకు నందనవనమునకుఁ దీసికొనిపోయినట్లు మూలమున నుండఁగా నమానుషములగు నాకార్యములు వీరు పరిత్యజించినారు. ఇది సముచితమే యని చెప్పవచ్చును.

అప్సరఃకాంతాభిలాషియై సుందరిని మఱచి నందుఁడు వారి కొఱకుఁ దపము చేయఁబూనుట స్వర్గ మధ్రువ మని యానందుఁ డను బుద్ధశిష్యునిచే నెఱింగి స్వర్గవాంఛను వదలి నిత్యపదాభిలాషియై విరాగి యగుట యను మూలకథావిధానము పై మార్పుచే విడిచిపెట్ట వలసివచ్చినది.

(4) "ధ్రువం హి సం శ్రుత్య తవ స్థిరం నో
నివృత్త నానావిషయై ర్మనోరథైః
వధూర్గృహే సా పితవానుకుర్వతో
కరిష్యతే స్త్రీషు విరాగిణో......(చెదకొట్టినది)

అను శ్లోకము నాధారముగాఁ గొని సుందరికిఁగూడ నాంధ్ర సౌందరనందమున దీక్ష యీఁబడినది. సూచనామాత్రముగా మూలమున నున్న దానిని వీరు విపులీకరించి రని చెప్ప నొప్పును.

ఇవి కాక మూలకథ ననుసరించుటలోఁ గొన్ని యత్యల్పములగు మార్పులుమాత్రము చేయఁబడినవి.

(1) కపిలవాస్తుపురనిర్మాణము శుద్ధోధనుని పరిపాలనాదికము మూలమున నుండఁగా వానిని బరిత్యజించినారు.

(2) నిర్వాణపథమును గన్గొని కపిలవాస్తుపురి కేతెంచిన బుద్ధుని యశోధర దర్శించినట్లు మూలమున లేదు.

(3) హర్మ్యాగ్రపృష్ఠమున గవాక్షపక్షమునఁ గన్నులుంచి విలోకించుచున్న యొకపరిచారిక బుద్ధునినిర్గమనమును జూచి నందునకుఁ దెల్పినట్లు మూలమున నుండఁగాఁ "జెంగుచెంగునఁ బర్యాయసేవ కొఱకు, నగరి కప్పుడు చనుదెంచు నాఁతి యొకతె" (2-36) ముని నివర్తనమును జూచిన దని యాంధ్రసౌందరనందమునఁ జెప్పఁబడినది. గవాక్షపక్షమునఁ గన్నులుంచి చూచుచుండిన పరిచారిక తన్నిర్గమనమును జూచినది తదాగమనము నేల చూడలేదనుప్రశ్న యుదయించు ననుశంకతో నీమార్పును వీరు చేసినట్లు తోఁచుచున్నది.

(4) నందుఁడు వినీతవేషముతో బుద్ధునిఁగూర్చి పోయె నని మూలమున నుండఁగా "రాజసాతిరంజితచిత్రాంబరాళితోడ, నందుఁ డున్నట్టులే పయనమ్మె గాఁగ" అని యాంధ్రసౌందరనందమునఁ జెప్పఁబడినది. (2-47)

ఇట్టి యల్పములగు మార్పులు మఱికొన్ని కూడఁ గలవు.

## ఆంధ్రీకృతపద్యముల వివరము:—

**పునరాగమనము:—** సౌందరనందమునందలి యీ ప్రథమసర్గ మూలమునందు వర్ణితమైయున్న గౌతముని వనగమనతదాగమనముల నాధారముగాఁ గొని రచితమైనది. అందు 5, 17, 23 పద్యము లనువాదములు.

భిక్షాగమనము:— ఈ రెండవసర్గము చాలవఱ కాంధ్రీకరణము. 3, 5, 6, 7, 8, 10, 12, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 31, 32, 33, 34, 35, 37, 40, 41, 42, 43, 45, 46, 48, 49, 50, 51 పద్యము లాంధ్రీకరణములు.

పరివ్రాజనము:— ఈ తృతీయసర్గమున 2, 3, 4, 5, 6, 10, 12, 13, 14, 15, 16, 17, 21, 22, 26, 29, 30, 31, 32, 34 పద్యము లాంధ్రీకరణములు.

నిరీక్షణము:— ఈ సర్గలో 4, 5, 8, 9, 12, 15, 19, 25, 31 పద్యము లనువాదములు.

ధర్మసంవాదము:— ధర్మసంవాద మను నీ సప్తమసర్గలో 21, 22, 25, 26 పద్యము లనువాదములు.

అనువాదపద్ధతులనెల్ల సాకల్యముగాఁ దీసికొని విభజించి యాంధ్రీకరణవిధానము నంతయు నిరూపించుట కిట స్థలము చాలదు.

శ్లో. తం గౌరవం బుద్ధగతం చ కర్ష
భార్యానురాగం పునరా చ కర్ష
సోఽనిశ్చయాత్ నాపి యయౌ నతస్థౌ
తరం స్తరంగేష్వివ రాజహంసః॥

గీ. బుద్ధగతమైన పెనుభక్తి ముందు లాగ
వెలఁదిపై రక్తి లాగె వెన్వెనుకకతని
నూర్మికలమధ్య హంసనా నొప్పె నపుడ
నిశ్చయమ్మునఁ గదలక నిలువ కతఁడు.

పై రీతి యథానువాదము లనఁదగిన పద్యము లున్నను మొత్తముపై నాంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్ర మని చెప్పవచ్చు నని తోఁచుచున్నది.

శ్లో. తాం మంగనాం ప్రేక్ష్య చ విప్రలబ్ధా
నిశ్వస్య భూయః శయనం ప్రపేదే
వివర్ణవక్త్రా న రరాజ చాశుః
వివర్ణచంద్రేవ హిమాగమ్యేదోః॥

క. చని సోపాన తలము దెసఁ
గనుఁగొని నిట్టూర్పు విడిచి గ్రక్కున మఱలెన్
అనిలవశమ్మునఁ జని గ
ట్టును డీకొని తిరిగి సుడివడుపడవరీతిన్.

ఈ పద్యములోని ప్రథమద్వితీయచరణములు మూలానుసారములే యైనను తుది పాదములు స్వతంత్రములు. "వివర్ణచంద్రేవ హిమాగమేద్యోః" అనునది విడువఁబడినను నాంధ్రసౌందరనందమునందలి యుపమయే హృద్యముగ నున్నది. "సుడివడుపడవరీతిన్" అను స్థలమునందలి పదములతో ట్రుబాటు సందర్భోచితము.

ఆంధ్రీకృతపద్యములలో నెడనెడఁగల స్వతంత్రవాక్యములు హృదయంగములై యున్నవి. "మనసు వశమ్ముగాక పలుమాఱు ననర్థము శంకచేసెదున్" (2–43) మొదలైనవి. నందుఁడు బుద్ధునితో 'మాగృహమున మీకు భైక్ష్యకాల మగుఁగాక' యని యనినట్లు మూలమున నుండఁగా "మఱలి చనుదెంచి యర్థిమై మఱఁద లొసఁగు, భిక్ష గ్రహియింపవే" యని యనిపించుట సరసముగ నున్నది.

"తన వెనుక వచ్చి నిల్చెనో, యనుకొని వెనుదిరిగి చూచు" (4–3) వంటి యమూలక భావములు గొన్నియెడల నింపునింపుచున్నవి. సుందరి నందునిశీలము శంకించినట్లు మూలమునందువలె నున్నను నది పొరపాటుగాఁ దలఁచినట్లు సుందరిచే ననిపించుట యమూలకమే(4–20)

## స్వతంత్రభాగవిమర్శనము:—

ఆంధ్రసౌందరనందమున సుందరి బుద్ధునిఁగూర్చి 'మెత్తనికినుకతో గౌరవ మెనసిడివాక్యములఁ బల్కిన ఘట్ట మమూలకభాగములందెల్ల

రసవంత మని తలంపనగును. (చతుర్థసర్గము 42-వ పద్యమునుండి సర్గాంతమువఱకు.)

గీ. శోకరూపిణి యైన యశోధరాంబ
కీతరిం దోడికోడల నైతి నిజము
శాక్యకులమును మెట్టిన సతులకెల్ల
భర్తృవిరహామె నోములఫలమ దేవ !

క. పశుపక్ష్యాదుల కష్టపు
దశఁ జూడఁగలేని నీవు తమ్ముని యేఁకృపఁ
విశదముగా వినఁగల్గుట
వశిపుంగవ నా యభాగ్యవశమునఁ గాదే.

మొదలైనపద్యములు రసపాకరమణీయములు.

పూర్వాపూర్వసర్గలలోని పద్యములందలి భావములే రెండు మూఁడుచోట్ల నుత్తరోత్తరసర్గలలో మెఱుఁగుపెట్టఁబడి యుండుటయు గోచరించుచున్నది.

ద్వితీయసర్గలోని 15 వ పద్యమును ('తనకుం బాపటచక్కదిద్ద' అనుపద్యము.) బంచమసర్గలోని 16 వ పద్యమును (అళికులస్పృహణీయేత్యాదిపద్యము.) ప్రథమసర్గలోని 4వ పద్యమును, సప్తమసర్గలోని 10 వ పద్యమును బరిశీలింపనగును.

**వర్ణనలు:**— సౌందరనందము నందు వర్ణన లుద్దీపనవిభావప్రాయములుగానే చాలవఱకు గ్రహింపఁబడినవి. చతుర్థసర్గాంతమునఁ జెప్పఁబడిన యీ క్రిందిపద్యము కథాగతితో మేళవింపఁబడినది.

ఉ. అంతట భానుమంతుఁ డపరాంబుధిఁ గ్రుంకఁగ నాతలోదరీ
స్వాంతమునందుఁబోలెఁ గలయన్ దెసలెల్ల దమంబు ప్రాఁకె నా
కాంతను బుజ్జగించుచెలికత్తెలు విత్తెడు నాసపోల్కి నొ
క్కింత వెలుంగు దోఁప నుదయించెను దారక లక్కడక్కడన్.

ఇంతమాత్రమునఁ బ్రబంధములకంటె నిది యేదో వైశిష్ట్యసంపాదక మని భ్రమింపరాదు. రంగప్రసాధనప్రాయముగను భావనానైశిత్య వ్యక్తీకరణతత్పరత్వమునను జేయఁబడిన వర్ణనలే కాక యుద్దీపనవిభావప్రాయములుగను గథాగతితో మేళగింపఁబడినట్లుగను జేయువర్ణనలు ప్రబంధసామాన్యములు. శ్రీ వేమూరి రామనాథముగారివలె భ్రమపడరా దనుటకే మరల నీవాక్యము లిచ్చుట వ్రాయవలసివచ్చినది.

పూర్వమహాకవిప్రయుక్తపదస్వీకారము:—

పూర్వకవిప్రయుక్తములగు రసవత్పదములు సౌందరనందకర్త లెడనెడ వాడినారు. "ఫుల్కాపుల్కాన, భజింప (పరివేషమై భజింప) బొమ్మనెట్టియు, వింజమాకిడినయట్లై, మిన్నంటిరి, తోడునీడై కూడియాడెననఁగ, ఉష్టానియూదిన, కనుసన్న మెలంగు, ఖడ్గధారావ్రతము, కన్నులవ్రేలుచున్నది, ఘంటాపథమ్మై మోహింతమై, పులువాయి ముత్తియమునివాతదీపళిక, అస్తినాస్తి, ఎండకన్నెఱుఁగవు" మొదలగునవి. 'కాసరకూసర, వెన్నెలతోడికోడలయి' యనునవి శ్రీ తిరుపతి వేంకటకవులనుండి గ్రహింపఁబడియుండును.

అనుసృతులు:—

సీ. అతఁడటె సుకృతాత్ముడైన మాయాదేవి
కడుపారఁ గన్న బంగారుతండ్రి (సౌందర.)

సీ. వీఁడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటిబాలకుండు (భాగ.)

తిక్కనగూడ నీపోకడగల పద్యమును రచించియున్నాఁడు

సీ. ప్రాణంబుతోఁగూడ రక్కసిచన్నుల
పాలు వ్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె! (ఉద్యోగ.)

సౌందరనందకర్తలు పద్యమును 'అతఁడటే' యని ప్రారంభించి ద్వితీయపాదము 'ఆలుబిడ్డలును రాజ్యముఁ దృణముగఁ గాన, కేగినట్టి

విరక్తుఁ డీతఁ డటవే' యనియు మూఁడవచరణము 'ఏఁడుయూనే' యని యారంభించి చతుర్థపాదము "మనబోటిపాపులకును మోక్షము నొసంగ, నరుదెంచుపుణ్యాత్ముఁ డటవె యితఁడు" అనియు 'నాల్గిట నేకసరణిఁ బాదువక' పోవుటచే సమతానియమమును పాటింపలేదు. సమతఁ బాటించినచో నీపద్యము మఱికొంత హృద్యముగ నుండియుండు నని తోఁచెడి.

శా. "నాతమ్ముండు దయాపయోధి శ్రితచింతారత్న మాపన్నర
క్షాతాత్పర్యుఁడు" .......... (సౌందర, 6 సర్గ) అనుపద్యము

ఉ. "నాదునసహోదరుండు సుజనస్తవనీయనయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చుఁడు" (పాండు.) అను పాండురంగ
మాహాత్మ్యపద్యమును స్మృతికిఁ దెచ్చుచున్నది. ఇట్లే—

గీ. "చాయ కగ్గిన చిత్రమ్ము సౌరభమ్ము
గోలుపోయిన సుమమునై" అనుసౌందరనంద (8–1) పద్య

పాదములు "పదనుదివిసిన కస్తూరి ప్రాఁచియలరు, పాయఁబాఱిన కూడు నీర్వట్టు మడుఁగు, గళితమణియగు సొమ్మునై" అను పాండురంగకవి పద్యచరణములను జ్ఞాపకము చేయును.

"డాయఁబోవువా, రై పదయుగ్మ మెత్తియును హా యని నిల్చి నిరుద్ధచిత్తులై" ఇది "సోఽనిశ్చయాన్నాపి యయౌ నతస్థౌ" అను నశ్వఘోషుని శ్లోకచరణముతోపాటు శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ" అను కుమారసంభవశ్లోకపాదానుసరణమును స్పష్టీకరించును.

సౌందరనందమున "పాణిద్వంద్వము నూని .......... నీ నవ్యామృత" అనురీతి నణప్రాసలు వాడఁబడినవి. పూర్వకవులప్రయోగములును నప్పకవ్యాదిలాక్షణికుల సమ్మతియు నెట్లున్నను వీని నంగీకరించుటయే యుక్త మని నా యభిప్రాయము, "నందనోద్యానవిహారి

దైవతలతాంగిగొ" అనుప్రయోగమును పాల్కురికి సోమన ప్రయోగములబలమున సాధువుగా నెన్నుటయే సంమజసము.

నాలుగైదుపద్యములలో (లేక యేడెనిమిదిపద్యములలోనో) తప్ప సంస్కృతసౌందరనందమునకు నాంధ్రసౌందరనందమునకు సంబంధము లేదనురీతిని వ్రాయఁబడిన సౌందరనందప్రతిని జూచియుండుట చేతనో మఱి యేమో శ్రీ రామనాథముగారు సౌందరనందమును గేవలస్వతంత్రకావ్యముగా విశ్వసించి విమర్శనము వ్రాసిరి. మూలమును బరిశీలించియుండు రేని యింతటి యతిశయోక్తిభూయిష్ఠముగా విమర్శనము వ్రాసియుండరేమో! స్వతంత్రరచనలగు కిన్నెరసానిపాటలు మృత్యుంజయశతకము ననువానిపై వీరు రచించిన, విమర్శనలు వీరి విమర్శనాపాటవమునకు నిదర్శనములుగా నున్నవి. వానినిగూర్చి ప్రశంసించుట కిట స్థలము చాలదు. కిన్నెరసానిపాటలను గూర్చినవిమర్శలో వీ రవలంబించిన ప్రణాళికయు 'సౌందర్యశకలములను నిరూపించు' విధమును గిన్నెరసానిపాటలలో శ్రీ విశ్వనాధవారి 'భావిరచనలు ధ్వనితము లగువిధమును విస్పష్టము చేసిన 'సత్యాన్వేషణ' తత్పరతయు వీరి సహజప్రజ్ఞకు నికషోపలములుగా నున్నవి. తత్వనిర్ణయదృష్టితో వ్రాయఁబడిన నా యీవ్యాసమును మన్నింతురుగాక యని శ్రీ రామనాథముగారిని గోరుచు నీవ్యాసమును ముగించుచున్నాను. సాహిత్యేతరక్షేత్రమున నుండియు నాంధ్రభాషాసేవ చేయుచున్న శ్రీ రామనాథముగారికి నమోవాకము లర్పించుచున్నాడను.

శ్రీమత్పరదేవతాయైనమః

# కళాపూర్ణోదయములోని కళాపరిపూర్ణత

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

కళాపూర్ణోదయవిమర్శన మనఁగనే, కట్టమంచివారు తలఁపునకు వత్తురు. పింగళివారిరచనలను దలఁచుకొన్నంతనే, లక్ష్మీకాంతముగారు గంభీరముద్రలో సాక్షాత్కరింపకతప్పదు. సూరనకథావధానకౌశలమును దలపెట్టుసరికి, వేంకటరమణశాస్త్రిగారు చిరునవ్వుతోఁ బొడసూపుదురు. ఆమువ్వురకు మువ్వురును సూరనార్యుని రచనలనుగూర్చి విశ్వవిహార మొనరించి దిగ్విజయమును జేపట్టినమహాత్ములు. అట్టిమహానుభావులు విమర్శనాత్మకము లగువివిధరచనలను వెలయింపఁజేసినకళాపూర్ణోదయమునందలి కళాపరిపూర్ణతనుగూర్చి 'అభము శుభము' నెఱుఁగని నావంటిసామాన్యుఁడు వ్రాయఁబూనుకొనుట సాహసకార్యమే యగును. అయినను, పెద్దలగు నాత్రిమూర్తుల యాశీర్బలముతో రెండు మాటలు మనవిచేయుదును. పాఠకులు దయతోఁ జిత గింతురు గాక.

కవులప్రాగల్భ్యమో, కాలప్రభావమో, అ రెండిటి కలయికయో యిద మిత్థ మని నేనునిర్ణయింపలేను గాని, ఆంధ్రవాఙ్మయరంగములో పదునారవశతాబ్దము పాలవెల్లువలను బ్రవహింపఁజేసినపసిఁడియుగ మని మాత్రము చెప్పఁగలను. ఉద్దండులైనపండితులు, దిగ్దంతులవంటి కవులు, 'సంగీతసాహిత్యసమరాంగణసార్వభౌము లైనకవిచక్రవర్తులును జేతులు కలిపి, తమ తమ భావనాబలముచే మథించిన యానాఁటి యాంధ్ర సారస్వతక్షీరసాగరములో వెలలేని దివ్యమణు లెన్నియో వెలసినవి. ఆపాలవెల్లిలో నుదయించినకౌస్తుభమణిహారమే మన కళాపూర్ణోదయము. ఇది కావ్యము నగును, ప్రబంధమును గాఁదగును; నవల యనియు ననవచ్చును, నాటకమనియు ననఁదగును. ఇది యది యన నేల! కవిభావనాబలమునకుఁ గథాకల్పన, శైలీరమణీయత, వర్ణనపటుత్వము,

వివిధరసపరిపోషణ, పాత్రచిత్రణము, ప్రసంగనైపుణి, ప్రతియోగసంఘుటన యాదిగాఁ గలయుత్తమకావ్యగుణము లన్నియు నాలంబనములు కాఁగా, నాఁటికిని నేఁటికిని, నేనాఁటికిని, సాటిలేని మేటిరచనయై, యాంధ్రసరస్వతికి మణిహారముగా నెలకొన్న యుత్తమరచన కళాపూర్ణోదయము.

ఏవంవిధగుణమహిత మగు నేతత్కావ్యమును సంతరించినమహానుభావుఁడు పింగళి సూరనార్యుఁడు. ఆతఁ డొకే మూసలోఁ గరఁగి పోసినట్లున్న పూర్వప్రబంధములను జదివి చదివి విసివి వేసారినయాంధ్రపాఠకలోకమునకు వస్తువైవిధ్యము బహుళపాత్రసంకీర్ణము ననేకరససంకలితము నద్భుతకల్పనాయుతము ననేకకథాకలితము నైనవిచిత్రరచనను వెలయించి జిహ్వాత్రుప్తి దుల్లఁజేసినాఁడు. ఆరచన యంతయుఁ గవి
ము. ఆగ్రంథారంభమే క్రొత్తపోకడలఁ బోయినది. ఆనిర్వహణమే యద్భుతావహము. ఆపరిసమాప్తిలోనే యున్నది కవినైపుణియంతయు.

ముచ్చటగా మూఁడుపద్యములలో ద్వారకానగరవర్ణనను బ్రస్తావించి, తెర నొలఁగించి, యుద్యానవనములోఁ జెలికత్తెలతోఁ బంతాలాడుచుఁ దూఁగుటుయ్యెల లూఁగుకలభాషిణి నొకవైపు, ప్రియశిష్యునితో యాదృచ్ఛికప్రసంగము లాడుచు శ్రీకృష్ణుని దర్శింపఁబోవు నారదమహర్షి నింకొకవైపు, బ్రియురాలితో సరసాలాపము లాడుచు విమానములో విహరించుచున్న నలకూబరు నింకొకవైపు బర్యాయముగా రంగమునఁ బ్రవేశపెట్టి, కవి సూత్రధారుఁడై రచనను బంచకల్యాణివలెఁ బరువులువాఱించినాఁడు. ఇది నవలయా! నాటకమా! కథయా! కల్పనమా! యని పాఠకునకు దిగ్భ్రాంతి గలిగించినాఁడు. నాటకీయ మగు నీయెత్తుగడలోనే యున్నది సూరనప్రతిభయుఁ గళావైదగ్ధ్యమును.

పైని చెప్పోనినపాత్రలలోని కలభాషిణీమణికంధరులు గ్రంథము నందలి పూర్వకథలో నాయికానాయకులు. ప్రధానకథకు నాయికా నాయకులగు మధురలాలసాకళాపూర్ణులకుఁ బూర్వరూపులు. ఇఁక నీరంగములోని నారదుఁడన్ననో నాయికానాయకులకు గురుత్వము వహించినదివ్యయోగి, ప్రేమైకమూర్తు లగురంభానలకూబరు లానా యికానాయకుల ప్రణయప్రవృత్తులకు రాచబాట వైచిన శృంగార ప్రియులు. ఈవిధముగాఁ బూర్వభాగములోని ప్రధానపాత్రల నన్నిటిని రంగమున నొక్కమారు ప్రదర్శించి కవి పాఠకున కుత్సుకతను రేకెత్తిం చినాఁడు. ఇట్టిరంగము లిం కెన్ని యో కలవు. ఇఁకఁ దా నాడింపఁబోవు నీనాటకమునందుఁ గవి యెన్నుకొనిన నాయికనుగూర్చి యించుక పరిశీ లింతము. వ్యక్తికి వన్నె దెచ్చునది 'గుణముకాని కులముకా' దను సూత్రమును మనసార నమ్మి మనసూరన, యనుస్యూతముగా వచ్చు చున్న 'రాజవంశసంజాతనాయికా' సంప్రదాయప్రవాహమున కెదు రీఁది, సర్వలక్షణోపేత యగు రత్నమువంటి కళావతిని వేశ్యాకులము నుండి యేర్చి కూర్చినాఁడు. ఇట్టినాయికను గూర్చుటలోనే యున్నది సూరనకళావైదగ్ధ్యము.

అస లిందలికథ కంతకును మూలబీజము సత్యలోకమందలి సరస్వతీచతుర్ముఖుల విలాసప్రసంగము. ఆచతుర్ముఖుఁ డెవ్వఁడో కాఁడు, తానే; ఆసరస్వతియు నన్య కాదు, తన వాక్కే. ఆవయసులో సూరనయందు నైసర్గికముగా దాఁగియున్నవిలాసప్రసంగానుభూతియు, కొంటెతనముతోడి కథాకథనవైదగ్ధ్యమునట్టిరసమయసన్నివేశస్ఫురణకుఁ గారణములు నుద్బోధకములును గావచ్చును. ఆభావనాప్రపంచములోఁ బ్రతిఫలించిన తటాకమధ్యమందలి మణిస్తంభమే మన కథలోని మణి స్తంభుఁడుగను, కాసారతీరమందలి సరస్వతీముఖసామీప్యమే సుముఖా సత్తిగను, నాస్తంభమునఁ బ్రతిబింబించిన వాణీముఖమే కళాపూర్ణుఁడు

గను, నాతనిహృదయమే మదాశయుఁడుగను, నాతని దృష్టియే రూపానుభూతిగను, నాపితామహునకుఁ దాత్కాలికముగ నుదయించిన చుంబనేచ్ఛయే మధురలాలసగను దళుక్కున రూపొంది, బీజప్రాయమైన యావిలాసమన్నివేశ మీవిధముగాఁ జిలువలు పలువలై, శాఖోపశాఖలై, బ్రహ్మాండమంతయు నలముకొని, భావుస్వర్గీయసన్నివేశముల నెన్నిటినో యేకసూత్రమున గుదిగూర్చి, మన కన్నులయెదుట మన యనుభవమునకు దగ్గఱగాఁ బ్రదర్శించినది. ఇదియే సూరనలోని భావనాపటిమ, కల్పనానైపుణి.

సాధారణముగాఁ బూర్వకవులు తమ ప్రబంధములలోఁ గథతోడి నిమిత్తమును బ్రయోజనము నున్నను లేకున్నను 'నగరార్ణవశైలాద్యష్టాదశవర్ణన'లను సాంగోపాంగముగా వర్ణించుట వ్యసనమైపోయినది. వానిలోని యేవర్ణనల నేవిధముగాఁ దొలఁగించినను గథకేపాటి లోటును గానరాదు. సూరనయు నగరార్ణవోద్యానసూర్యోదయాదివర్ణనలను గావింపకపోలేదు. కాని యవి ప్రధానకథతో గాఢానుబంధము గలవి. ఇవి లేకున్నచో నసలు కథయే నడవదేమో యనిపించును. నడవనే నడవదు కూడ. ఒక్కయుదాహరణము: విమానవిహారములో నలకూబరునితో రంభ యొనర్చినసూర్యోదయప్రసంగ మొకటి కథారంభముననే కలదు. ఉదయభానుదర్శనమున స్ఫురించిన బ్రహ్మసరస్వతుల సమావేశరూప మగు నాప్రసంగమే మొత్తము కథాగమనమున కంతకును సూత్రధారి. అదియే లేకున్నచోఁ గళాపూర్ణప్రసంగమును, దానిని గలభాషిణి వినుటయు, నామె నారదు నడుగుటయు, దాని నాతఁడు చెప్పరా దని కలభాషిణితోపాటు మనకుఁ గూడ నుత్కంఠను రేకెత్తించుటయు, కథయొక్క యపూర్వరామణీయకమును, విలక్షణమగుకథాశ్రవణఫలశ్రుతియు నాదిగాఁ గల ప్రయోజనము లేవియు నసంభవములే యగును. ఈ యొక్కయుదా

హారణము చాలు సూరనార్యునివర్ణన లెంత సప్రయోజనములో నిరూపించుటకు. ఇంచుమించుగ నీతఁడొనర్చు వర్ణన లన్నియు నిట్టివే. ఇఁక శైలియందమా, యది పలుమాటలతోఁ జెప్పఁబనిలేదు. మఱి, 'మధురత్వ మలవఱచుకొన్న మలయపవనంపుఁగొదమలతో సాటివచ్చు' నని యొక్కమాట చెప్పినఁ జాలును.

ఇందలి పాత్రలు సృష్టిలో లేనివే యైనను గవి, తనభావనాబలముచే మనతోఁ గలసి మెలసి యుండునంతటి సన్నిహితులుగాఁ దననేర్పుఁ బచరించి సజీవములుగాఁ దీర్చి దిద్దినాఁడు. ఇందుల కాతనికిఁ దోడ్పడిన ముఖ్యసాధనము, పురాణప్రసిద్ధపాత్రలతోఁ దనకల్పితపాత్రలను మేళవించు గడుసుఁదనము. రూపకల్పనలోను దాని నావిష్కరించుటయందును సూరనకుఁ గల నేర్పు విలక్షణమైనది. నాయికయగుకలభాషిణియొక్క లోకోత్తరసౌందర్యము నొట్టుపెట్టిన ట్లొక్కపద్యములోఁ గూడ వాచ్యముగా వర్ణింపలేదు. కాని, మృగేంద్రవాహనా బలివ్యాజమునను, దివ్యాప్సరసల మెప్పుల ద్వారమునను, నా సుందరసుకుమారవిగ్రహమును భంగ్యంతరముగా గారడీవానివలె మాకన్నుల యెదుట తళుక్కున సాక్షాత్కరింపఁజేసినాఁడు.

సముద్రమువలె నగాధమైన కథలోని యేయంశమును గవి తానై కంఠోక్తిగాఁ జెప్పక పాత్రలచేతనే చెప్పించుట, యాపాత్రలు చేయుప్రసంగములు నిసర్గరమణీయములుగను, చమత్కారజనకములుగ నుండుటయు సూరనరచనలో గమనింపఁదగిన విశేషము. ఇది, రంభానలకూబరులు, నారదకలభాషిణులు, కలభాషిణీమణికంధరులు, మాయారంభామాయానలకూబరులు, కలభాషిణీసుముఖాసత్తులు, సుగాత్రీశాలీనులు, మణికంధరస్వభావసిద్ధులు, స్వభావసిద్ధమణిస్తంభులు, మణిస్తంభసశ్వదాత్మలు మున్నగువారిప్రసంగములలోఁ గాననగును.

కళాపూర్ణోదయములోఁ బ్రధాన మగురసము శృంగారము. కరుణాద్భుతవీరాదిరసములుకూడ నంగభూతములై దాని కుపస్కారకము లైనవి. ఆ శృంగారముకూడఁ గొన్నిప్రబంధములలోవలె నీచ మగుకామప్రేరితము కాదు. పవిత్ర మగుప్రణయాత్మకము. శారీరకము కాదు, మానసికము. క్షణభంగురము కాదు, శాశ్వతము. సూరన యా శృంగారరసాధిదేవతకు ననేకరూపకల్పనలు చేసి కళామూర్తినిగా నారాధించినాఁడేమో యనిపించును. అట్టిసన్నివేశము లిందు నాల్గైదు గలవు. అన్నిటను మూలసూత్ర మొక్కఁడే యైనను నిర్వాహణములోఁ బరస్పరవిభిన్నములై, ప్రత్యేకాకర్షకములై దేని కదియే వింతచెలువము సంతరించుకొని పాఠకునకుఁ గ్రొంగ్రొత్తరుచులు వెలార్చును.

వానిలోఁ దొలుదొల్త సత్యలోకమునందుఁ గాసారతీరమున శీతలతరుచ్ఛాయను విశ్రమించిన యాదిమదంపతు లగు నాసరస్వతీచతుర్ముఖులవంక నొక్కమాఱు దృష్టి సారింపుఁడు. ప్రాణికోటి కంతకును జిత్రవిచిత్రరూపము లగుచిత్తవృత్తులను బ్రసాదించి బొమ్మలాటలాడించు నాచతుర్ముఖుఁ డిల్లాలు తనకుఁ బాదసంవాహనము సల్పుచుండఁ దద్వినోదములో నాపితామహునకుఁ దాత్కాలికముగా రవంత హృదయస్పందనము కలిగినదఁట! ఆస్పందనమే క్రమపరిపుష్టమై యాతనిని జిన్నచిన్నశృంగారచేష్టలకు దింపినదఁట! శారద, యా చేష్టలను సహజసుందర మగుసంకోచముతో వారింపఁబూనుట, అదియే యుద్బోధకము కాఁగా నాతఁడు విరమింపక మఱి మఱి యట్టి చేష్టలనే సాఁగించుట, ఆగజిబిజిలో వారినడుమ రవంత ప్రణయకలహ మేర్పడుట, యామె కోపము నటించుచుఁ బెడమొగము పెట్టుట, యాకోపము తగ్గించుటకు నప్పటి తమ శృంగారచేష్టలనే కథగా నల్లి సమీపతరుశాఖనే రత్నపంజరములో నున్న కలభాషిణి యనుచిలుకను

మధ్యవర్తినిగ నుంచి దానితో నాకథను వివరించుట, తనమీఁది కథ వినుటలోఁ గోపము చల్లారి వాణి పితామహునకు ననుకూలయగుట మున్నగురీతి నొకశృంగారరంగము సాఁగినది. ఇది చిరానుభవరసికు లగు దంపతుల ముదుసలిముచ్చట్లకుఁ బ్రతిబింబము. ఇందు శాంతముతో మేళవించినశృంగారము పవిత్రతతో నిండినప్రణయము పరమామోదకర మగుపరిహాసము నిగూఢముగా నిమిడి యున్నవి. ఇది దివ్యమగు శృంగారచేష్ట.

రెండవది ముగ్ధమనోహర మగుసుగాత్రీశాలీనుల నిరాడంబర ప్రణయగాథ. ఈజంటలోని శాలీనుఁడు చర్మచక్షువులకుమాత్రము జానపదత్వముతోఁ గూడియున్న యమాయకుఁడు. ఆంతరదృష్టితోఁ బరికించి చూచినయెడల నాడంబరములేని సహజసౌందర్యోపాసకుఁడు సాటిలేని మేటిరసికుడును. కాని, ప్రారంభములో నెల్ల రాతనిని 'వట్టి గొడ్డు తాకట్టు' గానే జమకట్టిరి. కాలక్రమమునఁ బూలతోఁటలోఁ బ్రకృతిసిద్ధముగా సంభవించిన హఠాత్సన్నివేశముచే నావిష్కృత మైన సుగాత్రియొక్క సహజసౌందర్య ముద్దీపకముకాఁగా, నాముగ్ధమనోహారమూర్తులు శృంగారాధిదేవతాప్రణయపరిష్వంగములో వెన్నముద్దలై కరఁగి యచ్ఛమగు హయ్యంగలీనమువలె నేకమైరి. ఆదివ్యముహూర్తములోని వారియనుభవము బ్రహ్మానందసబ్రహ్మచారి.

కలభాషిణీమణికంధరులవంకఁ గనుఁగొన్నచో పాపము! జాలి కలుగును ; విస్మయమ[illegible] బొడసూపును ; విభ్రాంతులము నగుదుము. ఎందుల కనఁగా, వా రొకళ్లొకళ్లను నత్యంతముగా నసమానముగా నిగూఢముగాఁ బ్రేమించుకొని గురుభీతిచే హతాశు లగుటవలన. నిండారినయౌవనముపొంగు తొణికిసలాడు వారిలేజవ్వనపుహృదయకేదారములలో నెన్నెన్నికోరికలో పొటమరించి చివురించి మారాకు వైవకయే కొనలు వాడినవి. ఎన్నెన్నియభిరుచులో పొంగులువాఱి ఫలో

న్ముఖములు కాకుండఁగనే దిగజాఱిపోయినవి. ఒకరొకరి ప్రేమఫలము లను జూరఁగొనుటకుఁ దహతహలాడి వారు పడ్డపాటులకుఁ దగినయను భూతియే లేకపోయినది. ఈసంఘటనము వారి జీవితములోఁ బూర్వ రంగమున మాత్రమే. ఉత్తరరంగమునఁ గాలిడుసరికి భాగ్యదేవత వారిపై దయామృతదృష్టిని గురిపించినది. దాని ఫలితమే తపోవనములోఁ దలవనితలంపుగా వారికోర్కి నెఱవేఱుట.

ఇఁకఁ జెప్పఁ దలఁచుకొన్నది చెప్పవలసినదియు నొక్కటియే ప్రణయగాథ. అది యభినవకౌముదీశల్యాసురులతో సంబంధించినది. ఇందులో నొకరిది యమరభావము; రెండవవారిది యాసురప్రవృత్తి. ఆరెండింటికిని గలయిక యెక్కడ! శల్యాసురుఁ డభినవకౌముదీప్రణయ భిక్షుకై యాజన్మాంతము నఱ్ఱులుచాచి, పడరానిపాట్లు పడి, విఫలుఁడై, విసిగి వేసారి, తుద కామెకారణముగనే ప్రాణములు వీడినాఁడు. ఇది యొకవిధముగాఁ జూచినచో భగ్నప్రేమ; మఱియొకరీతిగాఁ జూచినచో విషాదాంతము రసాభాసమును.

ఇట్టి శృంగారఘట్టములను సూరన కడునేర్పుగా నిర్వహించి నాఁడు. కేవలశృంగారఘట్టములలోనే కాదు కథాకల్పనలో, విచిత్ర సన్నివేశసంఘటనలో, వివిధకథాసంధానములో, వస్త్వైక్యతలోఁ, బ్రతియోగసంఘటనలోఁ, గళాపూర్ణోదయమునందు సూరనపచరించిన కళావైదగ్ధ్యము మాటలలోఁ జూపి చెప్పుట యలవిగానిపని. అది యెవరికి వారే యనుభవించి యానందింపఁదగినదే. ఏమనఁగాఁ, గళా పూర్ణోదయములోఁ గళాపరిపూర్ణత సిద్ధిపొందుట ప్రసిద్ధమే. ఎట్లనఁగా, కావ్యకళ తాల్చురూపము నాటకమో నవలయో ప్రబంధమో యయి యుండును. కళాపూర్ణోదయ మీ మూఁడురూపములలో నేదైనఁ గావచ్చును. అన్నియుఁ గాఁదగును. అందుచేతనే కావ్య కళాశిల్ప మకుంఠితముగా నిచ్చుటనే పరిపూర్ణతనందిన దని యను

టలోఁ దప్పేమియు లేదు. ఇది కాక, కావ్యకళకు సోదరకళలైన సంగీతవిగ్రహశిల్పములను గూడ పరాంకోటి కెక్కించి సూరన సర్వకళాపరిపూర్ణత్వము నొక్కయెడనే ప్రదర్శించినాఁడు. సంగీతము కవిత్వమువలెనే భగవదర్పిత మైనపుడే చరితార్థ మగుననియు, విగ్రహ మచేతన మైనను సచేతనభ్రాంతి గొలిపినపుడే కళ యనిపించుకొను ననియు నాయన ప్రకరణవశముచే నిరూపించినాఁడు. కనుకనే కళాపూర్ణోదయ మనఁగా సర్వకళలును సంపూర్ణోదయ మందిన క్షేత్రమని గ్రంథనామములోనే యాయన సూచించినాఁడు. 'కళాపూర్ణోదయములోఁ గళాపరిపూర్ణత' యనఁగా నిది. ఏవంవిధము లగు విశిష్టగుణములతోఁ గూడిన కావ్యమును గళాపరిపూర్ణముగా గడుసుపోకడలతో నిర్వహించినకవి యాంధ్రముననే కాదు నాయెఱిఁగినంతవఱకు సంస్కృతమునఁగూడ సూరనతక్క దక్కొరుఁడు "న భూతో న భవిష్యతి."*

* ఆల్ ఇండియా రేడియో విజయవాడకేంద్రమువారి సౌజన్యముతో.

# అభిరుచి

## శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ

అభిరుచి యనునది యొక అంతఃకరణవృత్తి అనఁగా మానసిక వ్యాపారము. పశుపక్ష్యాదులకుఁగూడ నిట్టి వృత్తి గలదు. దానిని instinct అందురు. కాని యది యాకస్మికము. ఐచ్ఛికము గాదు. మానవుని యంతఃకరణవృత్తు లట్లుగాక యవి సంకల్పపూర్వకములుగా నుండును. అభిరుచి లక్షణముఁనుగూర్చి "మన మానవస్వభావము నాకర్షించి పవిత్రమై సర్వసంపూర్ణమై లౌకికవస్తువుల ద్వారా అత్యధికానందము నందఁజేయునదియే యభిరుచి"యని రస్కిన్, "కళామయములైన గ్రంథములయందలి విభిన్నగుణముల తారతమ్యములఁ దెలిసికొనునదియే యభిరుచి" యని హాజిల్ట్టును నిర్వచించిరి. దీనిని బట్టి కళలయందలి మంచిచెడ్డల వివేచించి యానందింపఁజేయు సాధనమే యభిరుచి యని తేలుచున్నది. సాధ్యసాధనముల కభేదోపచారముచేఁ గొన్నియెడల ఆనందించుటగూడ అభిరుచి యనఁబడును.

* అభిరుచి ప్రతిమానవునకు నవసరము. మానవుఁడు సంఘమున గౌరవస్థానమునకై ఆరాటపడుచుండును. అభిరుచి యట్టి గౌరవమును సంపాదించుట కొకసాధనము. అదిలేనిచో మానవుఁడు లోలోన సిగ్గుపడుచుండును. తన కట్టి యభిరుచి లేకున్నను ఉన్నట్లభినయించుచుండును. ఒకపద్యమును జదువునప్పు డందలి వ్యంగ్యార్థము తెలియకున్నను పదిమందిలోఁ దనకది తెలిసినట్లుగా నటించును. సంగీతములో నది యేరాగమో ఆరోహణమో యవరోహణమో ...లియనివాఁడుసైతము తెలిసినట్లు తలయూచుచుండును. ఇతర ...లలో నభిరుచి లేకుండుట యంత లోపముగా భావింపఁడుగాని సార

* ఆర్నాల్డ్ బెన్నెట్టు అభిప్రాయముల ననుసరించి వ్రాయఁబడినది.

స్వతమున నభిరుచి లేకున్న నది పెద్దలోపముగాఁ దలంచును. ఇట్లు భావించుట హాస్యాస్పదమేగాక యనర్థదాయకముగూడ. సారస్వతాభిరుచి గౌరవసాధన మనియు, సారస్వతము వినోదమనియు భావించువానికి అభిరుచిగాని సారస్వతాభివృద్ధిగాని చేకూరదు. అతఁడనుకొన్నట్లు అభిరుచి సులభముగా సిద్ధించునది కాదు. అది నిరంతరాభ్యాససాధ్యము. నిరంతరము నియతముగా మహాకవుల మహోన్నతకావ్యములఁ బఠించుటచే నిట్టి యభిరుచి గల్గును. కేవలపఠనము వలన లాభములేదు. పదపదార్థయావద్విశేషావగాహిప్రయత్నపూర్వకమైన పఠనము మాత్రమే యభిరుచిసిద్ధికిఁ గారణము కాఁగలదు. అట్లు గ్రంథపఠనమే యున్నచోఁ గావలసిన యభిరుచి సులభసాధ్య మగును. మొదట కొన్నికావ్యముల నభినందింప లేకపోవచ్చును. నిరంతరాసక్తిచే నభిరుచి కల్గి చక్కగా నానందము నొందవచ్చును.

సంస్కారవిశేషమునుబట్టి యభిరుచియందుఁ దారతమ్యములు గల్గుచుండును. "లోకోభిన్నరుచిః" అను న్యాయమున కిదియే హేతువు. వ్యక్తిస్వాతంత్ర్యముగల యీకాలమున రుచివైవిధ్యము సహజమే. అట్లని ప్రతివాఁడును తన యభిరుచిని యథేష్టముగాఁ బ్రదర్శింపఁగూడదు. సంఘమర్యాదల నుల్లంఘించు వ్యక్తిస్వాతంత్ర్యము అభినందనీయము కాకపోవుటయేగాక దూషణమునకుఁగూడ పాత్ర మగును. నీచసంస్కారము గలవాని యభిరుచి నీచముగాఁ బ్రసరించును. ఉత్తమసంస్కారము గలవాని యభిరుచి యుత్తమముగా నుండును. జగద్వందనీయలైన సీత, సావిత్రి మొదలగు నుత్తమనాయికలయెడ పురోభాగి యగువానియభిరుచి యెంతనీచమో చెప్పనవసరములేదు. తన యభిరుచినిబట్టి వ్యా
మునువ్రాసి "నాకేది చక్కగా నున్న దనితోఁచినదో దానిని వ్రాసితిని. దీని నొకరాక్షేపింపవలసినపనిలేదు" అని తలంచిన లాభములేదు.

లోక మట్టియభిరుచిని సహింపఁజాలదు. సహింపకుండుటయేకాదు, దూషింపకుండ నుండనేరదు. అట్టి యభిరుచి నుపేక్షించినచో నది సంఘనీతి నంతయుఁ బంకిలము గావించును. నీచమైన యభిరుచి ప్రదర్శితమైనప్పుడు సంఘము దాని నుపేక్షించినచో ఆసంఘము నిస్తేజమైన దన్నమాట. సంఘమునకు గౌరవమున్నచో, ఔన్నత్యమున్నచో, మంచిచెడ్డల వివేచించు సామర్థ్య మున్నచో నిర్భయముగా నట్టి సమాజోద్వేజకమైన యభిరుచిని విమర్శించితీఱవలెను. అట్టి విమర్శనము లేభాషలో జరుగుచుండునో ఆభాషమహోన్నతస్థితి నధిగమింపఁగలదు.

కావ్యము మనోహరముగా నున్నదని మనము నిర్ణయింపఁ గల్గినప్పుడు అందేవియో మనోహరత్వకారణము లుండితీఱవలెను. ఆకారణముల నిరూపింపఁగలిగినచో వాని యభిరుచి పరిణతమైన దనియు అట్టివాఁడు సహృదయుఁ డనియుఁ గొనియాడఁబడును. నిరూపింపలేనిచో వానియభిరుచి కించను నైశిత్యము కల్గలేదనియు, అట్టి వాఁడు సాధకుఁడుగాఁ బరిగణింపఁబడును. అభిరుచి నిర్ణయము సహృదయులచే వ్యక్తిగతముగాను, సంఘరూపముగాను గావింపఁబడు చుండును. అభిరుచి నిర్ణయమునుగూర్చి వ్రాయుచు "విలియమ్ జాన్ కార్త్హాప్" అను నాంగ్లపండితోత్తముఁ డిట్లు వివరించెను— "అభిరుచి నొకసంఘము నిర్ణయింపవలసివచ్చినచో మనకు మొదట స్ఫురించునది" పరాసు సాహిత్యపరిషత్తు (French Acadamy) అతి జాగరూకతతో, శ్రద్ధతో భాషకు వలయు నిశ్చితసూత్రములఁ జూపి పవిత్రముగా, ధారాళముగా కళలను శాస్త్రములను వివరించుటయే పరిషత్తుయొక్క ప్రధానకార్యమని తత్స్థాపకుఁ డగు "రిచులూ" నుడివెను. తదనంతరము "పరాసుభాషాలాలిత్యమును గాపాడుటయే" పరిషదుద్దేశమని రీనన్ వక్కాణించెను. ఏవి పరిషదుద్దేశములని వారు పేర్కొనిరో యందేమియు లోపము లేకుండ వారాసంస్థను జయప్రదముగా నిర్వహించిరి.

పరాసు దేశమునఁగల యుత్తమరచయిత లెల్లరు నందు సభ్యులుగా నుండిరి. ఈవిధముగా పరాసుసాహిత్యపరిషత్తు పరాసు దేశప్రాతినిధ్యము వహించుటయేగాక యభిరుచిపట్ల నది పరాసు దేశప్రతిభా వైశద్యమును బ్రతిబింబింపఁజేసెను. పరాసువిప్లవసమయమునఁగూడ నది తనధర్మమును జక్కఁగా నిర్వహించెను. దానియభిరుచియే యా దేశమునఁ బరమ ప్రమాణముగా నంగీకరింపఁబడుచుండెను.

పరాసుసాహిత్యపరిషత్తును, దాని యద్భుతవిజయమును గాంచి ఆంగ్లవిమర్శకు లాశ్చర్యచకితులై తమ దేశమునఁగూడ నట్టిపరిషత్తును నెలకొల్పుట యవసరమని సంభావించిరి. కాని వారికోరిక కొనసాగ లేదు. పరాసు దేశమునకు రాజు నియంత. పరిషత్తునందలి యెన్నికలు రాజుయొక్క యంగీకారానంగీకారములపై నాధారపడి యున్నవి. రాజాధిపత్యమునఁ బరిషత్తు తనయభిరుచిని లోకమునకు వెల్లడి చేయుచుండెను. ప్రజాప్రభుత్వమును నెలకొల్పుకొని యొకరియధికారమును సహింపనోపని యాంగ్లేయుల కిట్టిపరిషత్తు దూరాపాస్తము.

పరిషత్తువంటివే యంతకంటె స్వల్పమైన సంస్థలు సాహితీసంఘములు కొన్ని పలు దేశముల నభిరుచివిషయమునఁ దమనిర్ణయమును దెల్పుచుండెను. ఇట్టిసంఘములు ఇటలీ, ఇంగ్లండు మున్నగు దేశములం దుండెను కాని యీసంఘములలో దేశమునందుఁగల ప్రధానరచయితలందఱికిఁ దగినప్రాతినిధ్యము లేదు. అందువలన నవి సర్వజనాదరణీయము కాకపోయెను.

ప్రజాసామాన్యముకూడ సాముదాయికముగాఁ గాని వ్యక్తిగతముగాఁ గాని కావ్యములయెడఁ దమయభిప్రాయమును (అభిరుచిని) నిర్ణయమొనర్చుట గలదు. ఏవిషయమునుగూర్చియైనను నిట్టిసాముదాయికాభిప్రాయము బలవత్తరమైనది. నాటకమునఁ బ్రేక్షకులు, ఉపన్యాసమున శ్రోతలు ఆయావిషయముల మంచిచెడ్డలనిర్ణయము

గావించినచో దానికిఁ దిరుగు లేదు. నాటకకర్త గాని యుపన్యాసకుఁడు గాని వీరియభిప్రాయమే సిద్ధాంత మని తలంప నవసరము లేదు. కాని తాత్కాలికముగాఁ బ్రజాభిప్రాయమును నడ్డుకొనుశక్తి యెవ్వరికిని లేదు. ఇట్టి ప్రజాభిప్రాయమునందుఁగూడఁ గొంత మంచియుఁ జెడ్డయుఁ గలదు.

1. ప్రజాభిరుచి యెప్పుడును సహజమైనది. సహజాభిరుచి ఉత్తమాభిరుచికి మూలము. ప్రజలందఱు కలిసి సాముదాయికముగా నొకయభిప్రాయమును దెలిపినచో నది సరియైనమార్గమునకు సాధారణముగా దూరము కాదు. అసహ్యము అపథ్య మైనదాని నది నిరాకరించును. సరసమైన యభిరుచినిమాత్రమే యది పరిగ్రహించును.

2. సాహితీసంఘాదులచే నొకప్పుడు కనుఁగొనఁబడిన కవితాశిల్పుల రచనయందలి దంభాదిదోషములను మానవప్రకృతిని జిత్రించుటకంటె కవి తనప్రకృతినే చిత్రించుకొనుచున్నాఁ డనువిషయమును ప్రజాసముదాయము వెంటనే కనిపట్టఁగలదు.

3. ప్రజాసముదాయ మెప్పుడును తెలిసి యన్యాయమార్గమునఁ బ్రవర్తిల్లదు. ప్రత్యేకవిమర్శకుల కుండెడి యసూయాద్వేషాదులు సాముదాయికాభిరుచుల నెన్నఁడు నంటఁజాలవు.

ఈవిధముగాఁ బ్రజాభిరుచులు సాముదాయికముగా గుణవంతములైనను దానియందు లోటుపాట్లు లేకపోలేదు. ఈ సాముదాయికాభిప్రాయము అంగీకారానంగీకారములమాత్రమే ప్రకటింపఁగలదు. అంతకంటె గుణవివేచనము చేయుసామర్థ్యము దానికి లేదు. దీని నిర్ణయము లెప్పుడును ఆవేశముపై నాధారపడిగాని కార్యకారణభావముపొంతపోక వారి యిష్టానుసారముగా నుండును. దాని జ్ఞానము అతిపరిమితము. ఒకప్పుడు తన యజ్ఞానమునుబట్టియు నిర్ణయమునకుఁ గడంగును. ఇతరవిషయము లెఱుంగక తా ననుకొన్నవే యథార్థమనియుఁ దలం

చును. ఆపాతతః గాని తొందరలోఁగాని చేసిన నిర్ణయములగుటచే వీని యభిరుచి ప్రమాణార్హము కాఁజాలదు. అభిరుచివిషయముల సరిగా నిర్ణయింపవలెనన్న మనకుఁ గొంతకాలము పట్టును. కవితాశిల్పమునఁ బారగుఁడైనకవి వ్రాసినకావ్యము తీవ్రసమాధిసాధ్యము. అట్టియెడఁ బైపైవిషయవిచారముచే దానిలోతుపాతులఁ దెలియ శక్యముగాదు. ప్రజాభిప్రాయము గాని, పత్రికలు గాని ఒకసారి చదివి యవతల పాఱవేయఁదగు నవలల, నాటకముల, కథల గుణాగుణముల నిర్ణయింపఁ గల్గును గాని వాని సద్యోవిమర్శనమార్గములు మహాకవికావ్యములఁ జక్కఁగా విమర్శింపఁజాలవు.

ఈవిధముగా సంఘము చిరకాలమునుండి యభిరుచివిషయములఁ దననిర్ణయ మొనరించుచునే యున్నది. ఇంకేసంఘ మొనరించిన నిర్ణయమునుగూడ ప్రామాణికముగా నంగీకరింప వీలులేదు. నిరంకుశాధికారపాలిత మగుటచే పరానుపరిషత్తు లోపసంస్పృష్ట మయ్యెను. విద్యానిధుల ప్రాతినిధ్యము సమగ్రముగా లేకపోవుట సాహిత్యసమితుల నిర్ణయ మంగీకరింపఁ దగదు. ప్రజాసామాన్యాభిప్రాయము వివేకరహిత మగుటచేతను, మొరటుగా తొరగా నిర్ణయింపఁబడుటచేతను ప్రమాణము కాఁజాలదు.

అభిరుచివిషయమున సహృదయులనిర్ణయమే ప్రమాణము కాఁగలదు. సందిగ్ధాంశమును నిర్ణయించుటకై ప్రయత్నించు ప్రతి విమర్శకుఁడును ముందుగా రెండుసూత్రములఁ బాటింపవలెను. (1) అతఁడు న్యాయ్యముగా నిర్ణయింపవలెను. అనఁగా రాగద్వేషాదులు లేక విమర్శనీయాంశమును సోపపత్తికముగాఁ బరిష్కరింపవలెను. (2) తాను గావించిన సిద్ధాంతములను పరమప్రమాణములుగా నంగీకరింపఁబడుచున్నవానితో సరిచూపవలెను. ఈ రెండుసూత్రములలో నేదో యొకదానినిమాత్రమే పాటించుటచే విమర్శనమున లోపములు గల్గుచున్నవి.

అభిరుచివిషయముల సోపపత్తికముగా నిరూపించుట కిఁక నేది పరమప్రమాణమై యుండనోపును. ఈవిషయమున "సర్ జోషువా రైనాల్డ్సు" తన చిత్రకళోపన్యాసముల నిట్లు వచించెను–

"అభిరుచిపట్ల తానే ప్రమాణముగా లోకమునకుఁ దెలియఁ జేసికొను నవీనుఁ డగుశిల్పి తాను ఏకళయం దభిజ్ఞుఁడ నని తలంచు చున్నాఁడో యందే యాతఁడు జ్ఞానశూన్యుఁ డని చెప్పవలెను. వాని ననుసరించువారు సారస్వతపథమున కుంఠితగమను లగుటయే కాక యపమార్గప్రవర్తకులుగూడ నగుచున్నారు. ఇఁక నెవ్వరినినమ్మి కళా గమ్యస్థానమునకు మనము సుఖముగాఁ జేరవచ్చును? అనునది ప్రశ్న. కళామార్గమున జయప్రదముగా వీరవిహార మొనర్చిన శిల్పపారగులే యితరుల నడిపింపఁగల దక్షులు. తరములతరవడి యగ్నిపరీక్షల కాగిన శిల్పుల యేయనల్పశిల్పములు అధునాతనరచనముల కర్హతయే లేని లోకాదరణమునకుఁ బాత్రములై నెగడుచున్నవో యట్టివే యవలంబ నీయములు. ఇంతకాలము వారిప్రతిష్ఠ సుస్థిరముగా నిల్చుటయే వారి రచనములు లోకప్రశంసాపాత్రము లయ్యె ననుటకు నిదర్శనము."

ఆర్నాల్డ్ బెన్నెట్టు ఈవిషయమున నిట్లు తెలిపియున్నాఁడు–

జనసామాన్యమునకు వాఙ్మయాభిరుచి యంతగా లేదు. అట్లని వారికి వాఙ్మయము నెడ నిర్లక్ష్యమును లేదు. అనాదరంబుద్ధిమాత్రమే. ఒక్కొక్కప్పుడు వారియభిరుచి తీవ్రరూపముఁ దాల్చును. కాని యది క్షణమాత్రము. పదిసంవత్సరములక్రింద నొకనవల యద్భుతముగా నున్న దని వేనోళ్లఁ బొగడిన యీజనసామాన్యము నేఁడు దానిమాటైనఁ దలంపదు. వారు దాని నిప్పుడు పఠించినచో వారికే యది యానందము గొలుపదు. అంతమాత్రముచే పూర్వోక్తమైన నవల చెడిపోవను లేదు. వారి యభిరుచి పరిణతమును గా లేదు. శాశ్వతానందసాధనముగాఁ దమ యభిరుచిపై నాధారపడుశక్తి వారి కింకను నలవడలే దని యర్థము. వారి కేది యానందముగొల్పునో వారికే తెలియదు.

అట్లయినచో షేక్స్పియరు మొదలగు మహాకవులకావ్యములు పేర్లు శాశ్వతముగానుండుటకుఁ గారణ మేమి? మహాకావ్యములప్రతిష్ఠ జనసామాన్యముపై నాధారపడకుండుటయే దీనికిఁ గారణము. అట్లే యాధారపడినచో షేక్స్పియ రేనాఁడో విస్మరింపఁబడియుండును. మహాకవుల ప్రతిష్ఠ సహజమైనది. దాని నల్పసంఖ్యాకు లగు సహృదయులు మాత్రమే నిలఁబెట్టుచున్నారు. మహాకవివతంసున కొకనికిఁ దనజీవిత కాలముననే ప్రఖ్యాతి గల్గినను సాధారణకవిని మెచ్చుకొన్న ట్లాతని కవిత్వమును జనసామాన్యము మెచ్చుకొనఁజాలదు. సహృదయుల మెప్పువలననే యాతని కా యున్నతస్థానము లభించినది. తన జీవిత కాలములోఁ బ్రతిష్ఠనొందని కవి మరణానంతరము ప్రతిష్ఠ గాంచినచో నాప్రతిష్ఠకుఁగూడఁ గారణము సహృదయుల స్థిరసంకల్పమే. వా రాకవిని దిగనాడఁజాలరు. దిగనాడరుకూడ. ఆతని బ్రశంసించుచు, నాతని గూర్చి చెప్పుచు, ఆతని గ్రంథములఁ గొనుచు నెంతో పట్టుదలతో నెంతో ప్రమాణముతో నిశ్చితమనస్కులై ప్రవర్తించుటచే జనసామాన్య మాతని పేరు వినుట కలవడి యతఁ డొక ప్రతిభావంతుఁ డనుమాట కంగీకరించును. నిజముగా జనసామాన్యమునకు ఆకవి యేమైనను నవసరము లేదు.

ఒకతరమునుండి మఱియొకతరమునకు ప్రతిభాన్వితుని ప్రతిష్ఠ సహృదయులమూలముననే నిలఁబడుచున్నది. వారు ప్రతిభావంతుని నెప్పుడు నుపేక్షింపఁజాలరు. జనసామాన్య మొకకవిని బొగడినను వేఱొకకవిని దెగడినను వారు దానిని బాటింపరు. జనసామాన్యమున కొకకవిప్రతిష్ఠనుగూర్చి పలుమార్లు తెలుపుచుందురు. నిరూపింతురు. వారు నోరుమూసికొని దాని నంగీకరింతురు. వాఙ్మయమునఁ దమకుఁ గల యత్యంతాసక్తిచేతనే సహృదయులోక మిట్లు గావించుచుండును. వారి కీలోకమునఁ గావలసినది వాఙ్మయమే. తమ పట్టుదలచేతను,

నిరంతరప్రశంసాపౌనఃపున్యముచేతను జనసామాన్యమున కొకకవి ప్రతిష్ఠ నంగీకరింపఁజేయ సమర్థు లగుచున్నారు. వారైనను కారణ పరంపరచే జనసామాన్యము సంగీకరింపఁజేయఁజాలరు. వారు చెప్పెడి కారణపరంపర సామాన్యజనున కర్థమే కాదు. ఒకతరము తరువాత మఱియొకతరము పదివేలపర్యాయములు చెప్పఁగా చెప్పఁగా షేక్స్పియరు గొప్పకవి యని యాతఁ డంగీకరించును. ఈ యంగీకారమైనను కారణపరంపరచేఁగాక మూఢవిశ్వాసముచేతనే.

ఇట్టి సహృదయులు నిరంతరవాఙ్మయాభ్యాసముచేఁ దమయభిరుచుల నుత్తేజన మొనర్చుకొనుచుందురు. అనుభవ మతిశయించు కొలఁది వారియభిరుచికూడ నిశిత మగుచుండును. శేషు చదివినచో విసుగుజనించుగ్రంథము నీనాఁడు వా రభినందింపరు. వారి కొక గ్రంథము విసుగుపుట్టించినచో జనసామాన్య మెంతబాగున్నదని కొట్టుకొన్నను యది వారి కానందము గొల్పదు. వారి కొకగ్రంథ మానందదాయక మైనచో జనసామాన్య మెంతనిరసించినను బాగుగానున్నదనువారి నిశ్చితాభిప్రాయమును మార్పఁజాలదు.

సహృదయుల కానందమును గూర్చుగ్రంథమున కెట్టిలక్షణము లుండును– అనువిషయమున పాశ్చాత్యులు పలువురు పలువిధములుగాఁ జెప్పిరి. ఆర్జన మని కొందఱు, సత్య మని, సౌందర్య మని, జ్ఞాన మని, వివేక మని యింక నెన్నియో లక్షణముల నెందఱో పరిగణించిరి. "ఇదమిత్థ" మని నిర్ణయించుట యసాధ్య మని కొందఱు చెప్పిరి. వారి యభిప్రాయ మిది–

సమర్థులగు విమర్శకులయందే యభిరుచి వైవిధ్యము గానిపించుచున్నది. లోకో భిన్నరుచిః అను సామెత యీవిషయమును ధ్రువపఱచుచున్నది. ఒకజాతి యొనర్చిన విమర్శననిర్ణయములను మఱియొక జాతి నిరాకరించుచున్నది. ఒకేజాతియం దభిరుచి ప్రమాణములు

కాలము గడచినకొలఁది భిన్నభిన్నముగా నున్నవి. ఒకేదేశమున, ఒకేకాలమున సమర్థులైన విమర్శకులుసైతము వారియభిరుచినిర్ణయములపట్ల భిన్నాభిప్రాయులుగా నున్నారు. పోపు చెప్పినది కవిత్వమే కాదని మాథ్యూ ఆర్నాల్డు విమర్శించెను. ఆతనిరచన లన్నియు నత్యుత్తమకావ్యము లని కార్లైల్ అభిప్రాయము. సమర్థులగు విమర్శకులలోనే యభిరుచిభేద మింతవిపరీతముగాఁ గనుపించుచుండ సర్వజనాంగీకారమైన దొకటి యుండఁగల దని నమ్ముట యసంభావ్యము.

ఒకపద్యమును జదివినప్పు డది నా కనిర్వచనీయమైన యానందమును గల్గించును. అప్పు డాపద్యము చాల బాగుగా నున్న దని చెప్పుదును. ఎందువలన బాగున్న దని యెవరైన నడిగిన దానికిఁ గారణము నేను జెప్పలేకపోవచ్చును. సహృదయు లది బాగున్న దని యంగీకరించుటయే నాకుఁ గావలసినది. వాఙ్మయవిధానమునఁ జెప్పుకోఁదగినవిషయ మేమనఁగా సహృదయు లందఱు నొకేవస్తువును మంచిదని సంభావింతురు. వాఙ్మయమునందు వారికిఁ గల యాసక్తినిబట్టి అభిరుచిభేదము లుండవచ్చును. ఆమాత్రపుభేదములు పరిగణనీయములు కావు.

ఈ రుచివైవిధ్యము మన మనుకొన్నంతవిపరీతముగా లేదు. పరికించినచో భిన్నజాతులలోను, కాలములోను, వ్యక్తులలోను గనఁబడెడి వైవిధ్యముకంటె సామ్యమే మిగుల ముఖ్యముగా నున్నది. అట్టిసామ్యమే పొసంగనిచో శాశ్వతవాఙ్మయమే సిద్ధింపదు. మహాకాలములో నెన్నియోవిషయముల నెన్నిమార్పులఁ జూచుచున్నాము. మాఱనివానిలో నొకటి వాఙ్మయము. మూఁడువేలసంవత్సరములనాఁటి హోమరుకవిని ఆనాఁ డాతనిసమకాలికు లెట్లభినందించిరో యీనాఁడును మన మట్లే యభినందించుచున్నాము. ఇట్టివిషయములలో మన మభిరుచిసామ్యమును బాగుగాఁ జూచుచున్నాము. ఈసామ్యమే సారస్వతమునకు కొన్ని యనుగతమైన లక్షణము లున్న వని సూచించుచున్నది.

ఈవిమర్శనమువలనఁ దేలిన సారాంశ మేమనఁగా (1) మహాకవుల యుత్తమకావ్యములే సారస్వతాభిరుచికిఁ బ్రమాణము (2) అన్ని కాలములయందు సహృదయులు దేని నుత్తమమైనదని చెప్పుదురో ఆనిర్ణయమే సారస్వతాభిరుచికిఁ బ్రమాణము.

సంస్కృతవాఙ్మయములోఁగూడ నీ రెండుపద్ధతులు చిరకాలము నుండియుఁ గానవచ్చుచున్నవి. అలంకారగ్రంథములందలి కావ్యలక్షణము లన్నియు మహాకవుల యుత్తమకావ్యములఁ జూచి నిర్ణయింపఁబడినవే.

మనపూర్వులలో సహృదయులగు కవులు విమర్శకులు చిరకాలమునుండి తమ తమ యభిరుచుల వెల్లడించుచువచ్చిరి. సాముదాయికముగా వారు రాజసభలలోను, పరిషత్తులయందును దమయభిరుచుల వ్యక్తము గావించినట్లు తెలియుచున్నది. రాజులు తమ యాస్థానములలో, ఉత్సవసమయములలో నాటకప్రదర్శనములు జరిపినట్లును, అందు సామాజికులు వాని మంచిచెడ్డలను వ్యక్తీకరించినట్లును, అట్లభివ్యక్తములైన వారియభిప్రాయము లాకవి గౌరవాగౌరవములకుఁ గారణభూతము లైనట్లును తెలియుచున్నది. కాళిదాసువంటి మహాకవికూడ తనయభిజ్ఞానశాకుంతలమున

"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం చేతః"

అని సహృదయామోదము నపేక్షించెను. ఇట్టి పరిషత్తు భవభూతి నాటకమును కొంచెపఱచినప్పు డతఁడు వారియభిరుచిని నిగ్రహించి

"యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తా న్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ"

అని యభిరుచిస్వరూపమును వివరించినాఁడు. కాని యీపరిషత్తు లెవ్వియు పరాసుసాహిత్యపరిషత్తువలె స్థిరస్థమైనవి కావు. నాటక ప్రదర్శనమున కాహూతులైన కవిపండితుల సమావేశమే యయ్యాది. అందువలన నీసమావేశములు పరిషత్పదవాచ్యము లగుట కర్హములు గావు.

విక్రమార్క-హర్ష భోజాదిపండితరాజులసభలలో విద్వద్గోష్ఠులు జరిగినట్లు తెలియుచున్నది. వా రాకాలమునఁ గావ్యవిమర్శనము లెట్లుచేసెడివారో వివరము లేనియుఁ దెలియుటలేదు. "ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవం, దండినః పదలాలిత్యం, బాణో చ్ఛిష్టం జగత్సర్వం" అని యాయాకవుల కవిత్వమందలి సారభూతాంశ మును దెల్పుసూక్తులుమాత్రము పరంపరగా వచ్చుచున్నవి. ఇవి రాజసభలలో కవిపండితగోష్ఠులలో నిర్ణీతము లైనవో, సహృదయ విమర్శకుల చాటువాక్యములో తెలియదు.

వ్యక్తిగతముగాఁగూడ సంస్కృతమున కవులు విమర్శకులు తమ యభిరుచిని వెల్లడించిరి. కాళిదాసు—

"త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధకమ్"

సహృదయు లెంతభిన్నరుచిగలవారైనను ఉత్తమకళ నొకేవిధముగా నానందింతురని నుడివెను. భట్టబాణుఁడు ఉదీచ్యులకవిత్వము శ్లేష ప్రాయముగా నుండుననియు, ప్రతీచ్యులకవిత్వము అర్థప్రాధాన్య మనియు, దాక్షిణాత్యులు ఉత్ప్రేక్ష నెక్కువగా వాడుదురనియు, గౌడులకవిత్వమున అక్షరాడంబర మెక్కువగా నుండుననియు నాకాల మున కవితాభిరుచులఁ దెల్పి తనయభిరుచి నిట్లు తెల్పెను—

"నవోర్థో, జాతి రగ్రామ్యా, శ్లేషోఽక్లిష్టః స్ఫుటో రసః
వికటాక్షరబంధశ్చ కృత్స్న మేకత్ర దుర్లభమ్"

ఇట్లే ఈతఁడు తనపూర్వుల కవితారీతులనుగూడఁ దెల్పెను.

ఇట్లే మఱికొందఱుకవులు తమకావ్యములందు కవిత్వాభిరుచుల వ్యక్తము గావించిరి.

విమర్శకు లెట్లు తమయభిరుచులఁ దెలిపిరో చూతము. నాఁటి విమర్శకులు మహాకవులకావ్యములందు నానందసంధాయకములగు లక్షణముల నన్నిటి నేర్చి యొకచోఁ గూర్చిరి. అవియే యలంకార గ్రంథములు, లక్షణగ్రంథము లనఁబడును. లక్షణము లనఁగా కాల క్రమముగా వచ్చిన మహాకవుల యనుభవసారములు. అట్టిలక్షణగ్రంథ ములలో మొదటిది భరతనాట్యశాస్త్రము. ఇది కేవలము నాట్యకళకు సంబంధించిన గ్రంథమగుటచే మనవిమర్శనమున కప్రస్తుతము. సార స్వతాభిరుచి భామహునితోఁ బ్రారంభించె నని చెప్పవచ్చును. మన విమర్శకులు ముందుగా కావ్యస్వరూపమును నిర్వచించి కావ్యాత్మను నిరూపించిరి. కావ్యాత్మను నిరూపించుటలో అభిరుచిభేదములు కాన వచ్చును. మొదట భామహుఁడు అలంకారములే కావ్యాత్మ యనెను. తరువాత వామనుఁడు "రీతి రాత్మా కావ్యస్య" యని రీతిని కావ్యాత్మగా నుగ్గడించెను. పిమ్మట ధ్వన్యాలోకకారుఁడగు ఆనందవర్ధనుఁడు "కావ్య స్యాత్మా ధ్వనిః" అని కావ్యాత్మ ధ్వని యని నిరూపించెను. అనం తరము మఱికొందఱు వక్రోక్తి కావ్యజీవిత మనియు, ఔచిత్యము కావ్య జీవిత మనియుఁ బేర్కొనిరి. ఎవ రెన్నివిధములఁజెప్పినను సంస్కృత భాషాకోవిదు లందఱు ఆనందవర్ధనునిమతమునే యనుసరించిరి. సంస్కృ తమున నిజముగా సారస్వతాభిరుచి ఆనందవర్ధనునివలననే యుద్ధరింపఁ బడిన దని చెప్పవచ్చును. అతఁడు ధ్వని కావ్యమున కెట్లు ఆత్మయగునో మహాకవులగ్రంథములనుండి యుదాహరణము లొసంగి నిరూపించెను. ధ్వనిభేదములలో రసప్రాధాన్యము నుగ్గడించెను. కావ్యములయందు రసపోషణ మెట్లుకావింపవలెనో, రసపోషణతత్పరుఁడైన కవి యలంకా

రాదుల నెంతవఱకు పరిగ్రహింపవలెనో తెలిపెను. మహాభారతము శాంతరసప్రధాన మనియు, రామాయణము కరుణరసప్రధాన మనియు సోపపత్తికముగా నిర్ణయించెను. ఈవిధముగా కావ్యతత్త్వమును విమర్శించినగ్రంథము మఱియొకటి లేదు.

తరువాత పేర్కొనఁదగినవిమర్శకుఁడు మమ్మటుఁడు. ఇతఁడు కావ్యప్రకాశ మనుగ్రంథమును దశవిధప్రకరణములతో పాఠకుల కుపయుక్తమగునట్లువ్రాసెను. ప్రప్రథమముగా విషయవిభాగమును విశకలితముగాఁ గావించినవాఁ డితఁడే యగుటచే నితనికి గొప్పప్రతిష్ఠ వచ్చెను. మహిమాభట్టు ధ్వనిని "అనుమానము"న చేర్చుటను ఖండించిన విషయము తప్ప యిందు జెప్పఁదగిన నవీనాంశ మేదియు లేదు. తరువాత యాలంకారికు లెల్లరు అతనిప్రతిష్ఠను గాంచి కావ్యప్రకాశమునే యనుకరించిరి. అప్పటినుండి యలంకారశాస్త్రమున నూతనవిషయావిష్కరణ మాఁగిపోయెను. తుదకు ధ్వన్యాలోకమార్గము ననుసరించినను చక్కని విమర్శన మెంతయో వెలువడియుండెడిది. ధ్వనికారుఁడు గావించినట్లు కావ్యమునంతయు విమర్శించుటకు వీరు పూనుకొనలేదు. ఏపద్యమున కాపద్యము విమర్శించి గుణదోషపరిశీలన మొనర్చిరి. ఇట్టి విమర్శనముల ననుసరించి వ్రాసినకవులు మంచిమంచిశ్లోకముల వ్రాసిరే కాని సర్వాంగసుందరమైన కావ్యమును వ్రాయలేదు. "కవికర్మ కావ్యం" అను న్యాయము ననుసరించి మంచిశ్లోక మొక్కటియైనను కావ్య మనిపించుకొనును గాన ఉత్తమములైన కొన్నిశ్లోకము లున్నంతమాత్రమునఁ దమకావ్యముల నుత్తమశ్రేణికిఁ జెందినవిగా వారు సంతసించిరి.

మనదేశమున మొదటినుండియుఁ గావ్యపఠనముకంటె శాస్త్రపఠనమునం దాదరణ మెక్కువ. శాస్త్రపఠనము కష్టసాధ్య మగుటచే దాని కాగౌరవము నొసంగిరి. దీనిననుసరించియే "చెడిపోయినశాస్త్రజ్ఞుఁడు కవి యగు" నను ప్రవాదము వచ్చియుండును. కావ్యవిమర్శనకుఁ

గడంగినపుడుకూడ శాస్త్రపద్ధతినే గావించిరి. ఈ విమర్శనములకు శాస్త్రత్వము సాధించిరి. ఇతర శాస్త్రములతోపాటు విమర్శనముకూడ శాస్త్రమై యలంకారశాస్త్ర మనుపేరఁ బరగుచుండెను. ఈవిధముగా శాస్త్రత్వసంపాదనదృష్టిలో యథార్థవిమర్శన మడుగంటెను.

మనకు పెద్దలయందు గౌరవాభిమానము లెక్కువ. వారి దోషముల నుద్ఘాటించుట పాపమని భావింతుము. వారియెడ నెట్టి గౌరవమును జూపుదుమో వారికావ్యములయెడఁగూడ నట్టిగౌరవ మును జూపుచున్నాము. వారి రచనలయందలి లోపముల నెన్నుట దోష మని మిన్నకుందుము. తమ యభిరుచి పరిణతముగాని సాధకు లగుకవులు అంధపరంపరగా వారి ననుకరింపఁజొచ్చిన కావ్యములందలి విరుద్ధరచనలఁ గడగివేయకుంటిమేని యవి సంఘమునకే హాని యొన ర్చును. కవి గురువైననుఁ మిగుల పూజ్యుఁడైనను విమర్శకుఁడు వాని విపరీతరచనల ఖండించి దోషోద్ఘాటనము చేసితీరవలెను. అట్లుచేసిననే యభిరుచి నిశితమై పరిణతము కాఁగలదు. ఒకకావ్యమున దోషము లున్నవని యెఱింగియు మనకుఁ దానితోఁ బనియేమి యని విమర్శకుఁ డుపేక్షింపరాదు. అట్టి దుష్టకావ్యములఁ గొన్ని రచించి తానుగూడ మహాకవి నని ప్రగల్భము లాడుచు సంఘగౌరవమును జూఱఁగొనుటయే కాక తనబోటివారికి నాదర్శకుఁడై సంఘమునకుఁ జేటుతెచ్చును. కావున విమర్శకుఁడు దుష్టకావ్యముల నుపేక్షింపఁగూడదు.

ఒకవేళ విమర్శకుఁడే దుష్టుఁడై యసూయాద్వేషములచే నొక సత్కావ్యమును నిరసించినచో దానివలన సత్కావ్యమున కేమియు లోపము లేదు. సహృదయులగు విమర్శకు లింకను లేకపోలేదు. వారు సత్కావ్యము నిరసింపఁబడుట నెన్నఁడు సైరింపఁజాలరు. ఈకాలమునఁ జాలమందికవులు తమకావ్యములు విమర్శింపఁబడుటను సహింపఁజాల కున్నారు. వారు రచించిన కావ్యము సత్కావ్యమే యైనచో వా

రట్లు విమర్శనలకు భయపడవలసిన యవసరము లేదు. దుర్విమర్శకుల విమర్శనము లెప్పుడు నిలువఁజాలవు. ప్రపంచమున సత్య మొక్కటే నిలుచును గాని తదితర మేదియు నిలువఁజాలదు. తాత్కాలికముగ దుర్విమర్శకులమాట సాగినను ననతికాలములో సహృదయవిమర్శన ములచే వారి విమర్శనములు ఖండితము లగుటచే నాసత్కావ్యమునందలి గుణవిశేషము లనితరసాధ్యమైన లోకప్రశంసకు పాత్రము లగును. కావున కవులు తమకావ్యములు విమర్శింపఁబడుటకు విచారింపకుండు టయే కాక విమర్శింపఁబడవలెననియే కోరుకొనవలెను.

సాధకుఁ డగునొకకవి తా రచించినకావ్య మద్భుతముగా నున్న దని తలంపవచ్చును. సహృదయులు శైలిగాని రసపోషణముగాని పాత్రచిత్రణము కథాకల్పనము గాని సరిగా లేదని యాతని కావ్యము నిరసించినచో నాతఁడు వారిపైఁ గనలి ప్రయోజనము లేదు. తన లోపముల సవరించుకొని తనకవితను సానలఁదీర్చుటకై యత్నింప వలెను. నేఁడు మనము మహాకవు లనుకొనుచున్నవారిలోఁగూడ వారి పూర్వరచనలకంటె ననంతరరచనలు నియతముగా బాగుగా నుం డుటను జూచుచున్నాము. తిక్కన నిర్వచనోత్తరరామాయణమునకు భారతమునకు నెంతయో యంతర మున్నది. అట్లే యెఱ్ఱాప్రెగడ, పింగళి సూరన, తెనాలిరామకృష్ణుఁడు వీరి రచనలలో నట్టిభేదము స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ప్రారంభస్థితిరచనలకును కాకలుతీఱిన రచనలకును నెప్పుడు నిట్టిభేద ముండితీరును. అందువలన సాధకులగు కవులు తమకవితలు విమర్శింపఁబడుట కానందించి పూర్వము తమ కనభివ్యక్తము లగులోపములను సవరించుకొని నూతనకావ్యరచనకుఁ గడంగవలయును. అట్లు చేయువాని కభివృద్ధిసూచన లున్నవి. లేనిచో కవి యసూయాద్వేషపూరితుఁడై సత్కావ్యముల నెన్నఁడు రచింప లేఁడు, సత్కావ్యరచనకు దీక్షయు నంతఃకరణశుద్ధియు నుండవలయును.

ఆంధ్రభాషయం దభిరుచినిర్ణయ మేవిధముగా జరుగుచున్నదో యిఁకఁ బరిశీలింతము. ఆంధ్రభాషకు సంస్కృతభాషతో సన్నిహిత సంబంధ ముండుటచే సంస్కృతకవులయు, విమర్శకులయుఁ బ్రభావ మిందుఁ గన్పట్టును. సంస్కృతలక్షణగ్రంథములే తెలుఁగునకుఁగూడ లక్షణగ్రంథములు. పురాణయుగమునందంతట సంస్కృతగ్రంథాను వాదమే తెలుఁగుకవుల ప్రధానలక్ష్యముగా నుండెను. ఇట్లు సంస్కృత భాషపై తెలుఁగుభాష యెన్నివిధముల నాధారపడియున్నను ఆంధ్ర కవులు స్వతంత్రముగాఁ దమ యభిరుచినిర్ణయము లొనర్పకపోలేదు.

అభిరుచినిర్ణయ మాంధ్రభాషలో వ్యక్తిగతముగాను, సాము దాయికముగాను జరుగుచుండెను. వ్యక్తిగతముగాఁ గవులు కావ్యము లందుఁ దమకవితారీతులఁ దెల్పుచు నభిరుచుల వ్యక్తీకరించిరి. పూర్వ కవిప్రశంస, సుకవిస్తుతి, కుకవినింద— వీనియం దభిరుచినిర్ణయములు కానిపించును. నన్నయభట్టు—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

అని తాను రుచిరార్థసూక్తినిధి ననియు, కవీంద్రులు తనకవిత్వమందలి ప్రసన్నకథాకలితార్థయుక్తిని దలంచి తల లూచునట్లును అది తెలియఁ జాలని యితరులు "అక్షరరమ్యత" నాదరించునట్లును మహాభారత సంహితా రచనబంధురుఁ డయ్యెను. ఇట్లు భారతరచనమున నన్నయ తన యభిరుచిని వ్యక్తీకరించెను. అట్లే తిక్కనసోమయాజి నిర్వచ నోత్తరరామాయణమునఁ దనయభిప్రాయము నిట్లు వెల్లడించెను.

"జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప; వాక్యసాం
గత్యము చేయుచో నయిన గద్యముతోడుగఁ జెప్పిపెట్ట; దా

ర్గత్యము దోఁపఁ బ్రాసముప్రకారము వే అగు నక్షరంబులన్
ప్రత్యనురూప మంచు నిడ ; సూరుల కివ్విధ మింపు నింపదే.”

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునఁ దనపూర్వులవిధానముఁ దెల్పి తా నన్నిట దక్షుఁడ నని చెప్పుకొనెను.

“వచియింతు వేములవాడభీమనభంగి
యుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గమ్మున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తుఁ దిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతుఁ బ్రబంధపరమేశ్వరుని రేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు.”

ఆకాలమున నల్లసానిపెద్దనాదికవుల కవితారీతు లీవిధముగా నిర్ణయింపఁ బడెను.

“అల్లసానివాని యల్లికజిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంభనంబును
(కాకమానిరాయ నీకుఁ దగుర.)”

ఈవిధముగాఁ బూర్వకవులు వ్యక్తిగతముగాఁ దమయభిరుచుల వెల్లడించిరి.

పూర్వము రాజులు కవిపండితపోషకులుగా నుండిరి. రాజసభ లానాఁడు కవిపండితపరిషత్తులు. ఈపరిషత్తులందు అభిరుచినిర్ణయములు జరుగుచుండెను. ఆ పరిషత్ప్రశంస నొందినవారికి లోకములో గౌరవము కల్గుచుండెడిది. తన్నిరాకృతులు పరాభవము నొందుచుండిరి. ఈవిష యము పెద్దన మనుచరిత్రయందు “తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా

విరసుండై కొఱతంబడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్" అని తెలియఁ జేసినాఁడు. కవిపండితపోషకులై యిట్టిపరిషత్తుల కాధారభూతులైన రాజులలో కొలఁదిమందిమాత్రమే పేర్కొనఁదగినవారు. ఇందు మొదటివాఁడు రాజరాజనరేంద్రుఁడు. ఇతనియాస్థానములో నన్నయభట్టు, నారాయణభట్టుకాక యింక నెంతోమంది పండితులు కవులు నున్నట్లు తెలియుచున్నది. ఇతనితరువాతఁ బేర్కొనఁదగినవారు విజయనగరరాజులు. వారిలోఁ గృష్ణదేవరాయలు ప్రథమగణ్యుఁడు. ఇతనియాస్థానమునఁ దెలుఁగుకవు లష్టదిగ్గజము లని పేరువడసినవారు గలరు. వీరేకాక పలుమందిపండితులు, కన్నడకవులుకూడ నీతని యాస్థానమునం దుండిరి. కృష్ణరాయలు స్వయముగాఁ గర్ణాటాంధ్రములందు మంచికవి. తాను గొప్పకవియై మహాకవులనంపఱిని దన యాస్థానమున గౌరవించి యాంధ్రభాషయందు నూతనాభిరుచులకుఁ గారణభూతుఁ డయ్యెను. అంతకుమునుపు కవులు పురాణముల ననువదించుచుండిరి. అల్లసానిపెద్దన యితనియాశ్రయమున మొదటిప్రబంధమును రచించెను. ఇతఁడు కవుల కెన్నియో యగ్రహారము లొసంగెను. పల్లకి తనకేల నెత్తి వారి నూరేగింపఁజేసెను. కవిగండపెండేర మని యొక భూషణమును కవులలో ప్రథమగణ్యుఁ డగు నల్లసానివానిపాదములకు స్వయముగాఁ దొడిగెను. రాజు కవిపోషకుఁడై యింతటి యాదరము చూపునపుడు భాషాపోషణ యేలజరుగదు! భాషాపోషణము బాగుగా జరుగుచున్నప్పుడే నూతనాభిరుచులుకూడఁ గల్గుచుండును. కాలమును బట్టి దేశమునుబట్టి యభిరుచులు మాఱుచుండును. అభిరుచు లెప్పుడు నొకేవిధముగా నుండవు. సహృదయున కొకయభిరుచి బాగుగాఁ గనిపించినచో నది సహృదయులందఱికి న దేవిధముగా నుండును. సంస్కృతాంధ్రములందు సమానముగాఁ గవనము సేయువాఁ డీ కవి గండపెండేరమున కర్హుఁ డని పరిషత్తుముందు పెట్టఁగా అల్లసాని

పెద్దన లేచి తనకవితాభిరుచుల వివరించుచు నొకయుత్పలమాలిక చెప్పెను. "పూఁతమెఱుంగులున్ బసరుపూపబెడంగులుఁ జూపునట్టివా కైతలు? జగ్గునిగ్గు నెనగావలెఁ గమ్మనఁ గమ్మనన్ వలె..." అని కవిత్వతత్త్వ మెఱుంగఁజేసెను. తరువాతఁ బేర్కొనఁదగినవారు రెడ్డిరాజులు. వారిలోఁ గాటయవేముఁడు మొదటివాఁడు. ఇతఁడు స్వయముగా గొప్పపండితుఁడు. ఇతని యాస్థానమున శ్రీనాథుఁడు, వామనభట్టబాణుఁడు మొదలగు కవులు గలరు. వెంకటగిరిరాజులలో సర్వజ్ఞసింగభూపాలుఁ డట్టివాఁడు. ఇతఁడు సంస్కృతమున గొప్పకవి, విమర్శకుఁడును. ఇతని యాస్థానమున విశ్వేశ్వరుఁ డను మహాకవి చమత్కారచంద్రిక యను నలంకారగ్రంథమును రచించెను. ఇంకను బలువురుపండితు లితనియాస్థానమునఁ గలరు. ఆతరువాత తంజావూరు నందలి రఘునాథనాయకుఁడు తనయాస్థానమునఁ బండితులను, గవులను, గాయకుల నాదరించెను. యక్షగానరచన నాఁటి క్రొత్తదనము. ఈ విధముగాఁ రాజాస్థానములు తెలుఁగుభాషయం దభిరుచినిర్ణయ మొనర్చుచు బహుగ్రంథరచనమునఁ దోడ్పడెను.

మన పూర్వకవులు సంస్కృతాంధ్రములందుఁ బ్రావీణ్యము కలవారు. అందువలన సంస్కృతభాషయందలి యభిరుచులను, పదజాలమును నాంధ్రమునఁ జొన్పుట కవకాశము కల్గెను. ఇట్లు సంస్కృతాంధ్రములయందలి పదజాల మంతయుఁ గరతలామలక మగుటచే వారిశైలి ధారాళమై యెచ్చటను గుంటువడక యుండెను. అభిప్రాయములఁ జక్కనిభాషలోఁ బొదువఁగల సామర్థ్యము వారికిఁ గలదు. నేఁటికవులలోఁ జాలమందికి సంస్కృతము రాదు. తారుణ్య మంతయు వీరికి ఆంగ్లభాషాభ్యాసమున వినియుక్త మయ్యెను. ఎంతకృషి యొనర్చినను ఆంగ్లభాషాపదజాల మాంధ్రములో నిముడఁజాలదు. అందువలన వీరికిఁ గల భాషాపదజాల మత్యల్పము. వీరికైతలు క్లిష్టములై,

యభిప్రాయావిష్కరణమున కసమర్థములై యుండుట కిదియే కారణము. కాని యాంగ్లభాష మహోన్నతస్థితియం దుండుటచేతను, ప్రపంచమునందలి మహాకావ్యము లన్నియు నం దనూదితములై యుండుటచేతను, దాని నభ్యసించిన మనకవులు కవిత్వమున నూతనమార్గములఁ ద్రొక్కుటకుఁ గారణ మయ్యెను. వీరికవిత్వమునందలి కుంఠితమైన శైలిని, క్లిష్టతను పూర్వకవితాభిమానులు నిరసింపఁగా వీరు పూర్వకవుల యభిప్రాయదారిద్ర్యమును, కల్పనాదౌర్బల్యమును నిందింపఁజొచ్చిరి. ఇట్లు పరస్పరవిమర్శనములు కొంతకాలము గడచిన పిమ్మట పూర్వకవితాభిమానులు నవీనకవితయందలి గుణముల గ్రహించుచున్నారు. నవ్యకవులును నన్నయాదిప్రాచీనకవులను శిరసా వహించుచున్నారు.

నేఁడు మన దేశమున అభిరుచినిర్ణయ మెట్లుజరుగుచున్నదో కొంత పరికింతము—

1. సాహిత్యపరిషత్తులు-సాహితీసమితులు :-

పరాసుసాహిత్యపరిషత్తును, వంగీయసాహిత్యపరిషత్తు నాదర్శముగాఁ గొని 1911 సంవత్సరమున ఆంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడెను. ఆంధ్రభాషాభిమాను లెల్లరు దీని కాలంబనముగా నుండిరి. ఆనాఁటి విద్వాంసులు, కవులు నిందు సభ్యులుగా నుండిరి. నాఁ డీపరిషత్తునకు సర్వాంధ్రప్రాతినిధ్యము చేకూరెను. ఈపరిషత్తు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక యను నొకపత్రికను నడుపుచున్నది. అందు పూర్వకావ్యముల మంచిచెడ్డలు విమర్శింపఁబడుచుండెను. ఉత్తరహరివంశము, మనుచరిత్ర మొదలగు కావ్యములు పెక్కు విమర్శింపఁబడెను. ఆంధ్రదేశమున మొదటి సారస్వతపత్రిక యిదియే. ఈవిధముగా అభిరుచినిర్ణయమున ఆంధ్రసాహిత్యపరిషత్తు అడుగుజాడలలో నడిచినది;

ఇంతలో వ్యావహారికవాదము బయలుదేఱి పరిషత్తులో చీలి కలు వచ్చెను. వ్యావహారికవాదు లిందుండి విడిపోయి నవ్యసాహిత్య పరిషత్తు నేర్పఱచుకొనిరి. ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రాంథికవాదము నవలంబింపఁగా నవ్యసాహిత్యపరిషత్తు వ్యావహారికవాదము నవలం బించెను. గ్రాంథికవాద మేమనఁగా పూర్వగ్రంథములలో నుపయుక్త మైనభాషనే మనము గ్రంథములలో వ్రాయవలయు నని. అనఁగా గ్రంథస్థ మగుభాష సలక్షణముగా నుండవలయును. నన్నయనాఁటి భాష తిక్కనకాలమునకు, తిక్కననాఁటిభాష రాయలకాలమునకు, ఆనాఁటిభాష యీనాఁటికిని మాఱుచుండుట మనము చూచుచునే యున్నాము. అట్టి సహజమైన భాషాపరిణామమును వీ రంగీకరింతురు. ఈవిషయమున వ్యావహారికవాదులకు వీరికిఁ జాల భేదము కలదు. మనము మాటాడునప్పు డెట్టిభాష నుపయోగింతుమో అదియే వ్రాఁత యందుఁగూడ నుండవలె ననియు, అప్పుడు మాటాడుభాషకు వ్రాయు భాషకు సన్నిహితసంబంధ ముండు ననియు, ప్రస్తుతము అట్టిసంబంధము లే దనియు వీరివాదము. ఇందు కొన్ని యాలోచింపవలసిన విష యము లున్నవి:—

(అ) మాటాడు భాషకు వ్రాఁతభాషకును భేద ముండుట సహజము. వ్రాఁత నిదానముగా సాగును. మాట దానికంటె తొం దరగా సాగును. శీఘ్రోచ్చారణములో కొన్నియక్షరములను తేల్చి పల్కుటయు, మ్రింగుటయు సంభవించును. వ్రాఁతలో నట్లుచేయవలసిన యవసరము లేదు. వ్యక్తిభేదము ననుసరించి యుచ్చారణము మాఱును. అందువలన వ్రాఁతభాషకును మాటాడుభాషకును భేద ముండితీరును.

(ఇ) ఎవరు మాటాడుభాష మనము ప్రమాణముగా గ్రహింప వలయు ననునది రెండవప్రశ్న. దానికి వారు శిష్టవ్యావహారిక మని సమాధానము చెప్పుచున్నారు. కాని యది యాప్రశ్నకు సరియైన

సమాధానము కాదు. ప్రజాప్రభుత్వము గల యీకాలములో శిష్టు లెవరు? అశిష్టు లెవరు? శిష్టత్వమును దేనినిబట్టి నిర్ణయింతురు? జాతినిబట్టి కాదుగదా! ఇఁక విద్యనుబట్టి నిర్ణయింతమన్న విద్యావిహీను లయ్యును చక్కనిభాష వ్యవహరించువారు గలరు. విద్యావంతు లయ్యును అపశబ్దముల వాడువారు కలరు. అందువలన అవ్యాప్త్యతి వ్యాప్తిదోషములచే శిష్టశబ్దము నిరుపయోగము. లేనియెడల ఎవ రెట్లుమాటాడిన నదియెల్ల పరిగ్రాహ్యము కావలెను. అజవదేశములో మాటాడెడిభాషకూడ వ్యావహారికమే యగునుగదా! అప్పుడు తెలుఁగుభాషలో "అపశబ్దభయం నాస్తి" చదువుకొనవలసినబాధ తప్పును. అందఱు సుకరముగా గ్రంథకర్తలు కావచ్చును.

(ఉ) తెలుఁగుదేశములో వ్యవహరించెడిభాషనే వ్యావహారిక భాష యన్నను దీనికిఁగూడ అనుగతి లేదు. వివిధమండలములయందలి భాష విభిన్నముగా నున్నది. ఒకపద మొకమండలములో సాధు వగు చుండఁగా. మఱొకమండలములో అసాధు వగుచున్నది. అదియుఁగాక యొకేమండలమునఁగూడ విభిన్నజాతు లొకేపదమును వివిధముగా వ్యవహరించుచున్నారు.

అందువలన భాష యనుగతముగా నుండవలెనన్న నియమ మవసరము. అట్టినియమ ముండుటవలననే ఆంధ్రదేశమునందలి వివిధ ప్రాంతములవారును నన్నయనాఁటినుండి నేఁటివఱకును గ్రంథస్థ మగు భాష నర్థము చేసికొనుచున్నారు. నేఁడు నవ్యకవులలోఁ గొందఱు భాషకు నియమ మవసర మని గ్రహించుట శుభావహము. ఆంధ్రభాషకు నేఁడు సమగ్రమైన వ్యాకరణము లేనిమాట సత్యమే. అన్నిప్రాంతముల వారును వ్యవహరించుమాటలు కొన్ని వ్యాకరణముచే సాధువులు గానివి కలవు. అట్టిపదములను వ్యాకరణ మంగీకరించుట యవసరము. ఆవిధముగా భాషను సవరింపఁగలవా రెవరు? దీని కెవరోయొకరు

పూనుకొన్న లాభము లేదు. అది సమగ్రమును, సర్వసమ్మత మగు వ్యాకరణము కాఁజాలదు.

ప్రస్తుత మాంధ్రదేశములో మూఁడు విశ్వవిద్యాలయములు గలవు. ప్రసిద్ధికెక్కిన సాహిత్యసంఘములు గలవు. ప్రభుత్వము వీని యవలంబనముతో దేశమునందలి వ్యాకరణవేత్తలను, భాషాతత్త్వశాస్త్రజ్ఞుల సమావేశ మొనరించి వ్యాకరణరచనకుఁ బాల్పడినచో నది సమగ్రము, సర్వసమ్మత మగుట కవకాశము కలదు.

ఈ సాహిత్యపరిషత్తులు కాక నైజాములో ఆంధ్రసారస్వత పరిషత్తును, గుంటూరుమండలమున సాహితీసమితియు, చెన్న పట్టణమునఁ దెనుఁగుభాషాసమితియుఁ గలవు. నైజాముప్రాంతములోని కవులందఱు ఆంధ్రసారస్వతపరిషత్తులో సభ్యులు. ఆంధ్రమునఁ బరీక్షలు పెట్టియు, రచయితలకు బహుమానము లొసంగియు నది యాంధ్ర భాషాభివృద్ధికై పాటుపడుచున్నది. సాహితీసమితి నూతనకావ్యరచనకు మిగులఁ బ్రోత్సాహ మొసఁగెను. నూతనకావ్యవిమర్శనములును, నూతనాభిరుచిప్రదర్శనములు నందుఁ గావింపఁబడెను. తెలుఁగుభాషా సమితి ప్రభుత్వావలంబనమున రచయితలచే నూతనగ్రంథరచనము గావించి బహుమానము లొసంగుచు నాంధ్రభాషాభివృద్ధికిఁ దోడ్పడు చున్నది.

## 2. విశ్వవిద్యాలయములు :-

విశ్వవిద్యాలయములం దున్నతకక్ష్యలలోఁ జదువువిద్యార్థులు ప్రాచీన నవీన విమర్శనపద్ధతు లెఱింగియుంటచేఁ గావ్యములయందలి గుణదోషనిర్ణయ మొనర్ప సమర్థులు. వారు పిమ్మట కవులై, విమర్శకులై, రచయితలై, గురువులై, యనేకకావ్యముల విమర్శించి గుణ దోషనిర్ణయ మొనర్చి నూతనాభిరుచులకుఁ గారణభుతులు కాఁగలరు.

వా రొక కావ్యమును విమర్శింపదొరఁకొనినప్పుడు ఆకావ్యమునకు తత్కర్తకు సారస్వతమున నెట్టిస్థానము గలదో నిర్ణయింపవలెను. ఆకావ్యరచనకు పూర్వకావ్యము లెట్లుతోడ్పడినవో తెలిపి యది యనంతరకావ్యముల కెట్లు మార్గదర్శకము కాఁగలదో నిరూపింపవలెను.

3. రేడియోప్రసంగములు, సారస్వతసభలు :-

ఇవియు భాషాభివృద్ధికిఁ దోడ్పడి యభిరుచిని పెంపొందింపఁగలవు.

4. పత్రికలు :-

పత్రికలు సారస్వతసేవ కత్యంతోపకారకములు. అందుఁ గొన్ని కేవలసారస్వతసేవనే యొనర్చునవి. కొన్ని పాక్షికముగా సారస్వతసేవ యొనర్చునవి. కేవలసారస్వతపత్రికలయందు ప్రాచీన నవీన కావ్యవిమర్శనములు, నూతనకావ్యరచనము, ప్రాచీనకావ్యప్రచురణము జరుగుచున్నవి. సారస్వతాభివృద్ధి ఇట్టిపత్రికల యభివృద్ధి వ్యాప్తివలననే తెలియఁగలదు. అభిరుచు లట్టిసారస్వతపత్రికలయందే యభివృద్ధి చెందఁగలవు.

పాక్షికపత్రికలలో ఇతరవిషయములతోపాటు సారస్వతము కూడ నుండును. కేవలసారస్వతపత్రికలవలె నివియు భాషాసేవ చేయఁగలవు. కొన్ని దినపత్రికలలో ప్రతివారము సారస్వతానుబంధము ప్రకటింపఁబడుచున్నది. అందు నూతనకావ్యములు, విమర్శనములు వెలువడుచున్నవి.

పత్రికాసంపాదకులు గాని తదధిపతులు గాని యీవిధముగా భాషాసేవ చేయుటచే సారస్వతాభిరుచిని పెంపొందించినవా రగుదురు. వారు స్వార్థపరు లైనవో అభిరుచి చెడుటయేకాక సారస్వతముకూడ

నీచమార్గములఁ బట్టును. ఉగాదినాఁడు రేడియోలో నొకమహాకవి పత్రికల విమర్శింపఁగా వినలేని మనదినపత్రికలు గావించిన దౌర్జన్యము నకు బాధపడని సారస్వతేయుఁ డుండఁడని నా యభిప్రాయము.

5. పుస్తకప్రచురణశాలలు :-

ఏతదధిపతులు భాషాభిమానముచేఁ గాని ధనసంపాదనపరులై కాని తమయభిరుచులఁ దెల్పి తదనుకూలముగా గ్రంథరచనమునకుఁ బ్రోత్సాహ మొసంగుచున్నారు. వారియభిరుచు లుత్తమము లైనచో సద్గ్రంథరచనమున కవకాశము గలదు. లేక వారు స్వార్థపరు లైనచో అభిరుచియు భాషయు నధోగతి నొందును.

మనకు స్వరాజ్యము లభించినతరువాత మన కేంద్రప్రభుత్వము భారతీయసారస్వతాభివృద్ధికై "భారతీయసాహిత్యఅకాడమి" నొక దాని నెలకొల్పిరి. ఇందు భరతదేశమునందలి ప్రధానభాష లన్నిటికిని ప్రాతినిధ్యము కలదు. అందుఁ బ్రాతినిధ్యము వహించుటకు యావదాంధ్రామోదమును బడసిన సారస్వతసంఘ మేదియును లేదు. ఈనడుమ హైదరాబాదులో విద్యాశాఖామంత్రులు అఖిలాంధ్రసాహిత్యపరిషత్తు నొకదాని నెలకొల్పిరి. ప్రభుత్వావలంబనము గల పరిషత్తు ఇది యొక్కటియే యగుటచే దీనివలన మహదర్థము నాంధ్రు లాశించుట యతిశయోక్తి కానేరదు.

# మహాశ్వేత

టి. భాస్కరరావు, బి. ఏ. (ఆనర్సు)

అడుగుల సవ్వడి నాలించు నూహతో
    నవహితుఁ డైనట్టు లమరువాని
అతనుతాపము తగ్గి హాయిగా నిద్రలో
    నవశత నందిన ట్లలరువాని
వాయుబంధము సేసి పాపగంధముఁ బాసి
    ప్రస్ఫురత్ప్రభుఁ డట్లు పరఁగువాని
తారహారముతోడఁ దమ్మితూఁడులు దాల్చి
    వింతతాపసుఁ డట్లు వెలయువాని
వారిజాకర శీకర భాసమాన
శీతకరకాంత వేదికాస్థితునిఁ బుండ
రీకు నర్ధనిమీలితాలోకుఁ గాంచి
గుండె లవియంగ శ్వేత గగ్గోలు పడియె.

లోనిప్రాణముల్ వెలికిఁ గే లూని లాగు
తలఁపునం జన్న చంద్రికాధవునిలాగు
సగము తెఱచిన పెదవులసందునుండి
వాని దంతకాంతులు కనంబడుచు నుండె.

చెదరిపోయిన గుండెల నదుముకొన్న
చేతిగోళ్ళకై తపమున శీతకరుఁడు
విముఖుఁ డైయున్న యాతని వీపు చీల్చి
వక్షమందుండి బయటికి వచ్చినాఁడు.

"కనులు పై కెత్తి యొకమాఱు కనుము స్వామి!
బంధనము లెల్ల సడలించి వచ్చినాను;
నేను నీ మహాశ్వేత నీ మౌన మేల?
పిలిచి మన్నించు వేళ కీ యలుక యేల?

పలుకవా స్వామి! నీకోస మలమటించి
యెట్లొ సాహసించితి; దాని కిది ఫలమ్మొ?
పారిజాతమ్ము నొసఁగిన పాణి బిగిసి
పోయెనే! యిప్పు డిట్టి యన్యాయ మేమి?

ఎన్నఁడును నేను నీ తప్పు నెన్న లేదు
నీవు నాపట్లఁ దప్పుఁ గావింప లేదు;
దాసి నీరీతి నిర్దయత్వము వహించి
వదలి వెళ్ళిపోవుట కేమి వచ్చె నిపుడు?

ఎపుడు నీమాటయే నాకు నింటిలోనఁ
గావలయునన్న మా చెల్మికత్తె నడుగు;
ఇంత యాలస్య మైనంతఁ బంతగించి
యిష్టసఖికిఁ గల్పింతురా యెడఁదకోఁత?

పిలువు మయ్య! కపింజలా! పిలువు మయ్య!
ప్రేయసీపదమ్మునకంటెఁ బ్రియతరమ్ము
స్నేహితపదమ్ము; లోకవైచిత్రి యేమొ!
చెల్లెలిని బోలు నన్నుపేక్షింపఁ దగునె?

శర్వరీజాని! పతికి సంశ్రయ మొసంగు!
పార్వతీనాథ! స్వామి జీవమ్ము నిమ్ము!
రతిపతీ! వల్లభునకు సంస్కృతి ఘటింపు!
మలయమారుతా! తెలియవే వలపుగతులు?

మ హా శ్వే త

ఎంత యేడ్చిన నితరుల కేల జాలి ?
బ్రహ్మహత్యామహాపాపఫలము కట్టి
కుడుపదే ! చల్లఁగా నున్న గుండెలోనఁ
జిచ్చు రగిలించి కడకు వంచించినాను.

నా వలపు వట్టి దబ్బర ; నా వియోగ
మాప్తవంచన ; దౌర్భాగ్యరాల నైతి ;
వెనుకముం దాడి బ్రతుకువేవెల్గు నిట్లు
చేతులారంగ నష్టపుచ్చితిని నేను."

అనుచు గోలుగోలున మొత్తుకొనుచు శ్వేత
కాలుసేతులు రాయుచుఁ గౌఁగిలించు
కొనుచుఁ జెక్కిలి నొక్కి చుంబనము గొనుచుఁ
బుండరీకునిపైఁ బడె గుండె లవియ.

హితునిమృతికిఁ బ్రతీకార మెఱుక లేక
తల్లడిల్లు కపింజలుఁ డుల్లమందు
శ్వేతపరిదేవనాక్షరవ్రాతములకు
బిగువు విడనాడి బోరన బెగ్గడిల్లె.

కన్నుల న్నీరు గ్రుక్కుకొంచున్న దాసి
తన చెలిని జూచి బిట్టు రోదనము చేసె ;
లక్షణాత్వముఁ బాసి చెలంగె నభిధ
యై యరణ్యరోదన మప్పు డా నిశీథి.

తెలివి గని, కన్నులను మెల్లఁ దెఱచి, లేచి,
చెంతనున్న దాసిని జూచి చేయిదోయి
సాఁచి, మెడ గౌఁగిలించి, నిశ్శ్వాస మెగయఁ
జారికలవెంటఁ గంటఁ గన్నీరు కాఱ–

"నెచ్చెలీ! స్వామి నను మోసపుచ్చె కాదు-
మోసగించితి నేనె యాయాస పెట్టి;
దిక్కుమాలిన నా పరిదీనయాత్ర
ముగియు నందువా మఱి వందయుగము లైన?

సెలవు దయసేయుమా! కపింజలకుమార!
నిన్ను నేకాకిఁ జేసిననిష్ఠురతకుఁ
బాపదేహముతోడ సంతాప మార
శాపవహ్నికి నన్ను భాజన మొనర్పు!"

అని కపింజలుపాదము లంటి శ్వేత
వేఁడుకొన్నది; వెంటనే విద్యుదాభ
మొకఁడు నిశ్చయరూపమై యుల్లమందు
మెఱసినంతట దాసి దగ్గఱకు వచ్చి-

"ఇంక దీనికై యింత చింతించు టేల?
చితిని రగిలించు సౌహార్దోచితము గాఁగ;
బ్రతికినంతకాలము నీవె బాసట వయి
స్వర్గయాత్రకుఁ గాకపో శక్య మానె?

స్వర్గమున కేఁగి ముందుగా స్వామి యుబుసు
పోక యొంటిగా నేమి చీకాకుపడునొ?
పుణ్య ముండును గార్యనై పుణ్య మొప్ప
మంట చేయవె కోరిక పంట పండ.

పతిని విడనాడి నే విలంబనము చేయ
రాదు; నెచ్చెలీ! దరికొల్పు మాదరమున;
పతగమార్గము నైకొని పతిని జేరి
తియ్యనల నింపుకొందుఁ బత్నిపదమ్ము."

అని వచియించునట్టి సమయమ్మున నాకసమంమునుండి తె
ల్లనికుముదమ్ముఁ బోలినవిలాసముతో, నమృతాచ్ఛమై ప్రభా
ధునివలెఁ దోఁచు పైవలువతో, భుజకీర్తులతో హారాత్తుగా
ముని పడియున్నెడం దిగెను మువ్వురుఁ గన్గొన దివ్యుఁ డెవ్వరో!

"తల్లి! ప్రాణముల్ విడనాడుతలఁపు విడుము!
కలిసికొందువు నీ ప్రాణకాంతు మరల"
నని మహాశ్వేతతోఁ బల్కి యంత నంత
రిక్షు మేఁగెఁ జేతులఁ బుండరీకుతోడ.

పోయినవానిని గని యె
మాయయొ కమ్మి విడినట్లు మాటాడుటకై
వా యాడక యాశ్చర్యము
నాయాసముఁ దోఁప శ్వేత యనియెన్ గడకున్.

"ఏ మిది మహాత్మ! యిది యేమి యిట్టు లయ్యె?
ఎవ్వఁ డీతఁడు వేగ వచింపు మయ్య!
ఎక్కడికిఁ గొనిపోయెనో! యేమి పనియొ
ఎపుడు వచ్చునో యేమొ! ఏ మిది మహాత్మ!

శ్వేతపలుకుల్ కపింజలు చెవులఁ బడక
మునుపె, యతఁడు వల్కము నడుమున బిగించి
"యెత్తుకొనిపోదు నెటకు స్నేహితు" నఁటంచు
దివ్యు వెంబడించెను వియద్వీథి కెగిరి.

విభ్రమము కల్గ నా మువ్వు రభ్రవీధి
లీన మైపోయి రా మరులిప్తలోన;
ఉన్న యా యొక్కయాస్కార మూడిపోయి
శ్వేత యెడఁదలో బెడదలు విడిది చేసె.

“ఏమె యిది! యెఱుఁగుదువే యొకింత! యితఁడు
కూడఁ బోయె నింకేమి సైదోడు మనకు!”
అనుచు రెండుచేతుల దాసి నదిమిపట్టి
యొడలు తెలియని యావేగ మొందె శ్వేత.

“తెలిసెడి దేమున్నది? నె
చ్చెలి! నే నీమేలు కోరి చెప్పెదను; కపిం
జలుఁ డేతెంచువఱకు ని
శ్చల మగు ధైర్యము వహింపు! సర్వము శుభ మౌ!
దివ్యుఁడు పల్కిన దే క
ర్తవ్య మ్మౌ నీకు నాకు; తప్పదు విధి భో
క్తవ్యము; ప్రాప్త్యాశ కలదు;
భవ్యాభవ్యములు రెండుఁ బార్శ్వద్వయ మౌ!
జననీజనకుల విడి యీ
వనభూముల కేఁగుదెంచి ప్రణయాకుల వై
తనువును వీడిన నీ వ
చ్చినదానికి లాభ మేమి చెప్పుము తల్లీ!
చనిపోయినవారలతోఁ
జనిపోయిన నింక నేమి సాధించెదవో!
తను వొందిన దానికిఁ దగు
ననింద్యవర్తనము; దాన నఖిలం బమరున్.
రురు వను ముని, పత్ని ప్రమ
ద్వర క్రూరోరగవిషాగ్నిఁ బ్రాణము వీడన్
ద్వరమతి యై తన బ్రతుకున
నరపాలు నొసఁగి పడఁతికిఁ బ్రాణము తెచ్చెన్.

తన తనయుని కెదురు నిలిచి
రణరంగమునందు నరుఁడు ప్రాణము వీడన్
వెనువెంటనె తననాథుని
వనితామణి యా నులూపి బ్రతికించుకొనెన్.

గురుపుత్త్రుని బాణాగ్నికి
గుఱి యౌ గర్భస్థుఁ డైన కొడుకున కై యు
త్తర వేఁడఁగ శ్రీకృష్ణుఁడు
కరుణాకరుఁ డై సజీవకాయము నొసంగెన్.

అట్టిదె యొక చేదో నీ
పట్టునఁ గావచ్చు; ఉరక ప్రాణము వీడన్
జెట్ట యయిన, నీ నాథుని
కెట్టులు వచియింప నౌనొ యెఱుఁగను మీఁదన్."

అనుచు వారిధారాయంత్రజనితసలిల
వాహినీతుల్యబాష్పప్రవాహమందు
దాసి ప్రియసఖిపాదపద్మద్వయంబు
నోల లాడించె జాలి యాందోళపడఁగ.

దాసి మాటలతోఁ గొంత యాస కలిగి
బ్రతికినంతకాలంబు సంబళము గాఁగ
ననలమును మూట గట్టి నెత్తిని ధరింప
నిశ్చయించుకొన్నది శ్వేత నిబ్బరముగ.

రాతిరి తెల్లవాఱినది; రాపడి నిల్చె నరణ్యమెల్లఁ, గం
జాతములందు నిల్చినవి జాఱియు జాఱని నీటిబొట్లు సం
జాతశుగశ్రులట్లు; ద్విజజాతియు వీడెఁ గులాయముల్ మహా
శ్వేతకుఁ బుండరీకస్మృతి విస్మృతికిం గొని తెచ్చునాహతో.

వేదన లేనిచిత్త మనిపించువిధాన- ప్రభాతవేళ- న
చ్ఛోదసరస్సు నిశ్చలపుఁజూపుల రూపు ధరించెఁ గాని, ని
ర్వేదము కప్పిపుచ్చుట సరేసరి ! శ్వేత స్పృశించినంతలోఁ
బాదు చలించిపోయి పలుభంగము లొందె, విదల్చెఁ దుంపురుల్.

పతికి సమ్మతి యౌ నని పతివిధాన
నారచీర దాలిచి, కమండలువుఁ బట్టి,
యక్షమాల ధరించి, మహోత్కగమను
నార్త్తశరణు మహాశ్వేత యాశ్రయించె.

సంసారనిస్సారసంగతి గ్రహియించి
తన మందభాగినీత్వము నెఱింగి
ప్రతిలేని దారుణవ్యసనపాతము నెంచి
శోకదుర్వారత్వ మాకళించి
పార మీాక్షించి
స్నేహాతిదుఃఖవైశిష్ట్య మెఱిఁగి
నిఖిలభావనల యనిత్యత్వ మూహించి
సౌఖ్యసర్వస్వనశ్వరత తెలిసి
తల్లిదండ్రుల నెల్లబాంధవుల వదలి,
యవయవమ్ములపైని సంయమము నెఱపి
మనమునందుండి విషయవాసనలు గెంటి
నిష్ఠమై గ్రహించెఁ దపస్వినీవ్రతమ్ము

నాఁటిమధ్యాహ్నవేళ గంధర్వమిథున
మాత్మపుత్త్రికావృత్తాంత మఖిల మెఱిఁగి
వెంటఁ గొనిపోద మంచు భావించి వేగ
దైన్యమున వచ్చి చేరి రా వన్యభూమి.

నయమునఁ జెప్పి, ప్రార్థన మొనర్చి, హితోక్తులుగా వచించి, య
న్యాయముఁ దలంచి యేడ్చి, నిరుపాయులుగాఁ దలిదండ్రు లామెని
శ్చయముఁ గదల్పఁజాలక విచారముతో నొకరెండురోజు లుం
డి యరసి యింటి కేఁగిరి కడిందిగ డెందము గొందలింపఁగా.

నాఁడు మొదలుగా నామె దైనందినమ్ము
కఠినపాషాణవేదికాకల్పతల్ప
మందుఁ జేయి తలాడగా నాదుకొనుచు
జహదజహదార్తి యాచు నిశల్ దెమల్చు.

తిమిరముల వెంటఁబడి వచ్చు కుముదపతికి
రాత్రివేళలఁ బట్టు నారాత్రికలకుఁ
బద్మవాసనల్ వెలయు నిశ్శ్వాసగములఁ
గప్పూరపుఁబల్కు లట్టి కంకణము లెత్తు.

ఉదయమున లేచి నిర్మలాచ్ఛోదసరసి
స్నాన మొనరించి, బాష్పపుష్పాలతోడ
ధవు శతసహస్రనామసంస్తవముతోడ
నర్ధనారీశ్వరార్చన మ్మాచరించు.

సర్వకాలమ్ము ఛాయయై సాగివచ్చు
దాసి స్వీకృతస్వీయవ్రతమ్ము గాఁగ
వనఫలమ్ములఁ దెచ్చి భోజన మమర్చు
చెలిమిఁ గా దాడ నోడి భుజించు శ్వేత

రేపులు మాపు లి ట్లనుసరించుచుఁ బావనజీవనమ్ము, సం
తాపముఁ దాపసీవ్రతముఁ దద్గుణముం గని యంగవింపఁ దా
పోపశమక్రియల్ గనక యూరక వా విడి జీవితేశ్వరా
లాపము కాలయాపనకు లక్ష్యముగాఁ గడపుఁ వనమ్ములో.

ఇది

వి యో గ ము

# నృసింహవిలాసము - ఇతివృత్తవిచారము

శ్రీ వి. జి. కృష్ణమాచార్యులు, ఎం. ఏ.

తెలుఁగుబాసలో వెలువడిన క్షేత్రమాహాత్మ్యప్రతిపాదకకావ్య
ములందలి యితివృత్తకల్పనము స్థూలముగా ముత్త్రోవల నడచినదని
నిర్దేశింపవచ్చును.

1. అష్టాదశపురాణములందలి క్షేత్రమాహాత్మ్యప్రతిపాదకభాగ
ములను మూలములుగా గ్రహించి తెలుఁగులో గ్రంథములను రచిం
చుట. కాశీఖండభీమఖండాదు లట్టివి. కాశీఖండమును గావ్యముగ
నొనర్పఁగాఁ దాను 'స్కాందపురాణసంహితకు ఖండము లేఁబది
యందులోన నానందవనానుభావకథనంబున శ్రోతకు వక్తకుఁ శుభా
నందపరంపరావహము నై జగుణాం బని కాశిఖండ మాఁకందు వెలిఁగి'
(1-8) సముకట్టినాఁడఁట కవిసార్వభౌముఁడు. అట్లే 'శ్రీమహాస్కాందం
బను నాదిపురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమ ద్దక్షారామ
భీమేశ్వరమాహాత్మ్యసంయుతం బగుటం జేసి భీమేశ్వరపురాణం బనం
బరంగు నది యాంధ్రభాషాప్రబంధంబునఁ జెప్పఁదొడఁగితి' (1-30) అని
శ్రీనాథుఁడు భీమఖండమున స్పష్ట మొనర్చినాఁడు. ఇట్లు తమగ్రంథము
లకుఁ బురాణమూలకత్వమును వక్కాణించినవా రందఱు విశ్వాస్యులు
కారు. నాఁటి నేఁటి పురాణములప్రతులందలి వైవిధ్యమును నేఁటివారి
యవిశ్వాసమునకు హేతువు గావచ్చును. భట్లపెనుమర్తి కోదండరామ
కవి తాను రచించిన శ్రీకాకుళమాహాత్మ్యప్రతిపాదకముగా వల్లభాభ్యు
దయ మను ప్రబంధమునకు బ్రహ్మాండపురాణోత్తరఖండము మూల
మని నిర్దేశించినాఁడు. ప్రస్తుతము ప్రకటితమైయున్న బ్రహ్మాండపురా
ణమున శ్రీకాకుళమాహాత్మ్యకథ లభ్యము గాదయ్యెనఁట! (వల్లభాభ్యు
దయమునకు శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతిశా
గారలు రచించిన పీఠిక

ఈత్రోవ నడచినవారిలో ననేక పురాణములందలి కథలను గ్రహించి కూర్చినవారు గలరు. ఉదాహరణమునకు స్వప్నమున సాక్షాత్కరించి శ్రేష్ఠలూరి వేంకటార్యుని శ్రీనివాసుఁ డీక్రిందివిధముగా నాజ్ఞాపించినాఁడు.

'ధర సంస్కృత ప్రాకృతముఖభాషలను
ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
నవరించితివి మాకు సంతసం బెసఁగ
నొకకృతి శేషాచలోరువైభవము
ప్రకటితాలంక్రియాస్పదవర్ణనలను
వినువక శృంగార వీ రాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపద లోకులకెల్లఁ దెలివిడి గాన
ద్విపదగాఁ దెలుఁగునఁ దేట గావించు
వారాహ వామన బ్రహ్మాండ పద్మ
గారుడ స్కాంద మార్కండేయ ముఖ్య
బహుపురాణోక్తిసంబాధంబువలన
గహనమై పెనఁగొన్నకథ చిక్కుఁ దీర్చి
శరధిలోఁ గల రత్నజాతంబు లేర్చి
మెఱుఁగుసానను దీర్చి మెలకువ దిద్ది
భూషణం బొనరించుపోలుపున కర్ణ
భూషణంబుగను సల్పుము చెల్వు గుల్క.'

శ్రీనివాసవిలాససేవధి పు. 5, 6

తదాజ్ఞాపాలనఫలమే శ్రీనివాసవిలాససేవధి యను ద్విపద కావ్యము. తరిగొండ వేంకమాంబ రచించిన వేంకటాచలమాహాత్మ్య మును దల్లక్షణసముపేతమే. తెలుఁగులోఁ దొలుతగా స్థలపురాణమును వెలయించిన ఎఱ్ఱయ

'ఏనును బెద్దలచే మును
వీను లలరఁ దరతరంబ విన్నవిధంబుౝ
మానసమున నున్న తెఱఁగుఁ
గానుపునం గన్నక్రమముఁ గథన మొనర్తుౝ.'

నృసింహపు రాణము 1.24

నేఁటి వర్గీకరణపద్ధతికి విదూరుఁ డగు నా మహాకవి 'బ్రహ్మాండాది పురాణోక్తం బయిన శ్రీనరసింహావతారం బను పురాణంబుఁ దెనుంగు బాసఁ బ్రకటింపవలయు' (1-27) ననియు వచించెను. పురాణముల నాధారముగా గ్రహించినవారిలోఁగూడ నిట్టిభేదములు కొన్ని ప్రదర్శింపవచ్చును.

2. రెండవత్రోవ ప్రసిద్ధమగు కథతో వారు కన్నవానినో విన్నవానినో జతపఱిచి వస్తువు నేర్పఱుచుకొనుట. సుగ్గము పాపిశెట్టి రచించిన నవనారసింహచరిత్రము, పైడిపాటి వేంకటనృసింహకవి రచించిన లక్ష్మీనృసింహావిలాసము మున్నగునవి యట్టివస్తుకథనము గలవి. ఆగ్రంథములలో భాగవతాది ప్రాచీనగ్రంథములలోఁ బ్రసిద్ధముగా నున్న ప్రహ్లాదునికథతోపాటు నహోబలపతి శబరకన్యావిలాసాకృష్టుఁ డగుటయు వివరింపఁబడినది. శబరకన్య నహోబలపతి వివాహమాడుట పురాణములలోఁ గన్పట్టునది కాదు.

3. వారు విన్నవానినో స్వయముగాఁ గన్నవానినో స్వీకరించి మాహాత్మ్యమును బ్రతిపాదించుట. ఓబయమంత్రి రచించిన గరుడాచలవిలాసము, వీరరాఘవకవి వ్రాసిన నృసింహావిలాసము మున్నగు గ్రంథములందలి యితివృత్త మా యా కవులు విన్న దని నిరూపింప నవకాశము గలదు. కాఁగా పండితారాధ్యుల నాగలింగకవి వ్రాసిన పట్టాభిరామవిలాసము, దళవాయి తిమ్మభూపాలుఁడు వ్రాసిన ప్రసన్నవేంకటేశ్వరవిలాసము మున్నగుకావ్యములందలి యితివృత్తము కన్నది

గావలెను. లేకున్నచో నుత్పాద్యము గావలెను. పట్టాభిరామవిలాసమునఁ దత్కృతిపతి యగు మానూరి వేంకటరాయఁడు హాజుగణేశు పేటలోఁ బట్టాభిరాముని బ్రతిష్ఠించుట వర్ణింపఁబడినది. ఉపోద్ఘాతముగా శ్రీరామకథ వ్రాయఁబడినది. ప్రసన్నవేంకటేశ్వరుఁడు రాయదుర్గపుర వీథుల నూరేగించుచుండఁ గళావతి యను వేశ్యాకన్యక స్వామిని మోహించుట, స్వామి యామెపాణిగ్రహణ మొనర్చుట దళవాయి తిమ్మభూపాలుఁడు స్వీకరించిన వస్తువు. నిశితముగాఁ బరిశీలించినచో నవాంతరభేదము లేమైనఁ జూపట్టవచ్చును.

విన్నది కానిండు ఉత్పాద్య మగు నితివృత్తమును గ్రహించి ... మును బ్రతిపాదించిన కొందఱుకవుల గ్రంథములను బరిశీలింతము. నాఁటికిఁ బురాణకావ్యప్రసిద్ధము గానిచో నా వస్తు వుత్పాద్య మనకతప్పదు. అహోబలక్షేత్రమాహాత్మ్యమును దొలుతగాఁ గావ్యముగా రచించినవాఁ డెఱ్ఱయ. లక్ష్మీనృసింహావతార మని ఎఱ్ఱయ వాడుకచేసినను అహోబలమాహాత్మ్య మను వాడుక యాగ్రంథమునకుఁ బ్రాచీనకాలమున లేకపోలేదు. (ప్రకారములోని స్వరమే నిల్చినందుకుఁ బ్రబంధపరమేశ్వరుఁడు చెప్పిన అహోబలమాహాత్మ్యమునందలి కాకునూరి అప్పకవి–అప్పకవీయము 2వ ఆ. 89) అహోబలమునకు గరుడాద్రి యని నామాంతరము. నృసింహుఁడు తన్ను ప్రస్తుతించినవారితో నీక్రిందివిధముగాఁ బల్కినాఁడు. 'మీరు మదీయబలం బహోబలశబ్దపూర్వకంబుగాఁ బ్రశంసించితిరి గావున నీతీర్థం బహోబలనామధేయంబునఁ ద్రిభువనపావనంబై వెలయుంగాత నాచేత నధిరూఢం బైన యిగ్గిరియును గరుడాద్రి యనం బ్రఖ్యాతి వహించునని యానతిచ్చె.' నృసింహపురాణము 5–122.

ఈక్షేత్రము తెలుఁగునాఁట సుప్రసిద్ధము. భైరవుని శ్రీరంగమహాత్మ్యమున నొకతపసి 'సన్నుతించె నహోబలస్వామి'ని (4వ

ఆ. ప. 749.) మణికంధరుఁడు 'శ్రీమ దహోబలస్వామి పాదనభోడు జాలసంఘము ఫాలశశికి నొసఁగి' (కళాపూర్ణోదయము 2–118) ధన్యుఁ డైనాఁడు. ములుపాక బుచ్చనశాస్త్రికవి వేంకటేశ్వరమాహాత్మ్యమున నారదుఁడు భృగువుతో శేషాచలమునకు 'మధ్యప్రదేశమై మఱి వెలుఁగొందు నహోబలం బఖిలదుర్గ్యోగహారము' (1వ ఆ) అని వచించినాఁడు. ఆ క్షేత్రపాపైకదాహకత్వ మట్టిది.

ఓబయమంత్రి, వేంకటసూరి రచించిన గరుడాచలవిలాసములను, వీరరాఘవకవి వ్రాసిన నృసింహవిలాసమును మూఁడవత్రోవగా నిరూపింపఁబడిన వస్తువు గలవానికి నుదాహరణములుగా గ్రహింతము. ఈ మూఁడిటియందలి వస్తువులో భేదము లేదు.

## 1. గరుడాచలవిలాసము—ఓబయమంత్రి :

గరుడాచలవిలాసము గరుడాచలదేవున కంకితముగా రచింపఁబడిన యక్షగానము. ఓబయమంత్రి 'వన్నెకెక్కిన నందవరశాసనుండు' 'చిన్నమాంబాగర్భసింధుచంద్రుండు'. ఇతరకృతులు తెలియరావు. కాలమును నిర్ణయించుట కాధారములు చూపట్టవు.

వేదాచలముపైని విహరింప నహోబలపతి యెన్నఁగాఁ బరిచారకులు భవననిర్మాణము గావించిరి. లక్ష్మితో నాతఁ డాసౌధమునఁ గొలువుదీర్చెను. సురలు, మునులు వచ్చి ప్రస్తుతించిరి. వారిని వారి నివాసముల కనిచి యంతఃపురమున కేతెంచి లక్ష్మితో భుజించి యూడిగపుసతులు వీడ్యము సమర్పణ సేయ చర్వణ మొనర్చుచు వేదాచలమును గనుఁగొనివత్తు నని లక్ష్మికిఁ దెల్పెను. ఆమె యంగీకరించెను. భక్తుల కన్నుఁబ్రామి యాటవికునివేషము ధరించి తిరుగుచు నొకచోఁ జెంచుపడంతిని గాంచి మోహించెను. మన్మథమన్మథుఁ డాశబరకన్యా విలాసములను గాంచి

'చెంచుదానికి యీ మిటారపు చెలువ మేలా కలుగును
చెంచుకోమలి గాదు ఇది క్రొమ్మించు గాని
(?)
కలియఁగను క్రొమ్మించు గా దిది కలికి గాని కన్నుల
కలికి గా దిది మరుని క్రొన్ననములికి గాని
ములికి గా దిది తేటకపురపుపలుకు గాని కపురపు
పలుకు గా దిది సొబగుముద్దులచిలుక గాని'
'అని యిట్టు లింతిరూపము
మనమునఁ దలపోసి మిగుల మమత దలిర్పన్
వనరుహనాభుఁడు గ్రక్కున
చనవున (నా) చెంచువనితసన్నిధి కరిగెన్.'

ఆచెంచుపడఁతి కిరాతవల్లభుఁ డగు చికినాయకుని కూఁతురు. వారిరువురకు గాంధర్వవివాహము జరిగినది. లక్ష్మి విభునికొఱకుఁ బ్రతీక్షించి

'చాల వగచుచుఁ దనప్రాణసఖుల కనియె
ఇందుముఖులార గరుడాద్రి కేగి మీరు
హరిని తోడుక ర' మ్మని యనియెను.

ఇంతలోఁ గలహాశనుఁ డేతెంచి చికినాయకునికూఁతుతో హరి క్రీడించుచున్నాఁ డని యెఱిఁగించెను. ఆమె కోపకషాయితలోచనయై చెంచెతతోఁ గూడి హరి వచ్చినను ద్వారములు తీయవల దని పరిచారకుల నాజ్ఞాపించి కోపగృహమున శయ్యాతలమునఁ బవ్వళించినది. వారు వచ్చిరి. దక్షిణనాయకుఁ డగు హరి లక్ష్మిని

'కుటిలకుంతల నీదు కోపంబు మానినను
పటుపద్మరాగముల్ పదక మే నిత్తున్
మురిపెంపు (నీదు) నెమ్మోము జూపినను ఈ

కరమొప్పు వజ్రాలకడియంబు లిత్తుఁగా
ఏణాక్షి నాతోడ ఎనసి మాటాడినను
ఆణిముత్యపు కంఠహారంబు లిత్తుఁగా
ననుఁ జూచి చిఱునవ్వు నవ్వితే సొంపునను
కౌస్తుభరత్నభూషణము నీ కిత్తుఁగా
సన్నుతాంగిరో నీవు చన విచ్చి యేలితె
ఉన్నతపు ఉరమెక్కి ఉండంగనిత్తుఁగా.'

యని యనునయించినాఁడు. ప్రార్థించినాఁడు. ఆమెకోప ముపశ మించెను. లక్ష్మి వారిరువురకు వివాహము గావించెను. ఇంతలోఁ జికినాయకుఁ డేతెంచి వాదులాడ లక్ష్మి యుంకువ యొసఁగి వివాహమున కామోదము పొందెను. నాఁటినుండి యహోబలనృసింహుఁడు 'చెంచు బలఁగము నేలి వారిలో చేరి తాను మెలఁగుచు చెంచుఓబళపతి యనంగ ప్రసిద్ధి కెక్కెఁగా.' ఈయక్షగానమున 'బహుకొండరుపురులు, పరమభాగోత్తముల్, కనకమేడలు, తోడుక' వంటి యలాక్షణిక ప్రయోగములు సాధారణములు.

## 2. గరుడాచలవిలాసము—వేంకటసూరి :

'గరుడాచలవిలాసంబు నృసింహనాటకంబు' చేసిన వేంకటసూరి నారాయణసూరి పుత్త్రుఁడు. ఈ యక్షగానమందలి ఇతివృత్తమునకును ఓబయమంత్రి యక్షగానమందలి వస్తువునకును భేదము లేదు. కాని లక్ష్మిచెలియ హరిదాసి యనునామము గలది. ఈనాటకమున వర్ణ నములపాలు మించినది. సంవాదభాగము విస్తరింపఁబడినది. చెంచు పడఁతి విరసముగా ననుచితముగా నిట్లన్నది.

'మగవా రని పే రొకటె
మగతన మింతైన లేదు మగవారియెడఁగా

మగువల కనఁగానే కల
యఁగవలె ననుట యిది ఫణిశయానా వినుమా.'

పూర్వోత్తరభాగము లీపద్యమందు పొసఁగుట కష్టము. ఆపడఁతి
ాతువాదము మనకుఁ దెలియవచ్చుట లేదు. అహోబలపతి సమా
ాన మంతకంటె నీచము. జుగుప్సాకరము.

'కుసుమసుగంధిరో వినుము గోకులమం దుదయించె పెన్కసా
హసుఁ డగు శౌరి షోడశసహస్రవధూమణులన్ రమించె నీ
వసుధ నటంచు నాతనికి వారిజలోచన లెల్ల కూడి పే
రొసఁగి రెఱుంగవే మగశిరోమణి యంచు నుతింప మానినీ.'

లక్ష్మి ప్రియుని మించినది. ఆమె వాపోయినతీరు చూడుఁడు.

'ఘనులార కానరే పాపసంహరుని చా
రణులార కానరే రాజముఖుని
ద్రుమములార కనరె దుఃఖసంహరుని సం
యములార కానరే కమలనయను
సురలార కానరే సురరాజనుతుని కి
న్నరులార కానరే నాగశయను
జనులార కానరే జన్మసంహరుని శ
కునులార (?) కానరే కుందరదను
మధుకరములార కానరే మదనజనకు
బర్హిణములార కానరే భద్రకరుని
కలరవములార చక్రవాకంబులార
శుకపికములార కానరే శుభచరిత్రు.'

ఆమె యన్వేషణములోఁ దృప్తిపడక మన్మథదూషణము
గావించినది.

'నీగర్వ మెందాక నిలుచులేరా హరి
చేరి నే యుపరతి చేయుదాక
నీయార్పు లెందాక నిలుచునురా హరి
ఆర్తిచే నా తాప మార్చుదాక
నీబాణ మెందాక నిలుచునురా హరి
కరుణించి నాతోడ కలియుదాక
నీవు నాముందుగ నిలుచుట లెందాక
హరియు నే నొక్కటి యయ్యెదాక
పిమ్మటను ఏమిచేతువు పిరికికూన
ఎప్పు డాసమయం బని ఎదురుజూతు

* * *

* * *

తొలిపద్యము గోపికలు శరన్నిశల కృష్ణు నన్వేషించు నెడ పోతన వ్రాసిన భావములకుఁ బ్రతిబింబాకారసంవాదముగా మలిపద్యము స్వతంత్రము. 'వస్తివి. బంటి' మున్నగు భ్రష్టరూపములు కొల్లలు.

3. నృసింహవిలాసము (శబరకన్యాపరిణయము)—వీరరాఘవకవి:

కవి 'శ్రీనృసింహసంబంధకథానుబంధంబుగా నొక్కప్రబంధంబు రచియింపఁబూని యొక్కసుదినంబున హరిపదారాధన' పరుండై పరుండ స్వప్నమున సాక్షాత్కరించి కృతి మత్పదాంకితము గావింపు మన్నాఁడు. ఈ ప్రబంధమున మూఁ డాశ్వాసము లున్నవి. వీరరాఘున యతి కవి కాచార్యుఁడు. కవి కృష్ణపాటికులకలశజలధిహిమకరుఁ డగు నృసింహార్యునకు మూఁడవభార్యవలనఁ గలిగినవాఁడు.

కవిత్వము ప్రబంధసాధారణము. మాధవుఁడు శబరకన్యతో
'పలుకులు చిల్క లియ్యధరపాక మె ద్రాక్ష కుచంబు లొప్పగు
బ్బలులు భుజంబులే లతలు పాణితలంబులె మావు లింపున

వ్వులు తెలిమల్లెపూ లనుచు బోటికి నివ్వనరాశి లక్ష్మిగా
దలఁచియెకాదె మాధవతఁ దాల్చుట నే నిట నీదుబాసటన్.'

1వ ఆ.

అని శ్లేషచమత్కారము చూపినాఁడు. నృహరి శబరకన్యను

'సురపొన్నతరువుల నొరసి యల్లిన మల్లి
కాకుంజమంటపాంగణమునందు
పరమశీతల మైన పటికంపువేదిపై
తటిన రాలిన కమ్మవిరులు పొదల
పఱుపుపై యావధూవరులు చేర సమీర
దత్తసూనములు తత్తచ్ఛిరముల
రాలుఁరీతులు దలఁబ్రాలుగా ద్విజగణ
ధ్వనులు విధ్యుక్తమంత్రములు గాఁగ
శ్వసనపూరితకీచకరంధ్రధ్వనులు
కాహళులు గాఁగఁ దత్కరకంకణార
వములు మంగళవేద్యవాద్యములు గాఁగ.'

2వ ఆ.

వరియించినాఁడు. ఈగ్రంథమునఁ జికినాయకునికూఁతురు నీలాంశజగా నిరూపింపఁబడుట విశేషము.

వెంకటేశ్వరమహత్త్వప్రతిపాదక మగు శ్రీనివాసవిలాససేవధి యందుఁ బంచమాశ్వాసమున నారాయణపురమున విష్ణుభక్తుఁ డగు నాకాశరాజు దండనదీతీరధరణి శోధించునెడ లభించిన కన్యాకారత్న మగు పద్మినిని చెంచువానిరూపమున నాఖేటక్రీడాలోలుఁ డైన శ్రీని వాసుఁడు గాంచి మోహించి యుద్వాహమాడుట వర్ణింపఁబడినది. కృత యుగమున హరిని వివాహమాడఁ దపస్సు చేసిన వేదవతి త్రేత యుగమున రావణసంహారమునకుఁ దోడ్పడి ద్వాపరమునఁ గృష్ణుఁ

గూడలేక యనంతరము పద్మినిగా జన్మమొందుటను శ్రీనివాసుఁడే వివరించినాఁడు. తఱిగొండ వేంకమాంబ వ్రాసిన వేంకటాచలమాహాత్మ్యమునఁ జతుర్థపంచమాశ్వాసములలో నీకథ స్థానము సంపాదించినది. ఆమె చతుర్థాశ్వాసమున

'అని యిష్టదేవతాప్రార్థనం బొనరించి
వేడ్కఁ గొల్పెదు ఘన వేంకటాద్రి
మాహాత్మ్యమునను వరాహపురాణంబు
ముప్పదియధ్యాయములను దొలుత
మొనసి మూఁడాశ్వాసములు చేసి యావరా
హస్వామి కర్పించి యవల నెడఁద
రహిని భవిష్యోత్తరపురాణమున శ్రీని
వాసువిలాసము వ్యాసుఁ డయందుఁ
బ్రజకుఁ దెలియంగఁ జేటగఁ బద్యరీతి
ధృతి రచింతును దఱికుండన్నృహరికృపను
దప్పు లుండినఁ దగ దిద్ది యొప్పుగాను
జదువవెంచెద బుధులార సదయులార.'

అనుటచే నాకథ భవిష్యోత్తరపురాణమూలక మని స్పష్టపడుచున్నది. చెళ్లపిళ్ల నరసకవి రచించిన వేంకటేశ్వరవిలాసమందలి కథయు వేంకటేశ్వరుఁడు చెంచుకన్నియ నుద్వాహమాడుటనుగూర్చి ప్రవర్తించినది. ఆ చెంచుకన్నియ భూదేవి యవతార మని సమర్థించి తుదకు నలమేల్మంగకును, చెంచుకన్నెకును సవతులకయ్య ముపక్రమింపఁజేసినాఁడు. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తమ యుపోద్ఘాతములో 'ఈ కథ నితఁ డేపురాణమునుండి కైకొనెనో చూతమన్న నాసంగతి యంతకు మున్నె తెలియదు. చాలవఱ కిది కల్పితమేమో యని యూహింపవలసి యున్న' దని (పుట 7) వ్రాసినారు. ఈకథలతో నహోబిల

క్షేత్రస్వామి విలాసమును వర్ణించు గ్రంథములందలి వస్తువు తుల్యము. ఏతాదృశకథాసంయోజనము నైకక్షేత్రమాహాత్మ్యసాధారణ మగుటచే నితివృత్తము పురాణమూలకమా, ఉత్పాద్యమా యని విచారింపవలసివచ్చినది.

ఏతత్కథాకల్పనమందలి సాధారణలక్షణములను నిర్దేశించి ప్రయోజనమును నివేదింతును.

1 లక్ష్మికంటె భిన్నురాలగు కన్యను క్షేత్రస్వామి వివాహమాడుట.

2 నారదుఁడు సవతులకయ్యమును ప్రేరేచుట.

3 హరి దక్షిణనాయకుఁ డగుటచే నిరువురను సమాధానించి యేలుకొనుట.

4 ఆ వివాహ మసంబద్ధముగాఁ గన్పట్టునేమో యను సందేహమువలనఁ గాఁబోలు నా చెంచుకన్నియయందో, సాధారణుని పుత్త్రికయందో భూదేవీనీలలయంశ లారోపితములగుట.

యక్షగానములలేని నీలాంశత్వారోపము వీరరాఘవకవి నృసింహవిలాసమునఁ గన్పట్టు టీకథయందలి క్రమిక పరిణామమునకు నిదర్శనముగాఁ దోఁచుచున్నది.

'నరసింహదేవ నీ వా
యరణ్యమున భిల్లకన్య యగు చెంచిత డ
గ్గఱి వరియించినకథ న
ర్థి రచించెద' నన్న పైడిపాటి వేంకటనృసింహకవి యహోబలనృసింహుఁ డుద్వాహమాడిన శబరకన్య వసుంధర యనియు చికిలినాయకుఁడు భార్యతోఁగూడి పూర్వజన్మమునఁ గావించిన తపస్సునకు

ఫలముగా ధరిత్రి నీజన్మమునఁ గాన్పుగాఁ బడసె ననియు వివరించి నాఁడు. ఈ కథాసంయోజనము, పరిణామము అపూర్వములుగా దోఁచుచున్నవి.

1. A discriptive catalogue of the Telugu manuscripts in the Tanjore Maharaja serfoji sarsvati Mahal library 479, 80 సంఖ్యలక్రింద నీగ్రంథవర్ణనము చూడనగును. ఆంధ్రవిశ్వవిద్యాలయ మందలి వ్రాఁతపతి నా కాధారము.

2. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకాగారమునందలి R 1571 సంఖ్య వ్రాఁతప్రతి. ఈగ్రంథము నేఁటికి వెలువడిన కేటలాగులలో వర్ణింపఁ బడలేదు. ఇటీవల సేకరింపఁబడినది.

3. ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథాలయమున 2616 సంఖ్య గల తాళపత్రప్రతి

4. పైడిపాటి వేంకటనృసింహకవి లక్ష్మీనృసింహవిలాసము మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకాగారము వారి A descriptive catalogue of Telugu manuscriptsVol. II లో 733 సంఖ్య గలదు.

ఫలముగా ధరిత్రి నీజన్మమునఁ గాన్పుగాఁ బడసె ననియు వివరించి నాఁడు. ఈ కథాసంయోజనము, పరిణామము అపూర్వములుగా దోఁచుచున్నవి.

1. A discriptive catalogue of the Telugu manuscripts in the Tanjore Mahāraja serfoji sarsvati Mahal library 479, 80 సంఖ్యలక్రింద నీగ్రంథవర్ణనము చూడనగును. ఆంధ్రవిశ్వవిద్యాలయ మందలి వ్రాఁతపతి నా కాధారము.

2. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకాగారమునందలి R 1571 సంఖ్య వ్రాఁతప్రతి. ఈగ్రంథము నేఁటికి వెలువడిన కేటలాగులలో వర్ణింపఁ బడలేదు. ఇటీవల సేకరింపఁబడినది.

3. ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథాలయమున 2616 సంఖ్య గల తాళపత్త్రప్రతి

4. పైడిపాటి వేంకటనృసింహాకవి లక్ష్మీనృసింహావిలాసము మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకాగారము వారి A descriptive catalogue of Telugu manuscripts Vol. II లో 733 సంఖ్య గలదు.

క్షేత్రస్వామి విలాసమును వర్ణించు గ్రంథములందలి వస్తువు తుల్యము. ఏతాదృశకథాసంయోజనము నైకక్షేత్రమాహాత్మ్యసాధారణ మగుటచే నితివృత్తము పురాణమూలకమా, ఉత్పాద్యమా యని విచారింపవలసివచ్చినది.

ఏతత్కథాకల్పనమందలి సాధారణలక్షణములను నిర్దేశించి ప్రయోజనమును నివేదింతును.

1 లక్ష్మికంటె భిన్నురాలగు కన్యను క్షేత్రస్వామి వివాహ మాడుట.

2 నారదుఁడు సవతులకయ్యమును ప్రేరేచుట.

3 హరి దక్షిణనాయకుఁ డగుటచే నిరువురను సమాధానించి యేలుకొనుట.

4 ఆ వివాహ మసంబద్ధముగాఁ గన్పట్టునేమో యను సందేహమువలనఁ గాఁబోలు నా చెంచుకన్నియయందో, సాధారణుని పుత్త్రికయందో భూదేవీనీలలయంశ లారోపితము లగుట.

యక్షగానములలేని నీలాంశత్వారోపము వీరరాఘవకవి నృసింహవిలాసమునఁ గన్పట్టు టీకథయందలి క్రమిక పరిణామమునకు నిదర్శనముగాఁ దోఁచుచున్నది.

'నరసింహదేవ నీ వా
యరణ్యమున భిల్లకన్య యగు చెంచిత డ
గ్గఱి వరియించినకథ న
ర్థి రచించెద' నన్న పైడిపాటి వేంకటనృసింహకవి యహోబలనృసింహుఁ డుద్వాహమాడిన శబరకన్య వసుంధర యనియు చికిలి నాయకుఁడు భార్యతోఁగూడి పూర్వజన్మమునఁ గావించిన తపస్సునకు

గూడలేక యనంతరము పద్మినిగా జన్మమొందుటను శ్రీనివాసుఁడే వివరించినాఁడు. తఱిగొండ వేంకమాంబ వ్రాసిన వేంకటాచలమాహాత్మ్యమునఁ జతుర్థపంచమాశ్వాసములలో నీకథ స్థానము సంపాదించినది. ఆమె చతుర్థాశ్వాసమున

'అని యిష్టదేవతాప్రార్థనం బొనరించి
వేడ్కఁ గొల్పెదు ఘన వేంకటాద్రి
మాహాత్మ్యమునను వరాహపురాణంబు
ముప్పదియధ్యాయములను దొలుత
మొనసి మూఁడాశ్వాసములు చేసి యావరా
హస్వామి కర్పించి యవల నెడఁద
రహిని భవిష్యోత్తరపురాణమున శ్రీని
వాసువిలాసము ల్వసుధయందుఁ
బ్రజకుఁ దెలియంగఁ దేటగఁ బద్యరీతి
ధృతి రచింతును దఱికుండనృహరికృపను
దప్పు లుండినఁ దగ దిద్ది యొప్పుగాను
జదువ నెంచెద బుధులార సదయులార.' 4–7

అనుటచే నాకథ భవిష్యోత్తరపురాణమూలక మని స్పష్టపడుచున్నది. చెళ్లపిళ్ల నరసకవి రచించిన వేంకటేశ్వరవిలాసమందలి కథయు వేంకటేశ్వరుఁడు చెంచుకన్నియ నుద్వాహమాడుటనుగూర్చి ప్రవర్తించినది. ఁ చెంచుకన్నియ భూదేవి యవతార మని సమర్థించి తుదకు నలమేల్మంగకును, చెంచుకన్నెకును సవతులకయ్య ముపక్రమింపఁజేసినాఁడు. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తమ యుపోద్ఘాతములో 'ఈ కథ నితఁ డేపురాణమునుండి కైకొనెనో చూతమన్న నాసంగతి యంతకు మున్నె తెలియదు. చాలవఱ కిది కల్పితమేమో యని యూహింపవలసి యున్న' దని (పుట 7) వ్రాసినారు. ఈకథలతో నహోబల

వ్వాలు తెలిమల్లెపూ లనుచు బోటికి నివ్వనరాశి లక్ష్మిగాఁ
దలఁచియెకాదె మాధవతఁ దాల్చుట నే నిట నీదు బాసటన్.'

1వ ఆ.

అని శ్లేషచమత్కారము చూపినాఁడు. నృహరి శబరకన్యను

'సురపొన్నతరువుల నొరసి యల్లిన మల్లి
కాకుంజమంటపాంగణమునందు
పరమశీతల మైన పటికంపువేదిపై
తఱిన రాలిన కమ్మవిరులు పొదల
పఱుపుపై యావధూవరులు చేర సమీర
దత్తసూనములు తత్తచ్ఛిరముల
రాలురీతులు దలఁబ్రాలుగా ద్విజగణ
ధ్వనులు విధ్యుక్తమంత్రములు గాఁగ
శ్వసనపూరితకీచకరంధ్రధ్వనులు
కాహళులు గాఁగఁ దత్కరకంకణార
వములు మంగళవేద్యవాద్యములు గాఁగ.'

2వ ఆ.

వరియించినాఁడు. ఈగ్రంథమునఁ జికినాయకునికూఁతుఁ నీలాంశజగా నిరూపింపఁబడుట విశేషము.

వెంకటేశ్వరమహాత్మ్యప్రతిపాదక మగు శ్రీనివాసవిలాససేవఁ యందుఁ బంచమాశ్వాసమున నారాయణపురమున విష్ణుభక్తుఁ నాకాశరాజు దండనదీతీరధరణి శోధించునెడ లభించిన కన్యకారత్న మగు పద్మినిని చెంచువానిరూపమున నాఖేటక్రీడాలోలుఁ డైన శ్రీని వాసుఁడు గాంచి మోహించి యుద్వాహమాడుట వర్ణింపఁబడినది. కృత యుగమున హరిని వివాహమాడఁ దపస్సు చేసిన వేదవతి త్రేతా యుగమున రావణసంహారమునకుఁ దోడ్పడి ద్వాపరమునఁ గృష్ణుని

'నీగర్వ మెందాక నిలుచులేరా హరి
చేరి నే యుపరతి చేయుదాక
నీయార్పు లెందాక నిలుచునురా హరి
ఆర్తిచే నా తాప మార్పుదాక
నీబాణ మెందాక నిలుచునురా హరి
కరుణించి నాతోడ కలియుదాక
నీవు నాముందుగ నిలుచుట లెందాక
హరియు నే నొక్కటి యయ్యెదాక
పిమ్మటను ఏమిచేతువు పిరికికూన
ఎప్పు డాసమయం బని ఎదురుజూతు

*          *          *

*          *          *

తొలిపద్యము గోపికలు శరన్నిశల కృష్ణు నన్వేషించు నెడ పోతన వ్రాసిన భావములకుఁ బ్రతిబింబాకారసంవాదముగా మలిపద్యము స్వతంత్రము. 'వస్తివి. బంటి' మున్నగు భ్రష్టరూపములు కొల్లలు.

3. నృసింహవిలాసము (శబరకన్యాపరిణయము)—వీరరాఘవకవి:

కవి 'శ్రీనృసింహసంబంధకథానుబంధంబుగా నొక్కప్రబంధంబు రచియింపఁబూని యొక్కసుదినంబున హరిపదారాధన' పరుండై పరుండ స్వప్నమున సాక్షాత్కరించి కృతి మత్పదాంకితము గావింపుమన్నాఁడు. ఈ ప్రబంధమున మూఁ డాశ్వాసము లున్నవి. వీరరాఘవ యతి కవి కాచార్యుఁడు. కవి కృష్ణపాటికులకలశజలధిహిమకరుఁ డగు నృసింహార్యునకు మూఁడవభార్యవలనఁ గలిగినవాఁడు.

కవిత్వము ప్రబంధసాధారణము. మాధవుఁడు శబరకన్యతో
'పలుకులు చిల్క లియ్యధరపాకమె ద్రాక్ష కుచంబు లొప్పుగు
బ్బలులు భుజంబులే లతలు పాణితలంబులె మావు లింపున

మగువల కనఁగానే కల
యఁగవలె ననుట యిది ఫణిశయానా వినుమా.'

పూర్వోత్తరభాగము లీపద్యమందు పొసఁగుట కష్టము. ఆపడఁతి హేతువాదము మనకుఁ దెలియవచ్చుట లేదు. అహోబలపతి సమాధాన మంతకంటె నీచము. జుగుప్సాకరము.

'కుసుమసుగంధిరో వినుము గోపలమం దుదయించె పెన్కసా
హసుఁ డగు శౌరి షోడశసహస్రవధూమణులన్ రమించె నీ
వసుధ నటంచు నాతనికి వారిజలోచనలెల్ల కూడి పే
రొసఁగి రెఱుంగవే మగశిరోమణి యంచు నుతింప మానినీ.'

లక్ష్మి ప్రియుని మించినది. ఆమె వాపోయినతీరు చూడుఁడు.

'ఫణులార కానరే పాపసంహారుని చా
రణులార కానరే రాజముఖుని
ద్రుమములార కనరె దుఃఖసంహారుని సం
యములార కానరే కమలనయను
సురలార కానరే సురరాజనుతుని కి
న్నరులార కానరే నాగశయను
జనులార కానరే జన్మసంహారుని శ
కునులార (?) కానరే కుందరదను
మధుకరములార కానరే మదనజనకు
భ్రామిణములార కానరే భద్రకరుని
కలరవములార చక్రవాకంబులార
శుకపికములార కానరే శుభచరిత్రు.'

ఆమె యన్వేషణముతోఁ దృప్తిపడక మన్మథదూషణము గావించినది.

వ్రాసినాఁడు. అతఁడు భాషాసంస్కారమునిమిత్తము పడరానిపాట్లు పడెనని యాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రచురించిన సూరిగారియసమగ్రగ్రంథసంచయమే వెల్లడించినది. ఆనాఁడు సూరిగారు చెలియలకట్టవలె నడ్డుతగులకున్న నీపాటికి గ్రాంథికాంధ్రము పాతాళలోకముపాలు కావలసినదే. ఆమహానుభావుని పాండిత్యప్రభావముచే నేఁటికిఁ గొన యూపిరితోనైన నిలిచియుండుట కవకాశము గలిగిన దని చెప్ప వచ్చును. ఆయన చేసినమేలు మఱవరానిది.

ఆంధ్రభాష చాల దుస్థితికి వచ్చినకాలమునందు బాలవ్యాకరణము రచింపఁబడినది. అవసరము ననుసరించియే గ్రంథరచనము జరుగుచుండు ననుట కిదియే ప్రబలనిదర్శనము. ఆసమయమున జనులకు గద్యముమీఁద నున్నంతప్రీతి, పద్యముమీఁద నున్న ట్లగపడదు. ఆంగ్లోన్నతవిద్యార్థులు తెలుఁగుభాషయందుఁ బ్రాభవము వహించి యాంగ్లభాషలోని జిలుఁగులను దెలుఁగున వెలయింపఁ గుతూహలముఁ జూపుచుండిరి. అట్టిపనికి గ్రాంథికాంధ్రముకన్న వ్యావహారికాంధ్రము తగిన దని వారు వాదింపసాగిరి. అప్పటినుండియు వ్యావహారికవాదము పొడచూపుచున్నది. గ్రాంథికవాదమును సల్పుపండితులును తమరచనల నుండి వ్యావహారికపదములను దొలఁగింపఁజాలకుండిరి. ఇట్టిరచనలు వ్యావహారికవాదమునకు బలము చేకూర్చినందునఁ గావ్యరచనమునకును, వ్యావహారికభాషయే తగిన దని వాదించుచు వ్యావహారిక వాదులు జనసంఘమునకు గ్రాంథికభాషయం దేవ కలిగింపసాగిరి. ఆతరుణమే బాలవ్యాకరణావతరణమున కవసరము గల్పించినది. అప్పు డది యవతరింపకున్నచోఁ బ్రాచీనాంధ్రభాషాస్వరూపము మనకు మృగ్యమే యగును. ఈవిషయము బాలవ్యాకరణాదిని జేయఁబడిన "శ్రీహయగ్రీవాయనమః" అను మంగళము వెల్లడించుచున్న దని (శ్రీ) వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు "వ్యాకరణసంహితా

సర్వస్వ" మున నిట్లు వ్రాసిరి. "శ్రీహయగ్రీవాయ=హయగ్రీవమూర్తి కొఱకు, నమః=నమస్కారము." "సీ....బ్రహ్మ సకలసృష్టి, కాది భూతములుగ వేదము ల్నాలుగు గలిగింప భా. శాంతి-౬౭-౮౭) వానిని మధుకైటభాసురు లపహరించి పాతాళమున నడఁగించుటం జేసి బ్రహ్మచేఁ బ్రార్థితుండై శ్రీమహావిష్ణువు హయగ్రీవమూర్తిని ధరించి యారక్కసులఁ జంపి యవ్వేదములం దెచ్చి విధాత కొసంగఁ బ్రపంచసృష్టి సాగె ననెడిభారతగాథ ననుసరించి గ్రంథకర్త వాఙ్మయాధిభూతపంచమవేదభారతాంధ్రభాషాస్వరూపమును గాపాడి యాంధ్రలోకమున వెలయించుటకై బాలవ్యాకరణమును రచింప నారంభించి గ్రంథాదిని జేసిన హయగ్రీవనమస్కారరూపమంగళాచరణము సాకూతముగ నున్న దనఁదగును.

కాలక్రమమున వ్యావహారికవాదము స్థిరపడి గ్రాంథికభాషా వైభవము సన్నగిల్లుచున్నను వ్యావహారికవాదులు గ్రాంథికభాషను లక్షణగ్రంథములను గ్రంథకర్తలను నవహేళనము చేయుట మానలేదు. తమ తప్పునైనఁ దాము గుర్తింపలేనంతటివిశ్వాసము తమవాదమున వారికిఁ గలదు. చిన్నయసూరి బాలవ్యాకరణమును బ్రయోగదృష్టితోడను వ్రాయలేదఁట. తుదకుఁ గవిత్రయప్రయోగదృష్టితోడను వ్రాయలేదఁట. ఏమిసాహసవచనము? మఱి యేదృష్టితో వ్రాసె నని యందురో. వారి వ్యావహారికభాషాభిమానము చిన్నయసూరి యేదృష్టితో బాలవ్యాకరణము వ్రాసెనో తెలిసికొననీయలేదు. వాని దృష్టి యేదో తెలిసికొనుట మనకర్తవ్యము గాని యేదృష్టితోడను వ్రాయలే దనుటమాత్రము గా దని వారు గుర్తింతురుగాక. అతఁ డేదృష్టితో వ్రాసెనో తిలకింతురుగాక.

సూరిగా రాంధ్రశబ్దచింతామణిసూత్రములనే ప్రాయికముగా భాషాంతరీకరించి రని చింతామణికారికలను బాలవ్యాకరణసూత్రము

లను వధుసగాఁ బరిశీలించిన విశదము కాఁగలదు. అట్లైనను జింతామణి సూత్రములను గొన్నియెడల నించుకించుక సవరించినట్లు పొడకట్టును. చింతామణి నన్నయకృత మని యితఁడు సిద్ధాంతీకరించుకొనెను. "అప్పు ఇప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసనులు యథా తథా యనిగ్రహించుట ప్రపంచార్థ మని యెఱుంగునది" (బాల) నన్నయభట్టునకు వాగనుశాసనుఁ డను బిరుదము గల దని "తన కుల బ్రాహ్మణు" అను భారతపద్యమునవలన విశద మగుచున్నది కదా! చింతామణి సాధ్యములుకాని నన్నయ భారతప్రయోగములను తిక్కనాదుల ప్రయోగములను వికృతివివేక మను నథర్వణకారికలు చాల వఱకు సాధించుచున్నవి. మిగిలినవాని నహోబలపండితీయమును కవి జనమంజన మను వికృతివివేకటీకయు సాధించుచున్నవి. సూరిగారు వీనియన్నింటిసాయమును బొందిరి. 'కద్రు' శబ్దము నాగమాత్రర్థమునఁ దత్సమముగఁ దెనుఁగున 'కద్రువ' యని యుండు నని చిన్నయసూరి 'కద్రువనాగమాత' (బాల-తత్స-౫ సూ.) అని సూత్రించెను. దీనికిఁ జింతామణి మున్నగువానియం దెచ్చటను మూల మగుపడదు. కాని వరుసన "యీకద్రువకు, వినతకుఁ బుట్టె (ఆను-౧౪-౧౬౭) కద్రువయను మున్నిట్టిచేరువ వనమునందు" (ఆను-౧౪-౧౮౧) అని తిక్కయజ్వ విశ్రమస్థానమునందు "వ" అనునది వచ్చునట్లు ప్రయోగించెను. నన్నయగారును "వినుతసత్త్వులఁ గోరెఁ, గద్రువ లేవురం గడువెక్కుడో" (ఆది-౨౪౩) అని "కద్రువ అనుదానిం ప్రయోగించెను గాని యట "కద్రువు" అని పఠించినను సేగిలేదు. కాగా తిక్కయజ్వ యతిస్థానఖచితప్రయోగము నాధారముగాఁగొనియే సూరి "కద్రువనాగమాత" అను సూత్రమును వ్రాసినాఁ డని ధ్రువ మగుచున్నది.

"సంస్కృతీయములకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి. కాని దీనికిం బూర్వకావ్యంబులం బ్రయోగంబు మృగ్యంబు,

ఆధునికకృతులం దొకానొకచో స్త్రీవాచకతత్సమంబులకు సంధి కానం బడియెడి- గంగనుకాసె- నెలతిచ్చె." (బాల) పూర్వకవి ప్రయోగ ప్రామాణ్యము లేకుండుటచే గొప్పలాక్షణికుఁ డగు నధర్వణాచార్యుల "క్వచి త్సంస్కృతీయోపి ప్రాణోప్య త్రచ్యుతో భవేత్" అను వచనములు తిరస్కరించెను. ఇతఁ డుద్దేశించిన పూర్వకవులు కవి త్రయమువారే యనుట స్పష్టము.

పై విషయములనుబట్టి యాలోచింపఁగా సూరి నన్నయతిక్కనలను బ్రమాణీకరించినట్లు స్పష్టపడుచున్నది. కవిత్రయమువారిలోనివాఁ డగు నెఱ్ఱాప్రెగ్గడనుగూడ ప్రమాణీకరించె నని యూహించుట సత్య దూరముగాదు. ఈవిధముగాఁ గవిత్రయమువారి ప్రయోగములను దృష్టియం దిడుకొని బాలవ్యాకరణము వ్రాసినట్లు తెలియుచుండఁగా "చిన్నయసూరి బాలవ్యాకరణమును బ్రయోగదృష్టితోఁగాని, తుదకుఁ గవిత్రయప్రయోగదృష్టితోగాని రచించియుండలేదు," అని అనాలో చితముగా వ్రాయుట యుక్తమా? గ్రంథకర్త జీవించియుండనపు డాతని గ్రంథస్థము లగు నాధారములను బట్టుకొని మనమే యూహించుకొన వలయును. లేకున్న స్వప్నమున గోచరించియైనఁ జెప్పు మని యాతని బ్రార్థింపవలయును. ఇట్లు తొందరగా నిర్ణయమ్ములుచేసి చెప్పుట పెద్ద లగువారి కెంతమాత్ర ముచితముగాదు. పైపెచ్చుగా నిట్టిసందిగ్ధవిష యములను బరీక్షకులు బాలురనెత్తిమీఁదఁ బ్రశ్నరూపమునఁ బడ వైచుటయు నెంతమాత్ర ముచితము గాదని మనవి.

వ్రాసినాఁడు. అతఁడు భాషాసంస్కారమునిమిత్తము పడరానిపాట్లు పడెనని యాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రచురించిన సూరిగారియసమ గ్రంథసంచయమే వెల్లడించినది. ఆనాఁడు సూరిగారు చెలియలకట్ట వలె నడ్డుతగులకున్న నీపాటికి గ్రాంధికాంధ్రము పాతాళలోకముపాలు కావలసినదే. ఆమహానుభావుని పాండిత్యప్రభావముచే నేఁటికిఁ గొన యూపిరితోనైన నిలిచియుండుట కవకాశము గలిగిన దని చెప్ప వచ్చును. ఆయన చేసిన మేలు మఱవరానిది.

ఆంధ్రభాష చాల దుస్థితికి వచ్చినకాలమునందు బాలవ్యాకరణము రచింపఁబడినది. అవసరము ననుసరించియే గ్రంథరచనము జరుగుచుండు ననుట కిదియే ప్రబలనిదర్శనము. ఆసమయమున జనులకు గద్యముమీఁద నున్నంతప్రీతి, పద్యముమీఁద నున్న ట్లగపడదు. ఆంగ్లోన్నతవిద్యాధికులు తెలుఁగుభాషయందుఁ బ్రాభవము వహించి యాంగ్లభాషలోని జిలుఁగులను దెలుఁగున వెలయింపఁ గుతూహలముఁ జూపుచుండిరి. అట్టిపనికి గ్రాంధికాంధ్రముకన్న వ్యావహారికాంధ్రము తగిన దని వారు వాదింపసాగిరి. అప్పటినుండియు వ్యావహారికవాదము పొడసూపినది. గ్రాంధికవాదమును నల్పుపండితులును తమరచనల నుండి వ్యావహారికపదములను దొలఁగింపఁజాలకుండిరి. ఇట్టిరచనలు వ్యావహారికవాదమునకు బలము చేకూర్చినందునఁ గావ్యరచనమునకును, వ్యావహారికభాషయే తగిన దని వాదించుచు వ్యావహారిక వాదులు జనసంఘమునకు గ్రాంధికభాషయందు దేవ కలిగింపసాగిరి. ఆతరుణమే బాలవ్యాకరణావతరణమున కవసరము గల్పించినది. అప్పు డది యవతరింపకున్నచోఁ బ్రాచీనాంధ్రభాషాస్వరూపము మనకు మృగ్యమే యగును. ఈవిషయము బాలవ్యాకరణాదిని జేయఁబడిన "శ్రీహయగ్రీవాయనమః" అను మంగళము వెల్లడించుచున్న దని శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు "వ్యాకరణసంహితా

సర్వస్వ" మున నిట్లు వ్రాసిరి. "శ్రీహయగ్రీవాయ=హయగ్రీవమూర్తి కొఱకు, నమః=నమస్కారము." "సీ... బ్రహ్మ సకలసృష్టి, కాది భూతములుగ వేదము ల్నాలుగు గలిగింప భా. శాంతి-౬౩-౪౭౭) వానిని మధుకైటభాసురు లపహరించి పాతాళమున నడఁగించుటం జేసి బ్రహ్మచేఁ బ్రార్థితుండై శ్రీమహావిష్ణువు హయగ్రీవమూర్తిని ధరించి యారక్కసులఁ జంపి యవ్వేదములం దెచ్చి విధాత కొసంగఁ బ్రపంచసృష్టి సాగె ననెడిభారతగాథ ననుసరించి గ్రంథకర్త వాఙ్మయాధిభూతపంచమవేదభారతాంధ్రభాషాస్వరూపమును గాపాడి యాంధ్రలోకమున వెలయించుటకై బాలవ్యాకరణమును రచింప నారంభించి గ్రంథాదిని జేసిన హయగ్రీవనమస్కారరూపమంగళాచరణము సాకూతముగ నున్న దనఁదగును.

కాలక్రమమున వ్యావహారికవాదము స్థిరపడి గ్రాంథికభాషావైభవము సన్నగిల్లుచున్నను వ్యావహారికవాదులు గ్రాంథికభాషను లక్షణగ్రంథములను గ్రంథకర్తలను నవహేళనము చేయుట మాన లేదు. తమ తప్పునైనఁ దాము గుర్తింపలేనంతటివిశ్వాసము తమవాదమున వారికిఁ గలదు. చిన్నయసూరి బాలవ్యాకరణమును బ్రయోగదృష్టితోడను వ్రాయలేదఁట. తుదకుఁ గవిత్రయప్రయోగదృష్టితోడను వ్రాయలేదఁట. ఏమిసాహసవచనము? మఱి యేదృష్టితో వ్రాసె నని యందురో. వారి వ్యావహారికభాషాభిమానము చిన్నయసూరి యేదృష్టితో బాలవ్యాకరణము వ్రాసెనో తెలిసికొననీయలేదు. వాని దృష్టి యేదో తెలిసికొనుట మనకర్తవ్యము గాని యేదృష్టితోడను వ్రాయలే దనుటమాత్రము గా దని వారు గుర్తింతురుగాక. అతఁ డేదృష్టితో వ్రాసెనో తిలకింతురుగాక.

సూరిగా రాంధ్రశబ్దచింతామణిసూత్రములనే ప్రాయికముగా భాషాంతరీకరించి రవి చింతామణికారికలను బాలవ్యాకరణసూత్రము

లను వరుసగాఁ బరిశీలించిన విశదము కాఁగలదు. అట్లైనను జింతామణి సూత్రములను గొన్ని యెడల నించుకించుక సవరించినట్లు పొడకట్టును. చింతామణి నన్నయకృత మని యితఁడు సిద్ధాంతీకరించుకొనెను. "అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసను లు యథా తథా యనిగ్రహించుట ప్రపంచార్థ మని యెఱుంగునది" (బాల) నన్నయభట్టునకు వాగనుశాసనుఁ డను బిరుదము గల దని "తన కుల బ్రాహ్మణు" అను భారతపద్యమువలన విశద మగుచున్నది కదా! చింతామణి సాధ్యములుకాని నన్నయ భారతప్రయోగములను తిక్క-నాదుల ప్రయోగములను వికృతివివేక మను నథర్వణ కారికలు చాల వఱకు సాధించుచున్నవి. మిగిలినవాని నహోబలపండితీయమును కవి జనమండన మను వికృతివివేకటీకయు సాధించుచున్నవి. సూరిగారు వీనియన్నిఁటిసాయమును బొందిరి. 'కద్రు' శబ్దము నాగమాత్రర్థమునఁ దత్సమముగఁ దెనుఁగున 'కద్రువ' యని యుండు నని చిన్నయసూరి 'కద్రువనాగమాత' (బాల-తత్స-౫ సూ.) అని సూత్రించెను. దీనికిఁ జింతామణి మున్నగువానియం దెచ్చటను మూల మగుపడదు. కాని వరుసన "యీకద్రువకు, వినతకుఁ బుట్టె (అను-౧౭-౧౬౭) కద్రువయును మున్నిటిచేరువ వనమునందు" (అను-౧౭-౧౮౧) అని తిక్కయజ్వ విశ్రమస్థానమునందు "వ" అనునది వచ్చునట్లు ప్రయోగించెను. నన్నయగారును "వినుతసత్త్వులఁ గోరెఁ, గద్రువ వేవురం గడువెక్కడో" (ఆది-౨౭౩) అని "కద్రువ అనుదానిం బ్రయోగించెను గాని యట "కద్రువు" అని పఠించినను నేగిలేదు. కాగా తిక్కయజ్వ యతిస్థానఖ చితప్రయోగము నాధారముగాఁగొనియే సూరి "కద్రువనాగమాత" అను సూత్రమును వ్రాసినాఁ డని ధ్రువ మగుచున్నది.

"సంస్కృతీయములకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి. కాని దీనికిం బూర్వకావ్యంబులం బ్రయోగంబు మృగ్యంబు,

ఆధునికకృతులం దొకానొకచో స్త్రీవాచకతత్సమంబులకు సంధి కానంబడియెడి- గంగనుకాసె- నెలతిచ్చె." (బాల) పూర్వకవి ప్రయోగప్రామాణ్యము లేకుండుటచే గొప్పలాక్షణికుఁ డగు నథర్వణాచార్యుల "క్వచి త్సంస్కృతీయోపి ప్రాణోప్య త్రచ్యుతో భవేత్" అను వచనములు తిరస్కరించెను. ఇతఁ డుద్దేశించిన పూర్వకవు కవిత్రయమువారే యనుట స్పష్టము.

పై విషయములనుబట్టి యాలోచింపఁగా సూరి నన్నయతిక్కనలను బ్రమాణీకరించినట్లు స్పష్టపడుచున్నది. కవిత్రయమువారిలోనివాఁ డగు నెఱ్ఱాప్రెగ్గడనుగూడ ప్రమాణీకరించె నని యూహించుట సత్యదూరముగాదు. ఈవిధముగాఁ గవిత్రయమువారి ప్రయోగములను దృష్టియం దిడుకొని బాలవ్యాకరణము వ్రాసినట్లు తెలియుచుండఁగా "చిన్నయసూరి బాలవ్యాకరణమును బ్రయోగదృష్టితోఁగాని, తుదకుఁ గవిత్రయప్రయోగదృష్టితోగాని రచించియుండలేదు," అని అనాలోచితముగా వ్రాయుట యుక్తమా? గ్రంథకర్త జీవించియుండనపు డాతని గ్రంథస్థము లగు నాధారములను బట్టుకొని మనమే యూహించుకొనవలయును. లేకున్న స్వప్నమున గోచరించియైనఁ జెప్పు మని యాతని బ్రార్థింపవలయును. ఇట్లు తొందరగా నిర్ణయములుచేసి చెప్పుట పెద్దలగువారి కెంతమాత్ర ముచితముగాదు. పై పెచ్చుగా నిట్టిసందిగ్ధవిషయములను బరీక్షకులు బాలురనెత్తిమీఁదఁ బ్రశ్నరూపమునఁ బడవైచుటయు నెంతమాత్ర ముచితము గాదని మనవి.

# గ్రంథసమీక్ష

శ్రీ కొ. శఠకోపాచార్యులు

ద్రావిడభాషాపరిశీలనము- రెండుసంపుటములు మొత్తము వెల రూ. 30. గ్రంథకర్త, కళాప్రపూర్ణ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రచురణము.

'ద్రావిడభాషాపరిశీలన' మనునవ్యగ్రంథమును బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ, వజ్ఝల చినసీతారామశాస్త్రిగారిటీవల రచించినారు. శ్రీశాస్త్రిగారు వ్యాకరణశాస్త్రపారంగతులు. ఇదివరలో నాంధ్రవ్యాకరణవిషయికము లగు చాలగ్రంథములు వ్రాసినారు. వాని నాంధ్రవిశ్వవిద్యాలయమువారు తమగ్రంథమాలలో బ్రచురించియున్నారు.

రెండు పెద్దసంపుటములుగ నున్న యీమహాగ్రంథము శ్రీశాస్త్రిగారు వ్యాకరణశాస్త్రములోను వివిధభాషల సంబంధమును గూర్చియు చిరకాలమునుండి చేయుచున్న మహాకృషికి ఫలితముగ గన్పడును. భాషావిజ్ఞానరచనలకు బుద్ధికుశలతయు, వివిధభాషలందు పాండిత్యమును నిరంతరదీక్షయు కార్యపరత్వమును శాంతవిశాలభావమును కావలెను. ఇవియన్నియును శ్రీశాస్త్రిగారియందు సమకూడినవి. కనుకనే యీ గ్రంథము దక్షిణభారతపుభాషావిజ్ఞానములో నొక యమూల్యరత్నముగ వెలువడినది.

ఈసందర్భమున భారతీయభాషాచరిత్రము నిక్కడ కొంత స్మరింపవలసియున్నది. మన దేశములలో వివిధప్రాంతములందు వేర్వేరు భాష లున్నవిగదా ! వానిలో, ఆయాగిరిగహనప్రాంతములందు ఆటవికజనులు వాడెడు నూరులకొలది యనాగరికభాషలు కలవు. ఇవి శతాబ్దులకొలదిగ వచ్చుచున్నను వీనిలో సాహిత్యము గాని ప్రత్యేక లిపిగాని లేవు. ఇం దనేకములు హిమాలయప్రాంతపువి. ఏకవర్ణములు

Monosyllables మంగోలియన్ కుటుంబపువి. మరికొన్ని తురేనియన్, ముండా, ఆస్ట్రిక మున్నగు వివిధనామములు గలయన్యకుటుంబపువి. ఈకొండజనులు క్రమముగా నాగరికు లగుదురు; కాని, ఆభాషలు వృద్ధినొందుసూచనలు లేవు. వీనిని గూర్చి కొంత పరిశోధన జరిగినది. ఇవిగాక ఉత్తర, మధ్యప్రాంతపు హిందీ, బంగాళా, మహారాష్ట్ర, గుజరాతి మున్నగు ఆధునికసాహిత్యభాషలు ప్రాచీనకాలమందే విశాలసాహిత్యము తో వెలసిన సంస్కృత ప్రాకృతభాషలకు క్రమపరిణామములుగ నేర్పడి వృద్ధిజెందుచున్నవి. ఇవియన్నియు ఒకే ఆర్యభాషా కుటుంబపువని, వానికి పారసీ, గ్రీకు, ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యను మున్నగు సుప్రసిద్ధార్యభాషలతో, సన్నిహితసంబంధము కలదినియు స్థిరమయినది. ఈసిద్ధాంతమును జూర్జిబీటు అను సివిలియను విద్వాంసుడు తన "Comprative Grammer of Modern Aryan Language of India" అను మూడుసంపుటముల మహాగ్రంథమునందు విపులచర్చకు పిమ్మట నుదాహరణలతో సహేతుకముగను, చక్కగ నిరూపించెను. మః దేశములో జనసంఖ్య మొత్తములో రమారమి ⅘ వంతు జనులు, ఈ ఆర్యభాషికులె. దక్షిణపుసాహిత్యయుతమగు తెలుగు, కన్నడ, తమిళ, మళయాళములును, కొన్ని కొండభాషలును ఒకేద్రావిడభాషా కుటుంబపువి ఈవిషయము డాక్టరు కాల్డెవెల్ అను క్రైస్తవమిషనరీ విద్వాంసుడు ఆయూభాషలలోని పదవ్యాకరణాదుల దీర్ఘపరిశీలన జేసి తన 'Compar tive Grammar of Dravidian Languages' అను సుగ్రంథములో నూరెండ్లక్రిందనే విశదపర్చెను. వీరితరువాత నెందరోవిలముగ భాషాపరిశీలనములు చేసినమీాదటను పైజెప్పిన యీా రెం సిద్ధాంతములను సర్వత్ర భాషాశాస్త్రజ్ఞు లందరు నామోదించుయున్నారు.

కాని, మనయాంధ్రభాషకు 'సంస్కృత మాద్యప్రకృతి, ప్రాకృతము ద్వితీయప్రకృతి' యనుసంప్రదాయ మేర్పడి పరంపరగ వచ్చు

చున్నది. ఇందునుబట్టి ఆంధ్రభాష సంస్కృతప్రాకృతములనుండియే జనించినదని కొందరు భావించినారు. ఇటీవల డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు నిదే వైజ్ఞానికసత్యముగ భావించి అట్టిప్రతిపాదనను 'ఆంధ్రభాషాచరిత్ర' మను విపులగ్రంథమున సాధింపబూనిరి. అయినను, తెలుగు, తమిళ, కన్నడ, మళయాళములు తమలో అత్యంతసన్నిహితము లని ఒకేభాషాకుటుంబపువనియు, భాషాశాస్త్రజ్ఞు లందరు నంగీకరించినదే. కనుక డా॥ నారాయణరావుగారును ఇట్టిసుస్పష్టసిద్ధాంతము నొప్పుకొనిరి. కాని, ఈ ద్రావిడభాష లన్నియు ఆర్యభాషాజనితములే యని సాధించుట కెన్నియో యుదాహరణములు చూపి, యెంతో శ్రమతో కొన్ని హేతువాదములు చేసి అట్లు నిర్ణయమును తేల్చినారు. ఇందుకతోడు ఆవిపులగ్రంథమును ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నిరాక్షేపణముగ తమగ్రంథమాలలో ప్రామాణికముగ ప్రచురించిరి. సంప్రదాయముకుతోడుగ ఇందుకు విశ్వవిద్యాలయామోదము గల్గినదను భావముతో కొందరు ఈనిర్వచనము నిరాక్షేపసిద్ధాంతమే యని భావించినారు. కొందరు కలవరపడిరి. అట్టిస్థితిలో ఈభ్రమను తొలగించెడు శ్రీశాస్త్రిగారి ప్రస్తుతపుమహాగ్రంథమును గూడ ఆంధ్రవిశ్వవిద్యాలయమువారె తమ గ్రంథమాలలో చేర్చి ప్రచురించుట ప్రశంసనీయము. ఇది దాని యుపాధ్యక్షుల కంకితముగూడ నయినది.

డా॥ నారాయణరావుగారి వాదములను వారు ప్రతిపాదించిన ద్రావిడభాష లన్నియు ఆర్యభాషాజనితములను నిరూపణమును శాస్త్రిగారు ఈగ్రంథములో చాలచోటుల నెత్తుకొని తీవ్రవిమర్శ చేసి ఖండించినారు; ఇందుకు కాల్డ్వెల్ చూపిన హేతువులను మరల ఉద్ఘాటించినారు. ఆంధ్రభాషలోని మొకటి విపులరచనల నన్నిటిలో తత్సమ తద్భవ శబ్దములు లెక్కకుమించి నిండియున్న వనుట నిజమే. కాని యట్లుండుటకు వేరుకారణములు కలవు. ఆగ్రంథముల

నప్పుడు రచించినకవులు స్వయముగా సంస్కృతమునం దఖండపండితులు. మరియు అప్పటికే వేయేండ్లకుపైగ ఆంధ్రమునకు, ఆంధ్రజనులకును సంస్కృతసాహిత్యముతోను, ప్రాకృతభాషతోను చారిత్రకముగ సన్నిహితసంబంధ ముండెను. మౌర్య, శాతవాహన, చాళుక్యాదుల యితిహాస మీవిషయమును స్పష్టముచేయును. మరియు బౌద్ధజైనమతములు అప్పటికి శతాబ్దులకొలది యాంధ్రప్రాంతమున వ్యాపించినందున వాని ప్రాకృతధర్మగ్రంథములు ప్రచారములో నుండెను. సంస్కృత, ప్రాకృతసాహిత్యమే అప్పు డాంధ్రప్రాంతమున ఆదరణ నొందుచు వర్ధిల్లెను.

శాస్త్రరీత్యా భాషాసంబంధము చర్చించునపుడు సామాన్య జనుల భాషకు ప్రాణమనదగు నిత్యోపయోగపుపదములు, అంకెలు, సర్వనామములు, ముఖ్యవిభక్తులు, ప్రత్యయములు, ప్రధానక్రియలనే ఆయాభాషలనుండి తీసికొని పోల్చి వానిసంబంధమును గమనించి నిర్ణయింపవలెను. పరిణామపుకారణములు శాస్త్రరీత్యా పరిశీలింపవలెను శ్రీశాస్త్రిగా రిట్టిపద్ధతి నవలంబించి, చాల పట్టికలు చేర్చి, ఇట్టివిషయములలో ద్రావిడభాష లన్నిటిలో నొకే, రూపపుశబ్దము లున్నవని ఇవి సంస్కృతప్రాకృతములకు, ప్రాకృతజన్యమగు హిందీభాషకున పోలిక లేనివనియు విశేషశ్రమలో విశదపర్చి, డా॥ కాల్డెవెల్ గ రిదివరలో నిర్వచించిన శాస్త్రీయసిద్ధాంతమును బలపర్చినారు శ్రీ నారాయణరావుగారు ఆర్యభాషలకు పొరుగుననున్న ఆంధ్రభాష పదములనే ముఖ్యముగ పోలికకు తీసుకొనిరి. యదార్థముకు తెలు తమిళములలో సామాన్యముగనున్న శబ్దములను ముఖ్యముగ ప్రా నపు శెందమిళ్ (ప్రాచీనతమిళ) పదములను హెచ్చుగ తీసుకొ పోల్చుట యుక్తమై యుండెను. మరియు, ప్రాకృతశాఖలలో పైశా భాష శబ్దములలో నాంధ్రశబ్దములకు చాల పోలిక లున్నవని, ఆంధ్రమ

పైశాచీజనిత మని యెంచి, కనుక ద్రావిడభాష లన్నియు నార్యభాషా జనితము లనియు వారు సమర్థింపజూచిరి. చరిత్రకాలపు పైశాచజాతి వారు ముఖ్యముగ ఆటవికులు, అనాగరికులు. వారి పైశాచీభాష శుద్ధప్రాకృతము కాదు. అది ఆర్యద్రావిడాటవికముల మిశ్రితభాషగ తోచును. (ఆంధ్రప్రాంతములో రచితమైన 'బృహత్కథ పైశాచి భాషలో రచింపబడె ననుసంప్రదాయ మున్నది. కాని బృహత్కథ' శైలిని పరిశీలింపగ పైశాచి యనుట ఆక్షేపణీయముగ తోచును.) పూర్వకాలమున ఆంధ్రమునకు పశ్చిమమున మహారాష్ట్రియును, వాయవ్యమున శౌరసేనియు, ఉత్తరమున మాగధియు, ఈశాన్యమున అర్ధమాగధియు పొరుగుభాషలుగ నుండెను. వీనిలో దేనితోను ప్రాచీనాంధ్రపదములతో సహజమగు ఏకత్వము కనబడదు. కాని ఈభాషలతో ఆంధ్రమునకు చిరకాలసంపర్క ముండినదనుట నిర్వివాదము ; కనుక ఆంధ్రభాష ఆర్యభాషలచే నత్యంతము ప్రభావితమైనది. కొలదివందలయేండ్ల సంపర్కముననే హిందీ, ఉర్దూ, ఆంగ్లశబ్దము లిప్పటి ఆంధ్రజనుల దైనికవ్యవహారములో దేశ్యములవలె వాడుకకు వచ్చియున్నవి. ఆకాలమున వేలకొలది సంస్కృతప్రాకృతపదములు చేరుటేగాక ఆభాషల వ్యాకరణాలంకారాదులును, భావములును చేరి ఆంధ్రమునం దపారపరిణామము గల్గించెను. నన్నయ శ్రీనాథుల సాహిత్యాంధ్రము నేటి వాఙ్మయాంధ్రమును తమిళముకన్న సంస్కృతప్రాకృతములకే ఎక్కువ సన్నిహిత మనుట సత్యము. (ఇట్లై కొందరి ఉర్దూ శైలిక అరబ్బీపారసీలతో గట్టిపోలిక యున్నను, ఆ ఉర్దూ సెమిటిక భాషాకుటుంబములోనిది కాదని ప్రాకృతభాషాకుటుంబపు దనియు నిర్ణయమయినది. కనుక ఆంధ్రభాష మొదట ద్రావిడకుటుంబముననే జన్మించినను కౌమారమునుండి ప్రాకృతభాషలతోనే కలసి, ఆ సంప్రదాయ మవలంబించి, ఆర్యకుటుంబపు దత్తపుత్రిక యైన దనవచ్చును.

ఆదిలో మానవు లందరి కొకేభాష యుండెననియు, వారు కాల క్రమమున చీలి ఖండాంతములలో వసించుటలో వారలభాషలు కొంత కాలమునకు భేదించి వేర్వేరుభాష లయిన వనియు, ఇప్పటి ఆర్యద్రావిడాది భాషాకుటుంబము లన్నియు నొకేయాదిమభాషనుండి యాదికాలమున జనించి కాలక్రమమున విడిపోయి యుండెననియు కొందరు భాషాశాస్త్రజ్ఞు లూహించినారు. శ్రీ నారాయణరావుగారును, శ్రీ శాస్త్రిగారును తమ తమ గ్రంథములలో నీ రెండుసమస్యల నంతగా చర్చించినట్లు కనబడదు. ఇందునుగూర్చి స్థిరనిర్ణయము చేయుటకు (ఇప్పటి కాయా భాషాసంబంధమును గూర్చిన జ్ఞానపరిమితినిబట్టి) తగిన యాధారము లింకను లేవని యంగీకరింపవలసియున్నది.

అక్కడక్కడ డా. కాల్డ్వెలు గ్రంథములోని కొన్నివచనముల నెత్తి వానిని శ్రీ శాస్త్రిగారు ఈ 'ద్రావిడభాషా పరిశీలనము'లో కొన్నిచోట్ల తీవ్రవిమర్శనము చేసి కాల్డ్వెలు నాక్షేపించినారు. కాల్డెలు ముఖ్యముగ తమిళమునుండియే ఉదాహరణముల నిచ్చెను. ఆయన సాహిత్యజీవితము (మతప్రచారమును) చాలవరకు తమిళప్రాంతమునందే గడచెను. కనుక, ఆయనకు తమిళమునం దున్నంతపాండిత్యము ఆంధ్ర కన్నడములలో లేకపోవుట సహజమే. ఆయనయే యొప్పుకొనెను. అట్లే శ్రీ నారాయణరావు శాస్త్రిగారలు ముఖ్యముగ తమ ఆంధ్రపాండిత్యముపైనను, తక్కిన దేశభాషలందు కేవలపరిమితజ్ఞానముపైననుమాత్ర మాధారపడినారు. అది సహజమే. ముఖ్యమగు విజ్ఞానపరిశోధనలు ఈకాలములో చాలవర కింగ్లీషులోనే ప్రచురితమగుచున్నవి. కనుక తగినంత ఆంగ్లజ్ఞానమును ముఖ్యద్రావిడభాషలందు మంచిపాండిత్యమును గల్గిన పరిశోధకు లిట్టి మహాత్కార్యమున కింకను పూనుకోవలసి యున్నది. మరియు డా. కాల్డ్వెల్ తన యుద్గ్రంథమును నూరేండ్ల క్రిందటనే వ్రాసి ప్రచురించెను. ఈ నూరెండ్లలో భారతీయప్రాచీన

సాహిత్యరచన లెన్నియో పునరుద్ధృతము లయి, ఇటీవల ప్రచురిత మయినవి. భాషావిజ్ఞానపుపరిశోధనరచనలును చాల వెలువడినవి. అప్పటికి దొరకని సాధనసంపత్తులు ఇప్పటివారికి కలవు. కాల్డ్వెల్ విదేశీయుఁ డై నను తమిళమం దద్భుతజ్ఞానము సంపాదించుకొనెను. ఆంధ్రకర్ణాటప్రాంతముల నివసింపలేదు, కాని ఆయన గొప్ప మేధావి సూక్ష్మదర్శి ; బహుభాషాభిజ్ఞుఁడు ; భాషావిజ్ఞానపు ముఖ్యసిద్ధాంతములు సూత్రములు సవ్యముగనే గ్రహించినవాఁడు. యూరపుభాషలేగాక మనదేశపుభాషల తత్త్వమును వాని పరస్పరసంబంధమును ప్రీతితో నభ్యసించి సరిగ కనిపెట్టి సవ్యముగ నిర్ణయించి మార్గదర్శి యయినాడు.

భాషకు జాతికి (Race and Language) గలసంబంధమును గూర్చి చాలమందిజనుల కపోహ కలదు. 'ఆర్యభాషికు లందరు ఆర్య జాతి ; ద్రావిడభాషికులు కేవలం ద్రావిడజాతి' యనియు, ఒక్కొక భాషాకుటుంబపువారు ఒక ప్రత్యేకజాతి యనియు భావన లోగడ వ్యాపించియుండెను. ఈ భావన రాజకీయములకును కొంత వ్యాపించి, యూరపులో జర్మనుజాతి (Germanic Race) వాదమును హిట్లరు ప్రభృతులును, మనకు దక్షిణమున ద్రావిడజాతి (Dravidian Race) వాదమును శ్రీ రామస్వామినాయకరు ఇత్యాదులును ప్రచారపర్చి రాజకీయోద్దేశముల సాధింప నెంచినారు. మరియు ఆంధ్రజాతి, తమిళ జాతి, మహారాష్ట్రజాతి, గుజరాతీజాతి, ఓఢ్రజాతి ఇత్యాదులు ప్రత్యేక జాతు లని భావన గల్గి, (ఇటీవలి భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణసంద ర్భమున) కొందరు వీరావేశము నొందినారు. ఆర్యులు మంగోలియనులు మున్నగు ఒక్కొక భాషాకుటుంబపువా రొక ప్రత్యేకజాతి యనుటలో ఆరంభస్థితిలో కొంత సత్యముండెను. కాని క్రమముగ జాతులును భాషలును అన్యప్రాంతములకు విశేషముగ వ్యాపించుటలో కాలక్రమ మున చాల సమ్మిశ్రణము జరిగినది. ఉదాహరణము:— ఇప్పటి బెంగాలీ లందఱును ఆర్యభాషికులె కాని, జాతి శాస్త్రరీత్యా (Enthology)

వారిలో ఆర్యజాతిలక్షణములకన్న ద్రావిడమంగోళీయనులక్షణములే హెచ్చుగ నున్నవి. వారి ముఖరూపమును సంస్కృతపదోచ్చారణమును ఈవిషయమును కొంత వెల్లడి చేయును. చారిత్రకాలమునను యూరపులోను, ఆసియా దేశములలోను జాతిసమ్మిశ్రణము చాల జరిగినది. ఇప్పటి నాగరిక రాజ్యాలలో ప్రత్యేకపు ఆర్యజాతిగాని, ప్రత్యేక ద్రావిడజాతిగాని దాదాపు లేదని చెప్పవచ్చును. ఆంధ్రులు ఉత్తరదక్షిణములకు మధ్య నివసించుచుండిరి; ఎన్నియో తెగలతో కలిసిరి కొందరు ఎన్నియోప్రాంతములకు వ్యాపించిరి. (తమిళజిల్లాలలో సుమారు 40 లక్షల ఆంధ్రులు కలరు.) ఈప్రాంతమునను ఎన్నియో దాడులు జరిగినవి. కనుక జాతిసమ్మిశ్రణము చాల కలిగినది. వారు ఆర్యద్రావిడమిశ్రితు లయినట్లే, వారిభాషయు ఆర్యద్రావిడమిశ్రితమే. కనుక, ఆంధ్రము ఆర్యజనిత మయియుంటే ఆంధ్రు లార్యజాతీయు లని, ద్రావిడభాషికు లైనచో కేవలద్రావిడు లనియు భావించుటయు భ్రమ జనితమే. భాషాసమస్యలను విజ్ఞానసూత్రప్రకారమే పరిశీలించవలెను.

(శ్రీ) శాస్త్రిగారు విపులమగు నీయుద్గ్రంథమును రచించి, ముఖ్యముగ నాంధ్రుల భాషావిజ్ఞానమునకు గొప్పసేవ యొనర్చినారు. అట్టి మహారచనలలో నేవో స్వల్పలోపములు కొందరకు కనబడవచ్చు. ఉ॥ "ఉత్తరహిందూస్థానగతములగు మాగధిప్రభృతిప్రాకృతము లపభ్రష్టమయి నేటి హిందీప్రభృతులుగ నేర్పడిన చరిత్రము దెలియుట కాధారములు లేవు. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమువఱకును నుత్తరహిందూస్థానభాషాచరిత్ర మెవ్వరికిని దెలియదు. అని శ్రీ శాస్త్రిగా రీగ్రంథములో (34 వ పుటలో) వ్రాసివేసిరి. ఈ భాషాపరిణామమునుగూర్చియు మన ప్రాకృతవైయాకరణులేగాక, చాలమంది ఆధునికవిద్వాంసులు పరిశోధనలు చేసి వ్రాసియున్నారు. పూర్వపు హేమచంద్రాదులను మరచినను, ఆధునికులగు జాన్‌బీమ్సు, సర్ జార్జిగ్రియర్సన్, శ్యామసుందరదాస, సునీతికుమారచటర్జీ మున్నగు భాషాకోవిదులు అగాధ

పరిశోధనల జేసి, మన ఆర్యభాషల పరిణామములగూర్చియు, ప్రాకృత భాషల క్రమపరిణామమువలన నానాటి హిందీ, బెంగాళీ, ఇత్యాదు లేర్పడినవిధముఃగూర్చియు చాల పరిశోధించి వ్రాసి ప్రచురించినారు. శౌరసేని, మాగధి, అర్ధమాగధీభాషలగూర్చి, వాని అంతశ్శాఖల గూర్చి, వాని యపభ్రంశములగూర్చియు, వానినుండి పూర్వపశ్చిమ హిందీలు, బెంగాళీ ఇత్యాదులు ఎట్లుజనించె ననుటగూర్చియు పరిశోధ నేము వాదభేదములును వచ్చినవి. శ్రీ గ్రియర్సనుగారి (Linguistic Survey of India) భాషావైజ్ఞానికుల కొకమహాఖని యనవచ్చును. కాని, అది యిప్పటికే ప్రాచీనమైపోయినది ; దానిని నవ్యపరిశోధనల ఫలితములబట్టి సంస్కరించి, నవ్యవిషయముల జేర్చి ప్రచురించుటకు కేంద్రప్రభుత్వమువారు వెంటనే పూనుకోవలసియున్నది.

ఇట్లు, ఈగ్రంథములో అంకెలపోలికలు తెలుపు పట్టిక (569వ పుట) లో 'మూడు' కు తమిళపదములు "మూన్ఱు, మూంద్రు, మూన్కు" అని వ్రాయబడినది. 'మూంద్రు' వాడుకలో లేనిదని చును. 'మూణు' (గ్రామ్యములోను) కేవలము అపరిశుద్ధము. 'మూను' అనునది సర్వత్ర వ్యవహృతమగు పదము నచ్చట వ్రాయ రైరి. ఇట్టి కొద్దిలోపములు కనబడినను, ఈగ్రంథము గొప్పరత్న మనుటకు సందేహము లేదు. తెలుగునాడు అంతటను అరవమునకు 'తమిళ' శబ్దము వాడుచున్నాము. అందు కీగ్రంథములో 'తమిళ' శబ్దమునకు బదులు 'తమిఴ' అని వ్రాసినారు. ఈ మూడవయక్షరము 'ఴ' 'ట' 'ళ' లలో నేదియు కాదు ; చదువరులకు 'ట' కారమో, 'ఴ' కారమో యని భ్రమ కలుగును. 'ద్రమిడ' శబ్దము 'తమిట' శబ్ద మ్మైనదని తమిళులు 'డ' కారముకు, 'ట' కారమునే వ్రాయుదురని సమాధానపడుటయు న్యాయముకాదు. దీనిధ్వని 'ష్జ' కు కొంతవరకు సరిపోవును. ఉ॥ 'వాష్జప్పష్జం', 'వాళప౹ళం' ల మధ్యగ నుచ్చా

రణ ముండును. ఇందుకు తమిళమున 'ఴ' అను ప్రత్యేకాక్షర మున్నది. ప్రస్తుతగ్రంథము మద్రాసునగరమందే ముద్రిత మయినది. అక్కడ అక్షరమును జేర్చుట చాల సులభమే. ఆంధ్రములో ఇట్టి అక్షరము వాడుకలో లేదు. ఇట్టి 'ఴ' అక్షరపు ప్రత్యేకోచ్చారణ గూర్చి ఉపోద్ఘాతములోను వివరింపలేదు. ఇందులో వందలకొలది స్థలములలో తరుచు తమిళశబ్దములలో నిట్టి యక్షరముల వాడవలసి వచ్చినది. వానిని 'తమిట' అన్నను 'తమిఴ' అన్నను తప్పే యగును. వాడుకలో లేని యీక్రొత్త యక్షరమును (వివరణ లేకుండ) చేర్చుటకన్న, అంతట వాడుచున్న 'ళ' కారముతోనే 'తమిళ' అని వ్రాయుట ఆంధ్రపాఠకులకు సహాయ మగునని మనవి.

మొత్తముమీద, ఈగ్రంథము ద్రావిడభాషాపరిశోధనలోను, ఆంధ్రభాషావిజ్ఞానములోను నవీనఘట్టమును గల్గించినది. ఇట్టి మహా రచన నిచ్చి శ్రీ శాస్త్రిగా రాంధ్రులందరకును మహోపకార మొనర్చి నారు. తాము లోగడ ప్రచురించిన 'ఆంధ్రభాషాచరిత్రము' లోని ప్రతిపాదనవల్ల ఆంధ్రులలో కలిగిన అపోహను, ఈ 'ద్రావిడభాషాపరి శోధనము'ను ప్రచురించుటద్వారా తొలగించి, ఆంధ్రవిశ్వవిద్యాలయ మువారు విజ్ఞానవిస్తరణకును సహాయపడి, స్తుత్యు లయినారు. ఈ గ్రంథపు ఒక్కొకసంపుటము వెల రు 16–0–0, మొత్తపువెల రు 30–0–0 అని వ్రాయబడినది. సాధారణముగ ఆంధ్రవిద్వాంసులు నిర్ధనులు. కనుక దీని నంత వెలకు కొనలేరు. ఈగ్రంథములోని ముఖ్యా ముగాని ప్రత్యేకాక్షరప్రత్యయాదుల వివరణమును వదలి, ముఖ్యా సూత్రములను, పట్టీలను, సిద్ధాంతములను పొందుపర్చుచు, సుమారు నూరుపుటలలో సంగ్రహగ్రంథమునుగూడ సుమా రొకటి, రెండు రూపాయలవెలకు ప్రచురించి బీదవిద్వాంసులకు విద్యార్థులకు సహా యము చేయుదురుగాక.

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - నాడులు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు

నేఁడు భరతఖండము రాజకీయముగ రాష్ట్రములుగను, ప్రదేశములుగను, వానిలో మరల మండలములు (జిల్లాలు) గను విభజింపఁబడినట్లే ప్రాచీనకాలమున మన ఆంధ్రదేశము విషయములుగను, నాడులుగను, సీమలుగను, స్థలములుగను విభాగమై, వ్యవహారసిద్ధమై యుండెను. వానిలో నాడు అను రాజకీయవిభాగము బహుళవ్యాప్తియం దుండెను. నేఁడుమాత్రము రాజకీయవిభాగముగ నా డంతరించినను, బ్రాహ్మణ బ్రాహ్మణేతర శాఖాసాంఘికవ్యవస్థలో నిఁకను ప్రస్ఫుటమై వెలయుచున్నది.

ఆంధ్రదేశములో వ్యవహారసిద్ధమై యున్న ప్రధానమైన నాడుల పదమూఁడవశతాబ్దము నాఁటి శ్రీశైలశాసన మొకటి గలదు. ఆశాసన మిం దుదాహరించుచున్నాను. శ్రీశైలమల్లికార్జునదేవునికి పదమూఁడవ శతాబ్దమునకు పూర్వము మహారాజులు, మాండలికులు దానము చేసిన వివిధనాడులలోని గ్రామము లీశాసనమునందు పేర్కొనబడినవి. (క)

"మల్లికార్జునదేవుని అంగరంగభోగాలు ముఖ్యమైన అసంఖ్యాతుల ఆనతిక్రమము నడచెదమని అరపమఠము ఈశ్వరశివార్యులుం నారాధ్యప్రెగ్గడలుం నిచ్చిన ప్రతిజ్ఞా శాసనస్తంభ క్రమమెట్లంనను శ్రీమల్లికార్జునదేవుని అంగరంగభోగాలకుంన్ను సత్రభిక్షాలకుంన్ను నియతిసేసి క్రితయుగ త్రేత ద్వాపార కలియుగాల చక్రవర్తులుంన్ను మండలేశ్వరులుంన్ను రాజులున్ను నాయంకులూను మన్యనాయంకులూ సాటిగాంగలభక్తి జనులైన ధర్మపరులు తమకు సుకృతార్థము ఇచ్చిన

---

(క) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 10 సంఖ్య 504

ఊర్ల చెఱువులు గుడ్లవ్రిత్తుల ఆదాయాల వివరక్రమమెట్లంన్నను,
అర్యమతాన

కర్నాటిలోన— శివపురము కుఱుకుంట ఇంద్రేశ్వరము నందికుంట దండ్యాల వెదురుపాడు తుమ్మలూరు తాటిపాడు గణపాపురము ఎడమరము బీరప్రోలు పాలమఱ్ఱుపాలు సిద్దేశ్వరము కోటవిందాల బొల్లపురము కొఱప్రోలు గండివేములు వెర్సి ౧౭.

కంమ్మనాటను— నూతులపాడు గొట్టిపాడు ఉప్పలపాడు గొఱ్ఱపాడు అనుమనంగూరు గుఱ్ఱపుంబిడియ వెర్సి ౬.

ఆఇజనాంటిలోన— జిలుగుంబిడి.

మింగలనాంటిలోన— గూడూరు మామిడి దరిపల్లి వెర్సి ౩.

పెడ్డెంలోన— ముట్లుపోలు ఆవులపల్లె వెర్సి ౨.

కుపలనాంటిలోన— మల్లికార్జునుంపల్లి సాసుఱ్ఱల పిప్పిరగె కలుచెఱులు దేవరపల్లి వెర్సి ౫.

గొండనాంటిలోన— సావళిగ బొరిగ వెర్సి ౨.

పల్లినాంటిలోన— అయ్యనవా.

అయిజనాంటిని— కుదంకలూరు ౧. ముదునురికోట ఊర్లలోన చింతజేలు ౧.

మారటనాంటిలోన— గొణంగనూరు ౧. యిందులవాయస్థలాన మహాదేవపురంబు ఒడిసెపల్లి ౨.

సబ్బినాంటిలోన— చల్లగరగ గుడ్లకోట ౨.

మోటవాడిలోన— మొరప్తనొడపి ౧.

ఆదరస్థలాన— పెనకెపల్లి ౧. దోరసముద్రదిక్కున హారళీయుపురవు.

పాకనాంటిలోన— విరిమడుకె యిల్లపాడు లింగంకుంట గానుగుపెంట తిక్కవరము గొరగిపూండి చీమలపురము కుంటిపూండి చిలకొమడు చిదుతపాడు వెర్సి ౧౦.

రేనాంటిలోన— అఱులూరు గోవిలకుంట వెర్సి ౨.

ముల్కినాంటిలోన— రాజవోలు మల్లయవేములు పెరకాపాడు (3)

ఆరెభూమిగడిని— సుపడిపం ౧.

కోపూరిస్థలాన— నాగులపల్లి ౧.

కవిలాసం కోటస్థలాన— దోరణాలపల్లి ౧.

మగతలభూమిలోన— కొండపల్లి ౧.

పైని వివరింపఁబడిన శాసనబద్ధమైన నాడులను గూర్చి నేఁటి మండలముల, తాలూకాల సరిహద్దులతో సంబంధించినవఱకు సీమానిర్ణయమొనర్చుచున్నాను. నాఁటి నాడీవిభాగమును, నేఁటి మండల తాలూకా పొలమేరలలో సరిపెట్టుట దుష్కరము. కాని ఇట్టి సమన్వయము సదృష్టాంతముగఁ గొంతవఱకు సాధింపవచ్చును.

## పల్లినాడు — పల్నాడు.

ఆంధ్రప్రదేశములో పల్నాడు చారిత్రకముగను, సారస్వతములోను బ్రసిద్ధికెక్కిన నాడులలో నొకటి. ఈనాఁడు పలనాడు, పలినాడు, పల్లెనా డని పలునామములతో శాసనములలోను సారస్వతములోను వ్యవహరింపఁబడినది.

శ్రీనాథవిరచితమైన చాటుపద్యములో నియ్యది పల్లెనా డనియే ప్రయోగింపఁబడెను.

గీ. చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు
నాగులేటినీళ్లు నాపరాళ్లు

సజ్జ జొన్న కూళ్లు సర్పంబులును తేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

శ్రీనాథకృత మని చెప్పఁబడిన పల్నాటివీరచరిత్రలో దీనిని పలనా డని కవి పేర్కొనినాఁడు,

ద్వి. శౌర్యంబు పుణ్యంబు సమకూర్చినట్టి
పలనాటివీరుల భాగవతంబు
ప్రకటితంబుగ నీవు రచియి ి మాకు
అంకితం బొనరింప ననువొ ఁచు నొ వె
అనుచును శ్రీకాంతుఁ డరిగినపిదప
మేల్కాంచి మనమున మే లయ్యె ననుచు
విలసిల్లు పలనాటి వీరులచరిత
జనులెల్ల భక్తిచేఁ జదువుట కొఱకు
మంజరీద్విపదగా మన్నించి నేను
చెప్పఁబూనితి వచఃశ్రీ మెఱయంగ.

బాలచంద్రయుద్ధము — పంక్తులు 50-60.

పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్నములో దీనిని పలనా డనియే చెప్పినాఁడు.

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిం బలనాటను బాకనాటనుం
బింగళిగాదయాదు లిటఁ బెంపు వహించిన యస్మదాదు లా
పింగళిగోకమంత్రి యిలువేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్.

అప్పకవి యీపలనాటిని పల్లెనా డని ప్రయోగించెను.

గీ. పల్లెనాఁటను నూటతొంబదియు నాల్గు
గ్రామముల నీడు గానక కాకునూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
నెక్కె మాఱటబ్రహ్మ యనఁగ.

అప్పకవీయము.

వినుకొండవల్లభరాయని క్రీడాభిరామములో నియ్యది పలినాడు, పల్నాడు, పల్లెనాడు, పల్లెదేశ మనియు వర్ణింపఁబడినది.

గీ. విప్రుఁ డీక్షించెఁ బలినాటి వీరపురుష
పరమదైవత శివలింగభవనవాటి.

గీ. కులము దైవతంబు సురిజాలగంగాంబ
కలనిపోతులయ్యె [illegible] ఋకాఁడు
పిఱికికండ లేని యుత్సవది యేగురు
పల్లెనాటి వీరబాంధవులకు.

గీ. ఆరువల్లినాయినారి దుర్మంత్రంబు
కోడిపోరు, చాపకూటికుడుపు
ప్రథమకారణములు పల్నాటియేకాంగ
వీరపురుషసంప్రహారమునకు.

కం. నల్లంగొండయు, నాగరి
కల్లును, ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పలేరు నాగులేరును
బల్లెటూకాంత యెల్లప్రారంభంబుల్.

---

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంతనృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యార్వెల్లినాయురాలు
నిజమనుశుద్ధికై నిప్పులయేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిల పణంబుగ గొల్ల
సవతితల్లులబిడ్డ లవనిపతులు

గీ. ధీరు లగు వార లేవురు వీరపురుషు
లై మదోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచట నచట
జనపపెద్దలు పల్లెదేశమ్ములందు.

ఇఁక శాసనములలోఁగల పల్లెనాటిప్రయోగముల నిచ్చెదను.

(1) చాగి బేతరాజు- మాచెర్లలోని క్రీ. శ. 1121 నాఁటి శాసనము.

స బేతభూపతిః శౌనకగోత్రేన మహీధరపౌత్రేణ శ్రీధరపుత్రేణ జోగమాంబికానందనేన శ్రీమదాదిత్యేన మహాదేవిశటాకాభిధానాయాం రాజధాన్యాం ప్రతిష్ఠితాయాదిత్యేశ్వరాయ గుణపురగంగనేందు సంఖ్యాక సకవర్ష ఖరాభిదానే కార్తిక శుద్ధ ద్వాదశ్యాం పల్లిదేశ శతత్రయా న్తర్వర్తి నాగేశ్వరనదీప్రాగ్భాగస్థిత సబ్బేయపల్యాం రాజమానవివర్తన శతద్వయపరిమితాం భూమిం ప్రాదాత్॥

(2) కులోత్తుంగ గొంకరాజు కాలము. పల్నాటితాలూకా లోని కొండమగూడగ్రామము. క్రీ. శ. 1147.

శ్రీ మన్మహామండలేశ్వర కులోత్తుంగచోడ గొంకరాజు ముది సెలియాసనపెగడ పలినాంటిలోనుం దమకు నడచెడు వడ్డరావళము పాలును.

(3) నరసారావుపేటతాలూకా ద్రోణాదులగ్రామములోని యొకశాసనము.

స్వస్తిశ్రీ మనుమహామండలేశ్వర పల్లినాంటి వీరుండు అనుంగుం దేవ మహారాజుల ఏలికి కమ్మనాంటిలోని ద్రోణాది కేసవదేవుల......

(4) పల్నాటి తాలూకా- దుర్గిశాసనము- కాకతి గణపతి దేవుని కాలము. క్రీ. శ. 1251

స్వస్తి శ్రీ మచ్ఛకాబ్దే గుణగిరిగిరిశే వత్సరేస్మి న్విరోధకృత్యాం శ్వినాద్యమాసే సితరతిపతిథౌ కావ్యవారే ప్రకౢప్తే పుష్యత్సస్యాంధ్ర దేశాదికశుభవిలసత్పల్లినాంటౌప్రసిద్ధే ఎయ్యూరి గ్రామవర్యో మహిమ పతిదిశః కృష్ణవేణీతటిన్యాః (సంస్కృతభాగము) పల్లినాంటిలో దుగ్య పట్టనము (తెలుగుభాగము.)

(5) కర్నూలుజిల్లాలోని మార్కాపురము తాలూకా త్రిపురాంతకము- గణపతిదేవుని కాలము. క్రీ. శ. 1269.

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర మూరురాయజగదళ కాకతీయ గణపతిదేవ దివ్య శ్రీపాదపద్మోపజీవియైన శ్రీమన్మహామండలేశ్వర గండపెండారు జన్నిగదేవ మహారాజులు తమకుం బుణ్యంబుగాను స్వస్తిశ్రీ త్రిపురాంతకదేవర అంగరంగభోగాలకు పలినాంటిలోని గంద్రకోట అనుంగురాజుపల్లి చతుస్సీమమూను......

(6) పల్నాటితాలూకా దుర్గిశాసనము. క్రీ. శ. 1269 కాకతి రుద్రమదేవి కాలము.

బ్రహ్మకులోత్తముండునుం కాస్యపగోత్రపవిత్రుండునుం నందాపురఅగ్రహారప్రభుముఖ్యుండును వైన సవదరం మల్లపరాజుకొడుకు కరణమునామయ పల్లినాంటిలోని దుగ్యపట్టనమునందు గోపీనాథ దేవరం బ్రతిష్ఠ సేసి......

పైనుదాహరింపఁబడిన ఆరుశాసనములును బదియవ దక్షిణ హిందూదేశ శాసనసంపుటములోఁ బ్రభుత్వమువారు ప్రకటించి యున్నారు. (చ)

శాసనములఁ బరిశీలించినచో పల్నాడనునది పల్లెనాడని స్పష్ట

(చ) సంఖ్యలు. 66, 119, 233, 334, 370, 422, దక్షిణహిందూదేశ శాసన సంపుటము. 10 (శ్రీరామయ్యపంతులుగారి సంపాదకత్వమున వెలువడిన ఆంధ్రశాసన సంగ్రహము.)

మగుచున్నది. శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు ప్రచురించిన 'పల్నాటివీరచరిత్రము' యొక్క పీఠికలోఁ బల్నాటి నామోత్పత్తిని గూర్చి చర్చించి యీవిధముగ వ్రాసిరి.

"ఈసీమ యున్నతములైన కొండలచేఁ జుట్టు నావరింపఁబడి నడుమఁ బల్లముగా నుండుటవల్ల 'పల్లునాడు' నాఁ బేరొందె 'పల్లునాడు' పల్లు, విల్లు, ముల్లు, శబ్దంబులంబోలె జడ్డకు లోపంబురాఁగా 'పలునాడు'గా మాఱె 'పలునాడు' కొద్దిమార్పుజెంది పలనాడై, పలనాడు పల్నాడై పలనాడు, పల్నాడు అను రెండురూపములు వ్యవహరింపఁ బడుచు వచ్చెనని నాయభిప్రాయము."

పైవిధముగ వ్రాసి కాకునూరి అప్పకవి పల్లెనా డని ప్రయోగించెననియు, నయ్యది ప్రాకృతజనధోరణిం బల్లెనా డని చెప్పుట ప్రామాదికమని సెలవిచ్చిరి. వారె శ్రీ మెకంజీదొర 'పాలనాడె' పల్నాడైన దని చెప్పినవిషయము సమంజసముకాదని నిరూపించిరి. ఆంధ్రచరిత్ర కారుఁడు పల్నాటి పదవ్యుత్పత్త్యర్థమును గూర్చి యీవిధముగ వక్కాణించెను.

"ఆంధ్రరాజధానీనగరమగు ధాన్యకటకమునకు దక్షిణభాగమున జైన బౌద్ధ శైవమతములవలంబించిన పహ్లవాదులు వేనవేలు నివసించుచు క్రమముగా నాంధ్రులలోఁ గలిసిపోయి యాంధ్రపహ్లవులనంబడు చుండిరి. ఈ యాంధ్రపహ్లవులే పల్లవులైరి. ఈపల్లవులు నివసించు ప్రదేశమే పల్లవనా డను పేరంబిలువఁబడు చుండెను. ఈపల్లవనాడే నేఁడు పల్నాడని పిలువఁబడుచు గుంటూరుమండలములోనున్నది. (ట)

పహ్లవనాడు, పల్లవనాడు పల్నాడుకాలేదనియు, దీని వ్యుత్పత్త్యర్థము పల్లి లేక పల్లె యనుపదముతో సంబంధించినదనియు సహేతుకముగా దొరతనమువారి శాసనపరిశోధకులు తమనివేక యందిట్లు వ్రాసియున్నారు.

(ట) ఆంధ్రులచరిత్ర ప్రథమభాగము. పుట 126.

"ఈశాసనములలో 'పల్లినాడ'ను దేశవిభాగము గమనింపవలసి యున్నది. రెండవ విష్ణువర్ధనుని తామ్రశాసనములో నొకదాని యందిది పల్లిరాష్ట్రముగ పేర్కొనఁబడినది. మాచెర్లలో నొకశాసనమం దియ్యది 'పల్లినాండు-300' అనియే వ్రాయఁబడినది. శ్రీనాథుఁడు దీనినే పల్లినా డని వర్ణించెను. కొంతమంది పండితులు నేటి పల్నాడనునది పహ్లావ లేక పల్లవ పదములనుండి యుద్భవించినదని యభిప్రాయపడిరి. కాని యీపల్నాడనునది పల్లి లేక పల్లె పదముతో సంబంధించినది. పల్లెయనగా బౌద్ధ లేక జైన నివాసమని యర్థము. (౩)

---

(౩) *P. 15–16 Annual Report on South Indian Epigraphy 1939–40—1942–43.*

(1) The earliest record in the Collection is a Copper plate grant from Gurjala (C. P. No. 39 of 1940—41.) dated 30th regnal year of Jayasimha I and recording the grant of village Koneki in Pallirastra by his nephew, prince Vishnuvardhana to some learned Brahmins The village Koneki may be identified with Konanki in Palnad Taluk....

(2) The next is a stone incription form Macherla (No. 18 of 1941—42) which is dated in the 8th year of Sakala-Lokasraya Jayasimha Vallabha and registers a grant of land made by headman of Pallinadu.

The name "Pallinandu" is significant In the Copper plate grant of Vishnuvardhana II mentioned above (No. 39 of 1940–41) it occurs as "Pallirashtra". In another inscription also form Macherla (No. 13 of 941-42) belonging to 13th century A D, it is mentioned as Pallinandu 300. Poet Srinadha refers to the country as "Pallinadu". It has been explained by some scholors that the modern Palnad must have been derived its name form Pallava or Pahlava, but the early form its name occuring in inscriptions show that it must be connected with the word "పల్లి" which in Tamil means a Jaina or Buddhist settlement.

ఈపల్నాడనునది గుంటూరుమండలములో నాపేరిటనే యొక తాలూకా నేటికినిగలదు. అయ్యది కృష్ణకు దక్షిణతీరమున, సత్తెనపల్లి తాలూకాకు పడుమటయును, వినుకొండతాలూకాకుత్తరమునఁ గలదు. దీనిలోని ముఖ్యనదులు నాగులేరు, చంద్రభాగ లేక చంద్రవంకయును. సుప్రసిద్ధమైన నాగార్జునకొండసీమ యీపల్నాటితాలూకాలో నేఁ గలదు. మాచెర్ల, కారెంచేడు, గురజాల ముఖ్యగ్రామములు. ఇయ్యది పల్నాటిపీరులని పిలువఁబడు వీరవరేణ్యుల విహారభూమి. ఆంధ్రసారస్వతమున నీవీరచరిత్రము శ్రీనాథుఁడు, కొండయ, మల్లన, వీరభద్రకవి వర్యాదులు కావ్యములుగ రచించిరి. కావున నీపల్నాడు ఆంధ్రచరిత్రయందును, సారస్వతమునందును ప్రసిద్ధికెక్కిన నాడులలో నగ్రగణ్యమైనది. ప్రాచీనకాలమున బౌద్ధమతవ్యాప్తికి స్థానమైన ప్రసిద్ధ నాగార్జునాచార్య బౌద్ధసంఘారామమునకు నిలయమై, ఈప్రాంతముల బౌద్ధనివాసములకాటపట్టగుటచె నియ్యదిపల్లెనాడై, తర్వాత పల్నాడైనదని యూహించుటయే సమంజసమని తోచుచున్నది.

## కమ్మనాడు

ఈ కమ్మనాడాంధ్రదేశములోని యత్యంతప్రాచీనమైన నాడీ విభాగములలో నొకటి. ప్రాచీనాంధ్రప్రాకృతశాసనములలో నియ్యది కమ్మాకరఠమని పేర్కొనఁబడినది. ఇక్ష్వాకుల రాజశేఖరుఁడైన శ్రీ వీరపురుషదత్తుని జగ్గయపేటశాసనములలోనిది కమ్మాకరఠమని వ్రాయఁబడినది. (ప) తర్వాతశాసనములలో నీయది కర్మరాష్ట్ర మనియు,

(ప) *Epigraphia Indica. Vol, X. Luder's lists of Brahmi Inscriptions. No. 1202, 1203, and 1204.*

కమ్మనాడనియుఁ దెలుపఁబడినది. వానిలోఁ గొన్నిటి నుదాహరించు చున్నాను. (౧)

(1) సర్వలోకాశ్రయుని చందలూరు శాసనము. క్రీ. శ. 673.

పరమబ్రహ్మణ్యః మహారాజానుభావ శ్రీ సర్వలోకాశ్రయ మహారాజః కమ్మరాష్ట్రే చెందలుగ్రామే గ్రామేయకానత్రగత సర్వానాయోగికవల్లభాంచ్చా జ్ఞాపయతి.

(2) కుమారవిష్ణుని (పల్లవరాజు) చందలూరు శాసనము.

శ్రీ కుమారవిష్ణుః కర్మాంకరాష్ట్రే చెందులూరగ్రామే గ్రామేయకాన్ అత్రధికృత సర్వానై యోగిక వల్లభాంచ్చా జ్ఞాపయతి. యదస్మిన్ అస్మాభిః కర్మాంకరాష్ట్రే కవచకారభోగె చెందలూరగ్రామే.

(3) రెండవఅమ్మరాజు మలియంపూడి శాసనము.

ససమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య మహారాజాధిరాజపరమేశ్వరపరమధార్మికో అమ్మరాజః కమ్మనాడు విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సర్వాన్ నిత్థమాజ్ఞాపయతి...

(4) రెండవఅమ్మరాజు వేములూరపాడు శాసనము.

కర్మరాష్ట్ర నివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సర్వానేవ సమాహ్వాయేత్థ మాజ్ఞాపయతి.

---

(౧) (ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటములు-వాని సంఖ్య-పుటలు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) | Epigraphia | Indica | Vol. | VIII | p. 238—239 |
| (2) | do | do | do | do | p. 233—236 |
| (3) | do | do | do | IX | p. 47—56 |
| (4) | do | do | do | XVIII | p 226—235 |
| (5) | do | do | do | do | p. 257—261 |
| (6) | do | do | do | XV | p. 250—251 |
| (7) | do | do | do | XVIII | p. 313—316 |
| (8) | do | do | do | XIII | p. 1—11 |

(5) రెండవపులకేశి కొప్పరము శాసనము క్రీ. శ. 631.

మూగమూర్వాస్తవ్యస్య శాండిల్యాయనగోత్రస్య ఆపస్తంభ సూత్రస్య విప్రస్య వేదశర్మణః కర్మరాష్ట్రే ఇర్బులిగ్రామే అష్టశతం క్షేత్రం దత్తం.

(6) పల్లవరాజైన రెండవ విజయస్కందవర్మ శాసనము.

శ్రీవిజయస్కందవర్మనః వచనేనకర్మరాష్ట్రే అధికృతాః అయుక్తాః ఒంగోడుగ్రామశ్చ వక్తవ్యాః అస్మై కాస్యపాయద్వివేదియ షడాంగపారగాయ గోలశర్మనే ఏషాః ఒంగోడుగ్రామాః సాత్వికేన దానేన దేవభోగహాలవర్జః బ్రహ్మదేయీకృత్య...

(7) రెండవజయసింహుని పెనుకపఱ్ఱు శాసనము.

కర్మరాష్ట్రవిషయనివాసి కుటింబినః భవద్విషయే సర్వాన్ ఇత్థమాజ్ఞాపయతి.

(8) పంటమైలారెడ్డి తిరువళిక్కేణి శాసనము. క్రీ శ. 1428

అద్దంకిసీమ్ని కంమప్రకటితవిషయే దేవరాజక్షితీంద్రః ప్రాదాగ్రామం నృసింహాభిదగురవే సాధుతక్కేళ్లపాడుం.

దీనిలో చెప్పబడిన దేవరాజక్షితీంద్రుఁడు విజయనగరప్రభువైన రెండవదేవరాయలు.

పైని వివరింపఁబడిన శాసనములేగాక నెల్లూరిమండల శాసన సంపుటలలో ఒంగోలుతాలూకాకు జెందిన శాసనములఁ గొన్నిటిఁయందు కమ్మనాడుదహరింపఁబడినది.

(1) శ్రీమన్మహామండలేశ్వర చోడమదేవమహారాజుల దివ్య సంవత్సరాలు ౬౹౨ శ్రాహి మాఘూవి కమ్మనాఁటిలోని గుండినదీతీరమందు బుద్ధపూండి మాండుకేశ్వరమహాదేవరకు......... (ఒంగోలు 74.)

(2) స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౨౫... స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ్య ప్రతాపరుద్రదేవ మహారాజులు రాజ్యము

సేయుచుండంగాను కమ్మనాంటిలోని రావినూంతుల స్థలమున బ్రహ్మాని పాటంగట్టిన...... (ఒంగోలు 129.)

(3) శ్రీమహామండలేశ్వర త్రిభువనమల్ల దేవచోడ మహారాజులు కొంట్రుదాన శ్రీకేశవదేవరకు మాజీవితమ్మున కమ్మవాణ్టిలోని ఒలుపఱ...(వలపర్లగ్రామము) (ఒంగోలు 142.)

(4) శ్రీమన్మహామండలేశ్వర కాకతీయరుద్రదేవ మహారాజులు శ్రీమతు కొల్విదాన త్రిభువనమల్ల ప్రహరి కేశవదేవరకు కంమ్మనాంటి లోని ఒలుపఱ...(వలపర్లగ్రామము.) (ఒంగోలు 143.)

పై నుదాహరింపఁబడిన గుంటూరుమండలమున ఒంగోలు తాలూకాలోని కొన్నిగ్రామములలోఁగల కమ్మనాటిప్రశంసయే గాక, బాపట్ల నరసారావుపేట సత్తెనపల్లితాలూకాలలోని మరికొన్నిగ్రామములు సహితము కమ్మనాటిలో జేరియున్నట్లు ఆయా తాలూకాల లోని గ్రామములందలి శాసనములవల్ల విదితమగుచున్నది. ఆశాసనములలోని సీమావివరములచేఁ గమ్మనాటి సరిహద్దుల నిర్ణయముచేయుటకును వీలగుచున్నది.

(1) నరసారావుపేటతాలూకా తంగేడుమల్లికొప్పరములో శాసనములు. క్రీ. శ. 1115. (దక్షిణహిందూదేశశాసనసంపుటము 10. సంఖ్యలు 73–74.)

తంగేడుమల్లి— శ్రీశైలప్రాగ్భాగే కర్మక్షితిమహితకొప్పర గ్రామే దా ఖానితౌ తటాకౌ తేన సేతూపమానఘనసేతూ 1.

శ్రీమన్మహామండలేశ్వర కడరురాజం కమ్మవిషయస్య ప్రభుస్వామినం.

(2) బాపట్లతాలూకా ఈడుపులపాడు శాసనము. క్రీ. శ. 1209.

స్వస్తిశ్రీ మత్త్రిణయనపల్లవ పరిక్షిత నిరూపిత పుణ్యరూప సప్త శతాగ్రహారావతార యోగ్యకర్మారుహకర్మరాష్ట్రే ఇకుపలపాటి నామ్నిగ్రామాగ్రహార. (దక్షిణహిందూదేశశాసనసంపుటము పది. సంఖ్య 248.)

(3) నరసారావుపేటలో ద్రోణాదుల శాసనము.

స్వస్తి శ్రీమనుమహామండలేశ్వర పల్లినాంటి వీరుండు అనుంగుం దేవమహాదేవ వీలికి కమ్మనాంటిలోని ద్రోణాది కేశవదేవుల...

(దక్షిణహిందూదేశ సంపుటము పది. సంఖ్య 233.)

(4) బాపట్లతాలూకా అప్పికట్ల క్రీ. శ. 1172.

శ్రీ కులోత్తుంగరాజేంద్రచోడరాజః తుంగభద్రాదక్షిణ తీర వాహినే శ్రీ విశ్వేశ్వరమహాదేవాయ కమ్మనాంటివిషయే అప్పికట్ట గ్రామస్య పూర్వతః...

(5) బాపట్లతాలూకా బాపట్ల క్రీ. శ. 1151.

1. కమ్మనాణ్టి ప్రేంపల్లి భావనారాయణకు–

2. ఉత్తమచోడదలనాణ్ఠి కమ్మనాణ్ఠి ప్రేంపల్లి శ్రీ భావనారాయణదేవరకు– లేక

ఉత్తమచోడవళనాంటి కమ్మనాంటి ప్రేంపల్లి శ్రీభావనారాయణ దేవరకు–

(6) నరసారావుపేటతాలూకా–కోణిదెన. క్రీ. శ. 1137.

1. కమ్మనాంటిలోని పల్లమెట్టలోపుగా నుప్పంగొండూరి చతుస్సీమమును బెద్దగంజామునుం గడకుదురునుం గూరవాడయుం బాయుం దొఱ్ఱునుం బిన్నగంజామునుం లోనైన ఉప్పలములసుంకము.

2. శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్ల చోడదేవరాజులు శకవర్షంబులు ౧౦౬౯ యగునేంటి విషుసంక్రాంతినిమిత్తమునం గమ్మనాంటిలోని గుండియపూండి నిజరాజధానియైన కొట్టియదొన శ్రీ బల్లీశ్వరమహాదేవరకు.

(3) తననిజవృత్తమిందవిదతంబుగ నోపిలిసిద్ధి విన్నసి
ద్దనకు ననుంగు దమ్ముడు ప్రతాపమునం జని కమ్మనాండు సే
కొని గణపతీశు దయగూడి తదాజ్ఞవహించి యేలె బా
వనమగు నాఱువేలును నవక్రపరాక్రమవిక్రమంబునన్. (జ)

(4) నరసారావుపేట తాలూకాలోని అప్పాపురములోని యొక శాసనములోఁ గమ్మనాఁడు త్రిలింగదేశాలంకారమైన సీమయని యభివర్ణింపఁబడినది.

జంబూద్వీపంబులో భారతవర్షంబున భారతఖండంబునందు మేరువు పర్యంతంబునకు దక్షిణదిగ్భాగంబున శ్రీశైలవారాసముద్ర పార్శ్వంబున నోంకారనదీతీరంబునం ద్రిలింగదేశాలంకారం బైన కోట భూమి కమ్మనాంటి సీమాస్థలంబునందు నాదిండ్లపురమున.

(దక్షిణహిందూదేశ శాసనసంపుటములు 10– సంఖ్య 573.)

కమ్మనాఁటిని, జేర్కొనిన్న ప్రథమాంధ్రకవి పావులూరి మల్లన. కమ్మనాఁడులోని పావులూరు గ్రామమునకుఁ గరణమైయుండెను. (పావులూరు బాపట్ల తాలూకాలో నున్నది.)

కం॥ ఇలఁ గమ్మనాఁటిలోపల
విలసిల్లిన పావులూరివిభుఁడను సూత్రా
కలితాపస్తంభద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్యగోత్రోద్భవుఁడన్.

(పావులూరి గణితము.)

శ్రీ లక్ష్మణరావుగారు రెండవపులకేశి తామ్రశాసనము నొకటి నాంధ్రపరిషత్పత్రికలోఁ (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము 11–

---

(జ) (4) (5) (6)
దక్షిణహిందూదేశశాసనసంపుటము—6, శాసనసంఖ్యలు:
124; 127; 134-136; 152; 164; 165; 175; 606; 608; 628.

సంచిక 4-5.) ప్రకటించుచుఁ బదవశతాబ్దమునందున్న పొన్న యను కన్నడకవి తన శాంతిపురాణమున కమ్మనాండు వేంగివిషయములోనిదని చెప్పినట్లు వ్రాసియున్నారు. అదియునుగాక కమ్మనాఁడు ఉత్తమచోల వలనాఁటిలో నంతర్భాగమని బాపట్ల శాసనములలో వ్రాయఁబడి యున్న ట్లుదాహరించితిని గదా. 'ఉత్తమచోళ' యనునది చోళప్రభు వుల బిరుదులలో నొకటి. చోళరాజ్యము మండలములుగను, వలనా డులుగను, కుఱ్ఱములుగను విభజింపఁబడినట్లు చోళులచరిత్రమువలనఁ దెలియుచున్నది. చోళప్రభువు లాంధ్రదేశమును జయించి, యీదేశ ములోని యంతర్భాగముల వలనాఁడులనియు, నాడులనియు విభజించి యుండిరి. ఈవిషయము మిగిలిననాఁడులను గూర్చి వ్రాసినపిమ్మటఁ బ్రత్యేకముగఁ జర్చింతును.

పైనివివరించిన శాసనాధారములఁబట్టి తేలినవిషయ మేమనగా; కమ్మనాఁడనుప్రదేశము కర్నూలుజిల్లాలోని శ్రీశైలపర్వతమునకుఁ దూర్పుభాగమున గుంటూరుజిల్లాలోని వినుకొండ నరసారావుపేట తాలూకాలును, సత్తెనపల్లి తాలూకాలోనికొంతభాగమును, ఒంగోలు తాలూకాలోని అద్దంకి సీమయు, కర్నూలు జిల్లాలోని మార్కాపురము తాలూకాలో గుండ్లకమనది వఱకును వ్యాపించియున్నట్లు భావింప వచ్చును. (సశేషము.)

# గ్రంథస్వీకారము - సమీక్ష

శ్రీ బండారు తమ్మయ్యగారు

## అంగలూరు శ్రీ విష్వేశ్వర గ్రంథమాలికా ప్రచురణములు

| | | | | |
|---|---|---|---|---|
| (1) | రత్నమాల క్రౌను పుటలు | 48 | వెల 0-8-0 | కర : విద్వాన్ |
| (2) | ,, ,, | 50 | ,, 0-8-0 | ఉభయ భాషా |
| (3) | ఆంధ్రపుత్రతారావళి ,, | 12 | ,, 0-2-0 | ప్రవీణ, శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జున రావుగారు- సీనియరు తెలుఁగు పండితులు, బోర్డు హైస్కూలు, పామర్రు, కృష్ణాజిల్లా. |
| (4) | ఆంధ్రరాష్ట్రము ప్రథమభాగము (1939 లోఁ బ్రకటితము) | 30 | 0-2-0 | ప్రకాశకులు : శ్రీ కోగంటి |
| (5) | గాంధిస్మృతి ,, | 24 | ,, 0-4-0 | మార్వాసులు. సంపాదకురాలు : శ్రీమతి కోగంటి అన్నపూర్ణమ్మ. |

(6-17) భారతీసమితి మాససంచికలు :-

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున రావుగారు నవనవోత్సాహచాక చక్యవిభాసితు లగు యువకులు. కమ్మకులీనులకుఁ బట్టుఁగొమ్మ యైన గుడివాడతాలూకా అంగలూరు వీరి జన్మస్థలము. శ్రీ జాస్తి వెంకట నరసయ్య మున్నగు నితరసభ్యులు, స్థాపకులు మఱికొంద ఱున్నను సం॥ 4 సం॥ 5 లోఁ బ్రశంసింపఁబడిన భారతీసమితి, సన్మానసంఘము లింతదనుకఁ గావించుచున్న సత్కార్యాచరణనిర్వాహణములకు

సంఘకార్యదర్శి మల్లికార్జునరావుగారి దీక్షోత్సాహములే మూల స్తంభములు- కృష్ణాజిల్లా రచయితలసంఘమునకుఁగూడ వీరే కార్య దర్శిగా నున్నవారు. భారతీసమితిపక్షమున వెలువడు మాసపత్రికను సంపాదకులుగా నుండి ప్రకటించుచున్నారు. మఱియు "లలిత" యను లిఖితవారపత్రికనుగూడఁ దమసంపాదకత్వముననే వెలువరించు చున్నారు. వీరి మాతృభాషాదేశాభిమానములు నిరుపమానములు. తోడికమ్మసోదరులు పలువురువలెఁ బదవులకయి యుద్యోగములకయి యాంగ్లవిద్యాభ్యాసమునే సాగించి యందు పట్టభద్రులగుట యాశింపక, తల్లిదండ్రు లారంభింపఁజేసిన యాంగ్లవిద్యాభ్యాసమునకు స్వస్తి చెప్పి మక్కువతో మాతృభాషలనే యభ్యసించి, ప్రాచ్యభాషాపట్టభద్రతల తోనే పరితుష్టి నొంది యాంధ్రభాషోపాధ్యాయవృత్తినే జీవికగాఁ గొని కాలము గడపుచున్నవారు. మదరాసు విశ్వవిద్యాలయమువారి "విద్వాన్" పరీక్షయందును, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి "ఉభయ భాషాప్రవీణ" పరీక్షయందును రెంటనుగూడ నుత్తీర్ణు లయి ప్రాచ్య భాషాపట్టములు రెండింటిని జేపట్టినవారు. వీరివేషమువలె భాషయుఁ గూడ నిరాడంబరము. సామాన్యపాఠకలోకమునకుఁగూడ సుగమ ములు, సుబోధకములుగ నుండవలెనను ప్రధానలక్ష్యముతో వీరు తమ రచనములఁ జాలవఱకు సులభమగు గ్రాంథికభాషలో సాగించుచుందురు. అందుచేఁ బద్యరచనములో వీరు తేటగీతులను, ఆఁటవెలదులను, కంద ములను అధికముగ నాదరింతురు. ఇందుకుఁ బైనిబేర్కొన్న 1, 2, 3 సంఖ్యగల చిన్నిపొత్తములే తార్కాణములు. అందందుఁ గానవచ్చు వృత్తములు తద్రచనమునను వీరికిఁగల నైపుణ్యమును లాలిత్యమును బ్రకటించుచున్నవి. వీరికవితాలాలిత్యము, భాషాభిమానపండితసేవ నములకు నలరి తత్ప్రాంతీయవిద్వత్సంస్థలు కొన్ని కవిమిత్ర, కవికోకిల, కవితాభూషణ బిరుదముల నొసంగి వీరిని గౌరవించియున్నవి.

రత్నమాల, పుష్పవల్లి గూడ దేశనాయకుల, పండితకవుల సన్మానములు, కృషీవలుల, నిమ్నజాతుల కష్టములు, మిత్రులయిండ్ల యందలి వివాహములు మొదలగు పలువిషయములఁగూర్చి యాయా సందర్భములలో వీరు చెప్పిన పద్యముల సేకరించి ప్రకటించిన ఖండ కృతిసంపుటములు. మొదటిది జాస్తి వెంకటనరసయ్యగారికి, రెండవది సికింద్రాబాదునందలి రాజేశ్వరగ్రంథాలయవ్యవస్థాపకులు శ్రీ మొగు దుంపురం రాజేశ్వరాచార్యులుగారికి నంకిత మొనర్పఁబడినవి. రెండవ కృతిభర్త వీరి కపరిచితవ్యక్తి యైనను వారిగుణగణములను, గ్రంథాలయస్థాపనాదిసత్కార్యాచరణములను పత్రికాముఖమున విని కేవల గుణలుబ్ధతచేతనే వారి కాకృతి నంకిత మిచ్చినట్లు లాగ్రంథారంభ మందలి

"ఎట్టివాఁడవో నిన్ను నే నెఱుఁగకున్న
నెట్లు లుందువో మీపురి నెఱుఁగకున్న
నిల్లు వాకిలి యించుక యెఱుఁగకున్నఁ
బుష్పవల్లి నొసంగ సమ్మోదపడితి.

కవులఁ బూజింతు వంచును గవి వటంచు
జనులమేలును వాంఛించు ఘనుఁడ వంచుఁ
దెలిసికొని నేను తెల్గుపత్రికలవలనఁ
బుష్పవల్లి నొసంగ సమ్మోదపడితి."

ఇత్యాదిపద్యములవలనఁ దెలియుచున్నది. ఏతాదృశగుణవిశేష మన న్యసామాన్యము, అశ్రుతపూర్వము. ఇది వీరిహృదయౌదార్యమున కాదర్శకము. మచ్చునకయి యుభయకృతులనుండి యుద్ధృతము లయిన క్రింది పద్యములవలన వీరి కవితాగుణస్వరూపములు కొంత తెలియ నగును.

(i) రత్నమాలనుండి-

జయము, జయము

పరులకొఱకు నెవఁడు ప్రాణంబు లిడు నన్న
నిన్నె చెప్పి యితరు నెన్నవలయుఁ
ద్యాగ మన్న నీదె త్యాగంబు ధరలోన,
జయము గాంధి నీకు జయము జయము.

తుపాను

చచ్చినట్టివారిఁ జావఁగొట్టుట యేల
కలుగఁగలదె దాన ఖ్యాతి యింత
బలులలక్షణంబె బలహీనులను బాధ
పఱచు టెపుడు ధరను వాయుదేవ !

కర్షకుఁడు

పగలు రేయి యనక, వాన యెండ యనక
కాల మనక మఱి యకాల మనక
పాటు వడ్డ లబ్ధి వాటిల్ల దయ్యెను
గట్ట ! యెట్టు బ్రదుకుఁ గర్షకుండు.

దేవదేవ

మూఁడువేళలందు భుజియించిననుగూడఁ
గడుపు మండుచుండు కాలమందు
నోగిరమును దినక యున్నాఁడు మాగాంధి
దేవదేవ ! ప్రోవు త్రిభువనేశ !

వేశ్యామతల్లి

సిగ్గు విడనాడి ధనము నార్జింప నెంచి
వలచి డాయఁగ వచ్చినవారిఁ గూడి
సుమసుకోమలతనువు జాడ్యములపాలు
సలుపఁబోకుము నీవు వేశ్యామతల్లి.

### అనాంధ్రులార

ఎట్టి యిక్కట్టు వచ్చిన నెవరికేని
శక్తికొలఁదిగ సాయమ్ము సలుపకుండ
నొక్కనాఁడేని మా యాంధ్రు లుండలేరు ;
కనుక నింతయొ యంతయొ కరుణ గలిగి
ఆంధ్రులకుఁ దోడుపడుఁడి యనాంధ్రులార !

### గోవిలాపము

ఏమియెఱుఁగనట్టి మా ముద్దుకూనకు
నుగ్గు గిన్నెఁడేని యుండనీక
పట్టి పట్టి యున్న పాలన్ని పిండుట
అనుచితమ్ము గాదె మనుజులార !

### డిటెన్షనుపిశాచము

పోయినకాల మెంతతలపోసిన వచ్చునె యెన్నఁడేనియుఁ
బోయెనటంచు లోనఁ గడుఁ బొక్కిన లాభము లేదు గాన నా
పోయినదానికై వగవఁబోవక నీ విఁకఁ జాలశ్రద్ధతో
నాయయిపాఠముల్ చదువుమా వినుమా యిది నేఁడు బాలకా!

(ii) పుష్పవల్లి-

### నీతిపద్యములు

మద్యపానంబు చేయుట మానవలెను
ఖద్దరునె సతతంబును గట్టవలెను
మాంసభక్షణమును వడి మానవలెను
గుణము చెడకుండఁ గాపాడుకొనఁగవలెను.

### కూడదు

కూడదు కూడ దెప్పుడును గోపముఁ బూనుట మాటిమాటికిఁ
గూడదు కూడ దెప్పుడును గుట్టును దెల్పుట బాంధవాళికిఁ

గూడదు కూడ దెప్పుడును గోవిదనిందయు ధారుణీస్థలిన్
గూడదు కూడ దెప్పుడును గొంతెమకోర్కెలు కోరుచుంటయున్

గర్వము

విమలగుణశోభితుండు నైన సుమతి నైన
బుధవరుండ నైనను మహాభోక్త నైన
యోగి నైన సమున్నతోద్యోగి నైన
గర్వమా నన్ను ముట్టకేకాలమందు.

గురుప్రశంస

కపట మింతయు లేక యేకాలమందుఁ
దెలియకున్నట్టి విషయముల్ దెలియఁజేసి
కరము ఛాత్రుని సంతుష్టి పఱచునట్టి
గురువుమహిమమ్ము వర్ణింపఁ దరమె నాకు.

హైందవకుమార

చెనఁటిమూకలమాటలు చెవిని బెట్టి
ప్రాతి విడనాడి ద్వేషభావమ్ము నూని
అన్నదమ్ములతోడఁ బోరాడుచుంట
తగదు తగదు నీ కెపుడు హైందవకుమార!

[illegible] యో బాపలార
హైందవవరేణ్యులార యో యువనులార
అలిగి మీలోన మీరు పోరాడఁ దగదటం
అనుచు బోధించు భరతఖండాభిమాని.

భరతమాత

ఓ తల్లివై నీవు మాకిటఁ దొనరిసావు
ఏ పూర్వభవమునఁ జేసిన పుణ్యఫలమొ

వలనఁ గాకున్న జననిగాఁ బడయఁగలమె
ప్రథితసద్గుణసముపేత ! భరతమాత !

ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రరాష్ట్రంబు లేనిచో నాదరమ్ము
లేదు సంపూర్ణసౌఖ్యమ్ము లేదు నీకు
నీదుభాషకు నభివృద్ధి లేదు నీకు
దేశమునకు యశము లేదు తెలుఁగుబిడ్డ !

మామ

అల్లుఁ డాడినదానికి నాగ్రహించి
పోరి యల్లుఁడు తన్నిట్లు దూఱెనంచు
చెప్పి యొరులకు "యాగీలు" చేయుచుండు
మామ మామయె యొక పెద్దమ్రాను గాక.

(3) ఆంధ్రతారావళి-

గాంధిమహాత్ముఁడు ఎఱవాడ చెఱసాలలో నున్నతఱి భారత దేశమందలి యస్పృశ్యతానివారణకయి నిరశనవ్రతము పూననెంచిన వార్త వినినప్పుడు 1932 నవంబరులోఁ గవిగారు విద్యార్థిదశయం దున్నప్పుడే యస్పృశ్యతయందలి యనౌచిత్యమును హెచ్చరించుచు, ఆంధ్రుల కుద్బోధపూర్వకముగ "అరసిచూడవయ్య యాంధ్రపుత్ర" అనుమకుటముతో రచించి పత్రికలలోఁ బ్రకటించిన 27 ఆటవెలఁది గీతములకు 1933 ననే వెలువడిన ప్రత్యేకముద్రణ మిది. సంఘసంస్కరణప్రియులు విద్యావంతులు నగు శ్రీ చదలువాడ నాగభూషణరావు గారి కిది యంకితము. జాతీయకవులు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము, మంగిపూడి వెంకటశర్మ, తుమ్మల సీతారామమూర్తిచౌదరి, ఉమ్రాలీషాగార లానాఁడే యభినందనపూర్వకముగ నొసంగిన సదభిప్రాయములు గ్రంథారంభమున ముద్రితము లయినవి. ఈనాఁటికన్న నిరువది

మై దేండ్లక్రిందటి యానాఁటి దేశకాలపరిస్థితులలో నిట్టి యుద్బోధ మత్యంతావశ్యకమై యుండెననుట నిర్వివాదము. దీనిని గుర్తించి బాలకవిదశలోనే యిట్టిపద్యముల రచించి ప్రకటించిన వీరిసమయాభిజ్ఞత యత్యంతము సంస్తవనీయము. మచ్చునకుఁ గొన్నిపద్యములు—

మాలవాఁడు చచ్చి మన్నయిపోవును
మాల గానివాఁడు మన్నె యగును
భేద మిచట నేది వీనికి వానికి...

బావిఁ ద్రవ్వినట్టివారు మాలలె యట్టి
బావినీరు మనకుఁ బనికిరాఁగ
మాల జలముఁ దోడ మైలయా బావికి...

చేయరానితప్పు చేసినవారిని
దాకుచుంట నీకుఁ దగినయపుడు
హరిజనుండు నీకు నస్పృశ్యుఁ డౌనొకో...

ముట్టరానితనము పోకుండ నిల్చిన
గాంధి దక్కు ననుట కల్ల యగును
గాంధి దక్కుకున్నఁ గష్టాలె మన కన్ని...

(4) ఆంధ్రరాష్ట్రము–

ఆంధ్రరాష్ట్రసిద్ధికి జరిగెడి విలంబమునకు ఆంధ్రసోదరుల యైకమత్యము, అశ్రద్ధయే ముఖ్యకారణములని వారైకమత్యముతో నడుముగట్టి యలజడి గావించినచో నది సత్వరముగ లభింపఁగలదని హెచ్చరించుచు దేశాభిమానులు, జాతీయకవులు పలువురు రచించి యందందుఁ బ్రకటించిన గద్య, పద్య, గేయములు కొన్ని ఆంధ్రవేషము, కోడికూఁత, తెలుఁగుతల్లి, ఆంధ్రుఁడా, జయలక్ష్మి, తెనుఁగుతల్లి, స్మరణము, రాష్ట్రగీతి, నేను, తెలుఁగువేషము, ఆంధ్రోక్తి అను శీర్షికలక్రింద నిందుఁ గూర్పఁబడి యున్నవి. శ్రీ జంధ్యాల పాపయ్యగారి తెనుఁగుతల్లి, పోత

రాజు పురుషోత్తమరావుగారి స్మరణ, ఆంధ్రుల పూర్వవైభవము వర్ణించుపద్యములతోఁ గూడినవి. రాష్ట్రవిభజనము గాకుండుటకయి తమిళ సోదరులు పన్నిడి కుతంత్రములు, కలిగించెడి యాటంకములు, మఱికొందఱపద్దియములలోఁ వెల్లడింపఁబడినవి. ఇప్పుడు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మేర్పడినను నేఁడుగూడ నిట్టిగ్రంథపఠనమువలనఁ బ్రయోజనము లేకపోలేదు. అందువలన నాంధ్రాభిమానము రేకెత్తఁగలదు.

(5) గాంధి స్మృతి-

సంపాదకురాలు దుర్గామల్లికార్జునరావుగారి సహధర్మచారిణి. గాంధిమహాత్ముని గాడ్సే 30-1-48 తేదీని హత్య గావించినప్పుడు భారతదేశమున ఘటిల్లిన దురంతసంతాపసూచకముగ ఆంధ్రసోదర సోదరీమణులు పలువురు వ్రాసిన పద్యములు, గేయములు కొన్ని యిందు సంధానింపఁబడినవి. పెక్కింటిలో గాంధిగుణగణములు పలువిధముల నుల్లేఖితము లగుటచే నిట్టి స్మృతిపూర్వకకృతు లెల్లరకు సదా పఠింపఁదగినవే.

(6-17) ఇవి 1948 ఫిబ్రవరి 1956 ఆగస్టు మధ్య వెలువడినవి.

సం॥ 45 సం॥ 5 లో భారతీసమితి సన్మానసంఘముల స్థాపనోద్దేశములు, తత్కార్యములు గూర్చి ప్రశంసించియున్నాము. వాని యాజమాన్యమున నప్పుడప్పుడు పండితకవిసమ్మానములఁ గూర్చినవార్తలు, విశేషములేకాక మల్లికార్జునరావుగారి సంపాదకత్వమున వెలువడు నీ భారతీసమితిమాససంచికలలో నుపయుక్తము లగు ననేక విషయములకు సంబంధించిన కథానికలు, నాటికలు, పద్యములు, గేయములు, వ్యాసములుగూడఁ బ్రకటితము లగుచున్నవి. సాధారణముగాఁ బ్రతి సంచికమూల్యము రు 0-4-0 లుకు మించియుండదు. ఆంధ్రభాషాభిమానుల కీసంచిక లాదరణీయము లని చెప్పనవును.

---

# కామాక్షీస్మితము

(మూకపంచశత్యాంధ్రీకృతినుండి)

శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రి

శా. కందర్పాగమతంత్రమూలగురు వై కల్యాణకేళీకళా
కందం బై శితికంఠనేత్రములకుం గర్పూరచూర్ణంబు నై
మందారస్తబకప్రభామదముఁ గ్రుమ్మంజాలు కామాక్షి దా
మందస్మేరవికాసపుంజమున కస్మద్భక్తిబద్ధాంజలుల్.

మ. జననీ! నీచిఱునవ్వుతళ్కు పరమేశానందసంధాయకం
బు నమద్భక్తవిలోచనంబుల శరత్పూర్ణేందురోచిస్సు నై
ఘనసంసారసరోరుహాకరఖలీకారైకనీహార మై
తనుపుంగావుత నాడుడెందమును గందర్పప్రభాబీజ మై.

మ. తొలఁగంజేయును "బంధుజీవముల" నెందున్ "బల్లవశ్రేణి"తోఁ
జెలిమిం జేయును శుద్ధ మైన "ద్విజరాజిం" గప్పుచున్నట్టి దా
నలరక్తాధర మాశ్రయించియును హృద్యం బై సుధాస్వచ్ఛతో
జ్జ్వల మై నీచిఱునవ్వు పావనతఁ బర్వంజేయు భక్తాళికిన్.

మ. జననీ! మంజులవాఙ్మరందలహరీసంశీతలం బైన నీ
వినుతోదారదరస్మితం బదియు నుర్విం జారుమందార మై
తనరారున్ స్మరవైరివిభ్రమరసోద్యద్వీక్షణారంభ మా
మని యై కన్నుల కింపు గాఁగ వికసింపం జేయు నెల్లప్పుడున్.

మ. గరళంబుం గబళించునప్పు డయినం గంపింపఁగా లేదు దు
స్తరనేత్రాగ్నిశిఖాకలాపమున సంతాపింపఁగా లేదు ని
బ్బర మా తాదృశరుద్రచిత్తము స్మరవ్యాధిజ్వాలజ్వాలకున్
గుఱి యై నీదుస్మితాంశుదివ్యరసముం గ్రోలు న్నిరాతంకతల్.

---

వచ్చెఁ గుబేరుండు వక్ర హస్తాద్యనర్ఘ
నుష్య ప్రవరాధ్యనంచరణుఁడగుచు
నాగమించిరి వహ్ని కోణాధినాధ
మారుతేశాను లాతలమదవిఘూర్ణ
మానిచర మదాభ్ర పూర్వమహిత వాహ
నానుషంగులై యభవుని నాశ్రయింప

మ. తనజామాతయు నాత్మజాతయును మాద్యద్వృత్తిఁ గొల్వొచ్చినె
ట్టనయున్నారట వారలన్మమతనింటంగాంచి బాలన్విలో
కనపర్వంబులు సంఘటింతుననుచున్ గణ్యాదులుండానుభో
రన వేగంబరుదెంచె దక్షుఁడు ప్రమోదస్వాంతచిత్తాబ్జుఁడై

క. సురయక్షరాక్షసులు గిం
పురుషులు గరుడులు చరణులు భుజగులు మునుగా
నరుదెంచి రధికభక్తిన్
బరువడి మునులెల్ల విశ్వపతి భజియింపన్

క. ప్రియమున ననంతరమ రం
భయు నూర్వశియుం దిలోత్తమయు ఘోషఘృతా
చియు మేనకయును మొదలుగ
రయగతి నరుదెంచిరప్సరస్త్రీ లర్థిన్

వ. వెండియు మూర్తివంతంబులగుచు నితిహాస పురాణశాస్త్రంబులు, సరిత్కాసారసముద్రంబులు మంత్రంబులుం దారకంబులుం గ్రహంబులుం దీర్థంబులు నాదిగా వివిధచరాచరంబులు వచ్చినిండిన తత్స భాంగణంబు కేవల కోలాహలంబున ఘోరు కలగుచు చంద్రోదయారంభ ఘూర్ణమానార్ణవంబు ననుకరించుచుండు సమయంబున

ఆ. వినయసరణినంది విభుని సన్నిధిఁ గొప్ప
నరిగి శార్ఙ్గపాణి యాదిగాఁగ
వరుస భజన బుద్ధినచ్చినవారల
వివరముగ నెఱుంగ విన్నవించె

క. కనికనుసన్నను రాని
మ్మని యాశివదేవుఁ డప్పు డనుమతిసేయన్
వినతుండగుచు శిలాదుని
తనయుఁడు మున్నున్నకడక తగఁ జనుదెంచెన్

క. తదనంతరంబ

సీ. పాడఁజూపుఁ డబ్జాక్ష పుష్కరాననులార
కానుకలిండు దిక్పతివరులార
చనుదెండు కొసరక సంయమీశ్వరులార
తత్తరింపకుఁడు గంధర్వులార
నతులరంగుండుఁడా బృందారకోత్తములార
క్రిందుగాఁబడకుండు గరుడులార
వినయశీలత రండు విబుధ శ్రోత్రవులార
చెదరిరాకుఁడు గడుసిద్ధులార
చొరక యించుకనిలుఁడు కింపురుషయక్ష
సారణ..............ముఖ్యులార యనుచు
నాతఁ డందఱనందంద హరునకొప్ప
సమ్ముఖంబు సేయించెఁ గ్రమమ్ముఁగోడ

వ. ఇట్లు ప్రతీహారంబు గడచి యరిగి ముందట నరవిందనాభపురందర ప్రముఖులు కనకాద్రికుద్దియగు పసిండి గద్దియ మీద ననేకశతసహస్ర

సంఖ్యాక రాకాశశాంకసంకాశుండును దత్తదనయావ నిబద్ధభూషణ భోగి ఫణారత్నశోభాస్థాన సకల సదాచార ప్రహాసిత వంధ్య సంధ్యా కలిత రాగరజతాచల విలాసుండును ఘనజ ఘనబింబ పరిహిత నలదుకూలభావబంధుర శార్దూలచర్మ శృంగారుండును ప్రవ్యక్త ముక్తాఫలరూపగత కపాలహాసవ్యాజప్రథిత నక్షత్రజాలుండును, నభ్ర దంతావళి శుండాదండ దీర్ఘ బాహుపరీతవరదాభయలక్షణశూలపినా కుండును, నవప్రవాలారుణవల్లీమతల్లి కారుణచారు జటాకపర్దాగ్ర జాగ్రద్బాలచంద్రప్రసూనుండును, వామాంగనిక్షిప్తశాంభవీసమేతుం డును. నగు నమ్మహాదేవుని సందర్శించి, యందఱుం దమ కిరీటమణి ప్రభా సందోహంబులచేతం దదీయచరణపీఠంబునకు నివాళులు వెట్టుచుం బాదప్రణామంబులు సల్పి మోడ్పుంగేలు ఫాలభాగంబునఁ గీలుకొలిపి జయ జయ పూర్వకంబుగా

తరల. జయనిరంజన భక్తరంజన సర్వదేవగణావనా
వ్యయగుణా చరతత్త్వగోచర యర్కచంద్రహుతాశన
న్నయనమండన జన్మఖండన నాకలోకసరిత్సదా
శ్రయ శిరోరుహ మంగళావహ శంకరాయ భయంకరా!

చ. అమలచిదుజ్జ్వలన్మహిమ నంతము మూలము గానరాక నే
మముగ చరాచరాత్మక సమస్తపదార్థము లందు నుండుచు
న్ననుగతి నిష్ప్రసక్తకలనంబునఁ బూసలలోన నున్న సూ
త్రముక్రియ నొప్పుదీవు హిమధామకళారమణీయ శంకరా!

ఉ. భద్రము విశ్వరక్షణనిబద్ధము శుద్ధము సత్త్వరూఢ మ
చ్ఛిద్రము నిత్యపుణ్యరససిక్తము ముక్తము ధర్మసక్తము
క్షుద్రము సర్వశాస్త్రవినిగుంఫిత సంతత సత్త్వరూపము
న్నిద్రము నీమహత్త్వము వినిర్మలకుండలరాజకంకణా!

వ. అని మఱియుం బెక్కుతెఱంగులఁ దన్నుఁ బ్రణుతించుచుండె నప్రమ
జన శివశంకరుండగు శంకరుం డబ్జాక్షభారతీశ్వరులం గుశలప్రశ్నంబు
నను దిక్పతుల మూర్ధకంపంబునను తపోధన ప్రవరుల మందహాసం
బునను దక్కిన వారిం బ్రసాదావలోకనంబునను వృద్ధానుచారంబు
గా సంభావించి, మన్నించినఁ దత్ప్రసన్నత కలరి, నారాయణప్రముఖు
లు మహేశ్వరునిం బద్మాప్రభృతులు శాంభవినింగా నిట్లంద
తరులం బరివేష్టించి తగిన పగిది నాసనాదు లధిష్ఠించి రట్టియెడ

అప్సరఃకాంతాసమగ్రాంగహార నా
నాక్రమలీలాసనర్తనముల
కందర్పబృందప్రకాశితావాప్తి సం
కలితతత్తద్రాగగానములను
లోకప్రపంచరంజాకర్త్మక నణప
విత్రవిచారగవేషణముల
సుమనోమునీశభాసుర పరస్పరనర్మ
మయసదాలాపనిర్మాణములను
కొంకొంతతడవు కోర్కు లుల్లంబున
గొనలు సాగఁ బెద్దకొలువు లోన
సతియుఁ దాను జూచు జనుల కన్నుల పండు
వగుచుఁ బ్రకట విభవుఁ డగుచు నొప్పె

క. సభలోన దక్షతనయా
విభుఁడు వెలుఁగ మెఱసి తెల్ల విబుధోత్తములున్
నభమున నిశావధూవ
ల్లభుఁడు వెలుఁగ మెఱయు గ్రహములకుఁ బ్రతియగుచున్

క. హరురూపము దివ్యవిభా
ధరులగు సభజనుల కాయదర్పణములఁ బ్రా

స్ఫురిత మగుచు సర్వాంత
ర్స్ఫురితంబగు నతని తత్ప్రభావము దెలియన్

క. దినకరకరరోపలాలన
వనజములు వికాసలీల వఱలినక్రియ శం
భుని వీక్షణ ప్రసన్నత
జనిత ప్రమదములు వొనరె సభ్యముఖంబుల్

వ. ఇట్లు విశ్వంబునుం గొలువ విశ్వనాయకుండు కొంతసేక ప్రొద్దు లీలార్థంబుగా నమ్మహాసనంబునం గొలువిచ్చి నానావినోదగోష్ఠి నందఱ నెమ్మనంబులం బేరెంపులం దేలించుచు మధ్యాహ్నసమయంబున సమస్తసభ్యసేవ్యమానుండును వృషభరాజయానుండునునై యక్కడం గదలి కైలాసపురంబు నధిగమించె కాలరుద్రుని కరంబు కరంబునఁ బట్టి వాహనంబు డిగ్గి మణిపాదుకలు దొడిగి నగరి ముంద మొగసాల నిలిచి యనంతరంబ.

సీ. పసిఁడి బ్రద్దలతోడఁ బ్రతిహారు లందంద
వివరింప నందఱ వీడుకొలిపి
పరిపూర్ణలీల నాదరమూరుచూపులు
వోలయంగఁ గొందఱ వోవఁ బనిచి
మోము జందురునందు మునుకొని చిఱునవ్వు
లిగురొత్తఁ గొందఱ నెలమి నంపి
నెయ్యంబుఁ బచరించు తియ్యంపుఁ బలుకుల
నరువొందఁ గొందఱఁ గరిమఁ బంచి
యిట్లు పెక్కు తెరంగుల నెసక మెసఁగ
నందఱు నిజాలయంబుల కరుగుటయును
దగిలి తగువారు తోడరాఁ దాను సతియు
నభవుఁ డంతఃపురంబున కర్థిఁ జనియె

క. ఈ దృశవ_ర్తసముల నా
హ్లాదము తిలకింప జగము లరయుచు నుండెన్
మేదురతరానుకంపా
శ్రీ దనరఁగ నాశశాంకశిఖరుం డొప్పెన్

క. వారకె యిట్లాస్థాన వి
హారంబన జగతివెలయు హరులీల ప్రియ
స్ఫారతఁ జదివిన వినిసను
సారశుభము లబ్బుచుండు జనులకు నెపుడున్

ఆ. వినుఁడు సముచితముగ ివరింతు నిట మీఁద
నభవుఁ డవధరించి నట్టి లీల
నఘువు మిగుల దక్షునాశాహ్వానుం బన
నది జనంబు లెల్ల నభినుతింప

వ. ఆస్థాన విహారానంతరంబ పరమేశ్వరుండు వీడుకొలుప నిజాశ్రమంబున కరుగుచు దక్షుఁ డాత్మగతంబున

ఉ. చెల్లరె! యేను నేడు శశిశేఖరుఁడు న్నతియుం దలంప నా
యల్లుఁడుఁ గూతురంచుఁ దము నర్మిలిఁ జూడఁగఁ నేఁగి నంతన
న్నొల్లక మామ తండ్రి యని యోపిన వర్తన లేక యందఱుం
చెల్లుగఁ జూచు చాడ్పునన పెంపఱఁ జూచిరి చెప్ప నేఁటికిన్

క. హరువలనను సతివలనను
గురుభావము వడయలేక గోపనముగ నా
సరి వారెల్ల నగంగాఁ
జగిభూతిం బడితి నిట్టి పాపము గలదే

చ. సరసిజనాభ పూర్వులగు సర్వసుపర్వులు మూఢబుద్ధి బా
హిరపడ భూతనాథుసభ కేఁగిన నేఁగిరి గాక యేల నా

కరుగఁగ నాదు పెద్దతన మారడి గోల్పడ నక్కటా కడు
న్వైరవిఁడినై తి నేమిటికి నేయి దలంపఁగ నాత్మలోపలన్

క. మతిఁ దలఁపగ నాకివట్లు
మతి చేసిరి వారు గాన మానితి నేనా
సతిఁ గూఁతు రనుటయుం బశు
పతి నల్లుం డనుట తప్పుఁ బలుకుల నై ననే

ఆ. అరయఁ బెద్దవారి కభిభూతిక ర్తల
జగములందుఁ జాల శత్రు లంత్రపు
వాలయముగఁ బూని వారి నెంతకుఁ దారు
నురకమాఱునేయ నోపవలయు

వ. కావున నస్మదవజ్ఞాకరు సతీసహచరు బహిష్కరించి సమస్త సురహి తార్థంబుగా నొక్కయాగంబు నిర్వహించి కృతార్థత్వ మొందుదు నని యప్పరమేశ్వరు తత్త్వపరిభావంబు తెలియక మహావేశంబున గృహంబునకు వచ్చి యథోచితంబుగా దీక్షాదినంబున.

సీ. పంకజనాభుని భారతీనాథుని
వసురవితారకావల్లభులను
ననిమిషనాథుని యాదోగణేశుని
నంతకపుణ్యజనాధిపులను
అనలరాక్షసులను నాశుగేశానుల
నాదిత్యసిద్ధవిద్యాధరులను
కపిలగీష్పతులను గశ్యపశుక్రుల
మారుతకిన్నరసారణులను
మఱియుఁ దనవారి రప్పించి మనము లలర
నందఱికి నర్హమగు భంగి నర్చలిచ్చి

తదనుమతమున నధ్వరతంత్రమునకుఁ
గడఁగె దక్షుండు దుర్మదగ్రస్తుఁడగుచు

వ. ఇవ్విధంబున దుర్వినయంబు విడునక విశ్వజగదధ్యక్షుఫాలాక్షు విడిచి విధివశంబున మఘకలనంబు నడుపుచుండ నారదుం డతని దురభిమానంబు భావంబున నెఱింగి రోసి రజతాచలంబున కరిగి సముచితంబుగా శాంకరికిఁ దదీయదుర్వ్యసనంబు సకలంబును విన్నవించి చనియె; నిటఁ బరమపతి వ్రతాశిరోమణియగు నాదాక్షాయణియు నాత్మగతంబున

ఉ. అక్కట! యాదురాత్మునకు నారడి చేటది యేల పుట్టెఁ దా
నెక్కడ విశ్వలోకగురు డీశ్వరుఁ డెక్కడ యింత మేలె నే
నిక్కలుషస్వభావునకు నెట్లు జనించితి నిట్టి వార్తలో
స్రుక్కక నాదునాథులకు నేడు చెప్పుదున్

ఆ. చెప్పరాదు పతికిఁ జెప్పకుండఁగ రాదు
తలఁచి చూడ రెండు తప్పు లగుట
నేడు చెప్పుదాన నెట్లును నింతయు
వలయుఁ దెలివి పఱుప మలహరునకు

వ. అని తలంచి యెట్టకేలకు నిశ్చయించి; యాజగన్మాత యక్కడఁ గదలి సత్వరయానంబున విశ్వపతిసమీపంబున కరిగి కరంబులు మోడ్చుచు సవినయంబుగా నిట్లనియె.

క. ఏపరమేశనితాంతద
యాపరతంత్రస్వభావ యానతజనర
క్షాపండితాత్మనా వి
జ్ఞాపన మొక టవధరింపు సర్వజ్ఞశివా!

ఉ. దక్షుఁడు మిమ్ముఁ బిల్వక యదక్షతపాతకకీల నొప్పఁ బ
ద్మాక్షుఁడు మున్నుగాఁగ సకలామరసంఘము గూడఁబెట్టి తా
దీక్షితుఁ డయ్యె నిట్టి విధి త్రిప్పఁగ జన్నము సేయ సంశయా
పేక్షితబుద్ధి నట్టి క్రియ యేవిధియో చని నాథ చూడలే



बौद्धाचार्य नागार्जुनप्रणीत-

# माध्यमिककारिकाः ॥

## प्रथमं प्रकरणम् ।

### सुबोधिनीव्याख्या ॥

श्लो॰ ॥ नत्वा गुरुपदद्वन्द्वं तनुते सोमशेखरः ।
नागार्जुनप्रणीतानां कारिकाणां सुबोधिनीम् ॥
क्व माध्यमिकसिद्धान्तः क्व चाऽल्पाऽल्पा मतिर्मम ।
तथापि गुरुपादानां चरणं शरणं मम ॥

अथ तत्र भवान्नागार्जुनाचार्यो माध्यमिकसिद्धान्तं कारिकाभिरुपनिबध्नन्नादौ प्रेक्षावत्प्रवृत्तये सप्रयोजनमभिधेयं गुरुनमस्कारपूर्वकमुपनिबध्नाति—अनिरोधमित्यादिना ।

का ॥ अनिरोधमनुत्पादमनुच्छेदमशाश्वतम् ।
अनेकार्थमनानार्थमनागममनिर्गमम् ॥
यः प्रतीत्यसमुत्पादं प्रपञ्चोपशमं शिवम् ।
देशयामास संबुद्धस्तं वन्दे वदतां वरम् ॥

यः प्रतीत्यसमुत्पादं देशयामास, वदतां वरं, तं वन्दे इति योजना । अत्र चानिरोधाद्यष्टविशेषणविशिष्टः प्रतीत्यसमुत्पादोऽभिधेयः । सर्वप्रपञ्चोपशमलक्षणं शिवं परनिर्वाणं प्रयोजनम् । वदतां वरमित्यनेन गुरावितरमतनिराकरणपूर्वकस्वमतस्थापनपटीयस्त्वं, प्रामाण्यं च दर्शितम् । प्रतीत्यसमुत्पादोनाम कारणं प्राप्य कार्यसमुत्पादः । कारणभावोत्पत्तिरिति यावत् । एतेनाहेत्वेकहेतुविषमहेतुसम्भूतत्वं भावानां निषिद्धम् । तथा नित्यत्वं च । एवं च चार्वाकवैशेषिक-

सांख्यवेदान्तिनां मतानि प्रत्युक्तानि भवन्ति। तथाहि- चार्वाकास्तु निर्हेतुकमिदं जगत्कण्टकतैक्ष्ण्यादिवत्स्वभावादेव सिद्ध्यतीति वदन्ति। वैशेषिकादयो नित्याननित्यांश्च भावानभ्युपगच्छन्ति। भावमात्रस्य सहेतुकत्वकथनैतानि मतानि प्रत्युक्तानि भवन्ति। यथोक्तप्रतीत्यसमुत्पाददर्शने सत्याचार्याणामभिधेयादिलक्षणस्य प्रपञ्चस्य सर्वथैवोपरमात्प्रपञ्चस्योपशमोऽस्मिन्सतीति व्युत्पत्त्या स एव प्रतीत्यसमुत्पादः प्रपञ्चोपशम इत्युच्यते। एवं चित्तचैत्यानामप्रवृत्तौ ज्ञानज्ञेयव्यवहारनिवृत्तिः। ततश्च जातिजरामरणादिनिखिलोपद्रवनिवृत्तिरिति स एव शिव इत्युच्यते। अत्र च निरोधस्य प्रथमं प्रतिषेधः उत्पादनिरोधयोः पौर्वापर्यनियमो नास्तीति सूचयितुम्। अत एव वक्ष्यति– 'पूर्वं जातिर्यदि भवेत्' इत्यादि। ततश्च नाऽयं नियमः पूर्वमुत्पादेन भवितव्यम्, पश्चान्निरोधेनेति। निरोधोनाम क्षणभङ्गः। उत्पादनमुत्पादः। आत्मलाभ इति यावत्। उच्छेदो नाम प्रबन्धविच्छेदः। शाश्वतस्सर्वकालावस्थायी। एकार्थो नामाऽभिन्नार्थः। भिन्नार्थ एव नानार्थः। आगतिरागमनम्। निर्गतिर्निर्गमनम्। प्रतीत्यशब्दः प्राप्तावपेक्षायां च वर्तते। समुत्पूर्वः पदिः प्रादुर्भावे। तथा च हेतुप्रत्ययसापेक्षो भावानामुत्पादः प्रतीत्यसमुत्पाद इत्युच्यते॥

केचित्तु प्रतिर्वीप्सार्थः; इत्यशब्दः तद्धितान्तो विनाशार्थकः। तथा च प्रतिक्षणविनाशिनां समुत्पादः प्रतीत्यसमुत्पाद इति वर्णयन्ति।

अन्ये तु प्रतिर्वीप्सार्थः; एतिः प्राप्त्यर्थः। तथा च तांस्तान् प्रत्ययान् प्राप्य भावानां समुत्पादः प्रतीयत्यसमुत्पाद इति वदन्ति। सर्वथापि सकारणभावोत्पत्तिं न व्यभिचरति प्रतीत्यसमुत्पादः।

ननु चोत्पादादीनां प्रतिषेधं सर्वधर्माणां शून्यत्वप्रतिपादनार्थमारब्धवानाचार्यः। सति चैवं यन्मृषा न तदस्तीति न सन्त्यकुशलानि कर्माणि; तदभावाच्च सन्ति दुर्गतयः; एवं न सन्ति कुशलानि कर्माणि; तदभावान्न सन्ति दुर्गतयः; तयोरभावान्नास्ति संसारः। तथा च सर्वारम्भवैयर्थ्यं प्राप्नोति। न प्राप्नोति। संवृतिसत्त्वापेक्षया सत्याभिनिवेशिनो लोकस्येयं मृषार्थता भावानामुपदिश्यतेऽस्माभिः। नचैते कृतकृत्या आचार्याः परमार्थतः किंचित्पश्यन्ति यन्मृषा

वा अमृषा वा स्यात् । अपि च येन हि सर्वधर्माणां मृषात्वं परिज्ञातं न तस्य संसारः कर्माणि वा सन्ति । नाप्यसौ कस्यचिद्धर्मस्यास्तित्वं, नास्तित्वं वा पश्यतीति न तस्योपदेशोऽयम् । यस्तु मायानाटके मायानिर्मितां स्त्रियं दृष्ट्वा रक्तो भवति, ततश्च तामेव स्त्रियं मनसि कृत्वा तच्चिन्ताक्रान्तमानसो दुःखमनुभवति तादृशं पुरुषमुद्दिश्यायमाचार्याणामुपदेश इत्यलम् ।

वस्तुतस्तु 'यः प्रतीत्यसमुत्पादः शून्यतां तां प्रचक्ष्महे' इति वक्ष्यमाणशून्यतैव प्रतीत्यसमुत्पादः । तस्याश्चानिरोधादिकं सर्वमुपपद्यत एव ॥

इदानीमनिरोधादिविशेषणविशिष्टप्रतीत्यसमुत्पादप्रतिपिपादयिषया उत्पादप्रतिषेधेन निरोधप्रतिषेधे सौकर्यं मन्यमानः आचार्यः प्रथममुत्पादप्रतिषेधमारभते— न स्वत इत्यादिना । तत्र परैः परिकल्प्यमान उत्पादस्स्वतो वा कल्प्यते, उत परतः, उतोभाभ्यां, आहोस्विदहैतुकः कल्प्यते? सर्वथापि नोपपद्यते । तथाहि—

न स्वतो नाऽपि परतो न द्वाभ्यां नाप्यहेतुतः ।
उत्पन्ना जातु विद्यन्ते भावाः क्वचन केचन ॥१॥

अत्र जात्वित्यस्य कदाचिदित्यर्थः । क्वचनशब्द आधारपरः । ततश्च स्वत उत्पन्ना भावा नैव जातु विद्यन्ते क्वचन केचनेति सम्बन्धः एवं प्रतिज्ञातत्रयमपि योजनीयम् । नैव स्वत उत्पद्यन्ते भावाः । कुतः? तस्य जनने न गुणोऽस्ति किञ्चिज्जातस्य जन्म पुनरेव च नैव युक्तम्' इयादिना अन्यत्र दूषितत्वात् । ननु भावानां स्वत उत्पत्तिप्रतिषेधे परत उत्पत्तिः प्राप्नोतीतिचेन्न प्राप्नोति । कथम्? परस्यैवाभावात् । एतच्च 'न हि स्वभावो भावानां प्रत्ययादिषु विद्यते । स्वभावेऽविद्यमाने तु परभावः कुतो भवेत्' इत्यत्र प्रतिपादयिष्यते । किंच 'अन्यत्प्रतीत्य यदि नाम परो भविष्यज्जायेत तर्हि बहुलश्शिखिनोऽन्धकारः । सर्वस्य जन्म च भवेत्खलु सर्वतश्च तुल्यं परत्वमखिले जनकेपि यस्मात्' इत्यादिनान्यत्रापि परतो भावानामुत्पत्तेः दूषितत्वाच्च । द्वाभ्यामपि नोत्पद्यन्ते भावाः । उभयपक्षोक्तदोषाऽनतिलङ्घनात् । 'स्यादुभाभ्यां कृतं दुःखं स्यादेकैककृतं भवेत्' इत्यत्र दूषितत्वाच्च । अहेतुतोपि नोत्पद्यन्ते

भावाः । 'हेतावसति कार्यं च कारणं च न विद्यते' इत्यादिना वक्ष्यमाणदूषणप्रसङ्गात् । किंच 'गृह्येत नैव च जगद्यदि हेतुशून्यं स्याद्यद्वदेव गगनोत्पलगन्धवर्णौ' इत्यादिना अन्यत्रोक्तदोषप्रसङ्गाच्च ॥१॥

ननु स्वतः, द्वाभ्यां, अहेतुतः भावा नोत्पद्यन्ते इति यदुक्तं तदङ्गीक्रियते । यदपि परतोपि भावा नोत्पद्यन्त इति तदयुक्तम् । कुतो भगवता परभूता एव भावानामुत्पादका निर्दिष्टाः । तथाहि—

चत्वारः प्रत्यया हेतुश्चालम्बनमनन्तरम् ।
तथैवाधिपतेयं यत्प्रत्ययो नास्ति पञ्चमः ॥२॥

निर्वर्तको हेतुरिति लक्षणाद्यो हि यस्य निर्वर्तकः स तस्य हेतुप्रत्ययः । यथा बीजमंकुरस्य । उत्पद्यमानो भावो यमालम्ब्योत्पद्यते स तस्यालम्बनप्रत्ययः । यथा क्षेत्रमंकुरस्य । कारणस्यानन्तरो निरोधः कार्यस्य समनन्तरप्रत्ययः । यथा बीजनिरोधोऽङ्कुरस्य समनन्तरप्रत्ययः । बीजनिरोधमन्तरा अंकुरस्योत्पदाऽसम्भवात् । यस्मिन्सति यद्भवति तत्तस्याधिपतेयमित्युच्यते । यथा जलपवनादिकमंकुरस्य । पुरोजातादयस्त्वेतेष्वेवान्तर्भवन्ति । ईश्वरादयस्तु प्रत्यया एव न भवन्ति । अतश्चत्वार एव प्रत्ययाः । एते च परभूताएवेति ।

अत्रोच्यते—

न हि स्वभावो भावानां प्रत्ययादिषु विद्यते ।
स्वभावेऽविद्यमाने तु परभावो न विद्यते ॥३॥

स्वस्य भावो भवनं स्वभावः । विद्यमानत्वमिति यावत् । यदि परभूतेषु हेत्वादिप्रत्ययेषु व्यस्तेषु समस्तेषु वा क्वचिदन्यत्र वा भावानां कार्याणामुत्पादात्पूर्वं स्वभावो विद्यमानत्वं स्यात्तदा कार्यापेक्षया परभूतेभ्यः प्रत्ययेभ्यो कार्यस्योत्पाद इति शक्यते वक्तुम् । नचैवमुत्पादात्पूर्वसम्भवो भावानाम् । तथासति उत्पादात्पूर्वमपि गृह्येत । उत्पादवैयर्थ्यं च स्यात् । तस्मान्नास्ति भावानां प्रत्ययादिषु स्वभावः । एवमविद्यमाने भावानां स्वभावे, परेभ्यो भवनं परभावः सोऽपि नास्ति । अंकुरादीनां भावानां बीजादिषु प्रत्ययेषु स्वभावे

सिद्धे अंकुरापेक्षया बीजस्य परत्वं स्यात् । विद्यमानयोर्हि चैत्रमैत्रयोः परस्परापेक्षया परत्वं स्यात् । नचैवं भावानां प्रत्ययानां च यौगपद्यमस्ति । तथा च कमपेक्ष्य प्रत्ययानां परत्वमिति वक्तव्यम् । तस्मादयुक्तमेतत् । यत्परेभ्यो भावानामुत्पत्तिरिति, यतोऽविद्यमाने स्वभावे परभावः परत्वं नोपपद्यते ॥३॥

एवं प्रत्ययेभ्य उत्पादवादिनि प्रतिषिद्धे क्रियात उत्पादवादी वदति— न चक्षूरूपादयश्च प्रत्ययास्साक्षाद्विज्ञानमुत्पादयन्ति । विज्ञानजनिक्रियानिष्पादकत्वात्ते प्रत्यया उच्यन्ते । तस्मात्प्रत्ययवती विज्ञानजनिक्रिया विज्ञानमुत्पादयति। यथा पाकक्रिया ओदनस्येति । अत्रोच्यते—

**क्रिया न प्रत्ययवती नाऽप्रत्ययवती क्रिया ।**
**प्रत्यया नाऽक्रियावन्तः क्रियावन्तश्च ते उत ॥४॥**

प्रत्ययवती क्रिया नास्ति । यदि काचित्क्रिया स्यात्सा रूपादिभिः प्रत्ययैः प्रत्ययवती विज्ञानं जनयेत् । सैव नास्ति । कथम् ? इहहीष्यमाणा क्रिया जाते वा विज्ञने इष्यते, उताऽजाते वा, जायमाने वा? तत्र जाते न युक्ता । क्रिया हि नाम भावनिष्पादिका । भावश्चेन्निष्पन्नः किमस्य क्रियया । 'जातस्य जन्म पुनरेव च नैव युक्तम् ' इत्यादिना दूषितत्वात् । एवमजातेपि न युक्ता क्रिया 'कर्त्रा विना जनिरियं न च युक्तरूपं स्यात् ' ईत्यादिना निरस्तत्वात् । जायमानेपि क्रिया न सम्भवति, जाताजातव्यतिरेकेण जायमानस्यैवाभावात् । उक्तं हि— जायमानोऽर्धजातत्वाज्जायमानो न विद्यते । अथवा जायमानत्वं सर्वस्यैव प्रसज्यते ' इति । यतश्चैवं त्रिष्वपि कालेषु जनिक्रियाया असम्भवस्तस्मान्नास्ति सा जनिक्रिया । एतदेवोक्तम्— क्रिया न प्रत्ययवतीति वन्ध्यापुत्रः श्रीमानितिवत् । यदेवमप्रत्ययवती तर्हि भविष्यति । तदपि न युक्तमित्याह— नाऽप्रत्ययवतीति । यतः पूर्वोक्तरीत्या क्रियाया एवाऽसम्भवस्तस्मादप्रत्ययवत्यपि क्रिया नास्ति । यदा क्रिया नास्ति तदा अक्रियावन्तस्ते भावाः कथं प्रत्यया भावानां जनकाः? भावानां जनका न भवन्त्येवेति यावत् । यदा क्रियैव नास्ति तदा ते प्रत्ययाः क्रियावन्तोपि न भवन्त्येव । उत अवधारणे । पाकक्रियादयोऽप्येवं वेदितव्याः ॥४॥

ननु किमेतेन प्रत्ययाः क्रियावन्तः, उताऽक्रियावन्त इत्यादिविचारेण । यस्माच्च चक्षुरादीन्प्रत्ययान् प्रतीत्य ज्ञानादयो भावा उत्पद्यन्ते तस्माच्चक्षुरादीनां प्रत्ययत्वं, तेभ्यो विज्ञानादीनामुत्पाद इत्येतदप्ययुक्तमित्याह—

उत्पद्यन्ते प्रतीत्येमानितीमे प्रत्ययाः किल ।
यावन्नोत्पद्यन्त इमे तावन्नाप्रत्ययाः कथम् ॥५॥

चक्षुरादीन्प्रत्ययान् प्रतीत्य विज्ञानमुत्पद्यत इति चक्षुरादयः प्रत्यया इति ते मतम् । तर्हि यावद्विज्ञानात्मकं कार्यं नोत्पद्यते तावदिमे कथं नाऽप्रत्ययाः? तथाच कथमप्रत्ययेभ्यः कार्यस्योत्पत्तिः? अथ पूर्वमप्रत्ययास्सन्तः किंचिदन्यत्प्रत्ययमपेक्ष्य प्रत्ययत्वं प्रतिपद्यन्त इति । एतदप्ययुक्तम्— यत्तत्प्रत्ययान्तरमप्रत्ययस्य प्रत्ययत्वे निमित्तं कल्प्यते तदपि प्रत्ययत्वे सत्यस्य प्रत्ययो भवति । तत्राप्ययमेव दोषः पर्यापतति ॥५॥

किंचेह चक्षुरादयो विज्ञानस्य प्रत्ययाः कल्प्यमानाः किं सतोऽस्य कल्प्यन्ते? उताऽसतः? सर्वथापि न घटत इत्याह—

नैवाऽसतो नैव सतः प्रत्ययोऽर्थस्य युज्यते ।
असतः प्रत्ययः कस्य सतश्च प्रत्ययेन किम् ॥६॥

असतोऽविद्यमानस्यार्थस्य प्रत्ययः कथं स्यात् । भविष्यता व्यपदेशो भवतीति चेन्न, 'शक्तिं विना नास्ति हि भाविताऽस्य' इत्यादिना दूषितत्वात् । सतो हि भावस्य निष्फलैव प्रत्ययकल्पना ॥६॥

एवं समस्तानां प्रत्ययानां कार्योत्पादनसामर्थ्याभावादप्रत्ययत्वमावेद्य, इदानीं व्यस्तानामप्यप्रत्ययत्वमुपपाद्यते । अत्र कश्चिदाह— यद्यप्येवं प्रत्ययानामसम्भवः, तथापि 'तत्र निर्वर्तको हेतु' रिति हेतुप्रत्ययस्य लक्षणोपदेशादसतश्च लक्षणायोगादस्ति हेतुप्रत्यय इति । अत्रोच्यते— स्याद्धेतुप्रत्ययः, यदि तस्य लक्षणमुपपद्येत । तदेव न सम्भवति । कुतः?—

न सन्नाऽसन्न सदसद्धर्मो निर्वर्तते यतः ।
कथं निर्वर्तको हेतुरेवं सति हि युज्यते ॥७॥

यदि निर्वर्त्यो भावो निर्वर्त्येत तं निर्वर्तको हेतुरुत्पादयेत् । तच्च न सम्भवति । सदसदुभयरूपस्य निर्वर्त्यस्याऽसम्भवात् । तत्र न सन्निर्वर्त्यते—विद्यमानत्वात् । नाऽप्यसन्निर्वर्त्यते—अविद्यमानत्वादेव । नाऽपि सदसन्निर्वर्त्यते—एकस्य युगपद्विरुद्धोभयरूपासम्भवात् । उभयपक्षोक्तदोषप्रसङ्गाच्च । तस्मात्कार्यस्योत्पत्त्यसम्भवाद्धेतुप्रत्ययो नास्ति ॥७॥

इदानीमालम्बनप्रत्ययनिषेधार्थमाह—

**अनालम्बन एवाऽयं धर्मस्सर्वो निगद्यते ।**
**अथाऽनालम्बने धर्मे कुत आलम्बनं पुनः ॥८॥**

'इह सालम्बनधर्माः कतमे? सर्वचित्तचैत्याः' इत्यागमाच्चित्तचैत्या येनाऽलम्बनेनोत्पद्यन्ते, यथायोगं रूपादिर्येतेषामालम्बनप्रत्ययः, स च विद्यमानानां वा कल्प्येत, उताऽविद्यमानानां वा? तत्र विद्यमानानामालम्बनप्रत्ययेन नाऽर्थः । धर्मस्योत्पत्त्यर्थमालम्बनं परिकल्प्यते । स चालम्बनात्पूर्वमेव सिद्ध इति किं तस्यालम्बनयोगेनेति भावः । अथाऽविद्यमानस्यालम्बनं परिकल्प्यते, तदपि न युक्तम् । अनालम्बने धर्मेऽविद्यमाने सति तस्याविद्यमानस्यालम्बनेन योगो नास्तीति भावः । आलम्बनकाभावादालम्बनमपि नास्तीति भावः । कथं तर्हि सालम्बनाश्चित्तचैत्या इत्यागमः । प्राकृतमेतल्लक्षणं, न पारमार्थिकमित्याशयः॥८॥

इदानीं समनन्तरप्रत्ययनिषेधमारभते—

**अनुत्पन्नेषु धर्मेषु निरोधो नोपपद्यते ।**
**नानन्तरमतो युक्तं निरुद्धे प्रत्ययश्च कः ॥९॥**

'कारणस्यानन्तरो निरोधः, कार्यस्योत्पादप्रत्ययस्समनन्तरः' इति समनन्तरप्रत्ययलक्षणम् । कारणनिरोधमन्तरा कार्यस्योत्पत्त्यभावात् कारणनिरोधः कार्ये समनन्तरप्रत्यय इत्युच्यते । बीजस्य निरोध इष्यते । एवं सति बीजे निरुद्धे अभावीभूते सति अंकुरस्य कः प्रत्ययः? को वा बीजनिरोधे प्रत्ययः? उभयमेतदहेतुकमापद्यते बीजस्य निरोधः, अंकुरस्योत्पाद इति । अत्र श्लोके चकारोऽनुत्पन्नशब्दमाक्षिपति । एवं च 'न स्वतो नापि परतः' इत्यादिना

उत्पादस्य निषेधादनुत्पन्नेषु भावेषु कथं निरोधो हेतुः । तस्मादयुक्तोऽयं समनन्तरप्रत्ययः ॥९॥

इदानीमधिपतिप्रत्ययं निषेधति—

**भावानां निःस्वभावानां न सत्ता विद्यते यतः ।**
**सतीदमस्मिन्भवतीत्येतन्नैवोपपद्यते ॥१०॥**

'यस्मिन्सति यद्भवति तत्तस्याधिपतेयम्' इत्यधिपतिप्रत्ययलक्षणम् । प्रतीत्यसमुत्पन्नत्वाद्भावानां स्वभावाभावे कुतस्तदस्मिन्निति कारणत्वेन व्यपदिश्यते। कुतस्तद्यत्कार्यत्वेन । तस्मान्नास्ति लक्षणतोपि प्रत्ययसिद्धिः ॥१०॥

ननु तन्त्वादिभ्यः पटादिकमुपलभ्यते, अतस्तन्त्वादयः पटादीनां प्रत्यया भवितुमर्हन्तीतिचेन्न, पटादिरूपं फलमेव स्वरूपतो नास्ति । कुतः प्रत्ययसिद्धिः । यथा च पटादिरूपं फलमसत्तथा प्रदिपादयन्नाह—

**न च व्यस्तसमस्तेषु प्रत्ययेष्वस्ति तत्फलम् ।**
**प्रत्ययेभ्यः कथं तच्च भवेन्न प्रत्ययेषु तत् ॥११॥**

तत्र व्यस्तेषु तन्तुतुरीवेमादिषु प्रत्ययेषु पटरूपं फलं नास्ति, तत्राऽनुपलभ्यमानत्वात् । कारणबहुत्वेन कार्यस्यापि बहुत्वप्रसङ्गाच्च । समुदितेष्वपि तन्त्वादिषु नास्ति पटः । प्रत्येकमवयवेष्वविद्यमानस्य समुदाये सत्त्वायोगात् । एकस्यैव कार्यस्य खण्डश उत्पत्तिप्रसङ्गाच्च । तस्मात्फलं प्रत्ययेषु नास्ति । प्रत्ययेभ्यो वा नोत्पद्यते । एवं फलाभावान्न सन्ति प्रत्ययाः ॥११॥

असदपि फलं प्रत्ययेभ्य उत्पद्यत इति चेदुच्यते—

**अथाऽसदपि तत्तेभ्यः फलं यदि प्रवर्तते ।**
**अप्रत्ययेभ्योऽपि फलं कस्मान्नाभिप्रवर्तते ॥१२॥**

असदपि फलं प्रत्येभ्य उत्पद्यत इति यद्यभिप्रायः स्यात्तर्हि फलस्यासत्त्वाविशेषादप्रत्ययेभ्योपि वरणादिभ्यः पटरूपं फलं कस्मान्नोत्पद्यत इत वक्तव्यम्।

अत्राह— यदि फलमन्यत्, अन्ये च प्रत्ययाः, तदा प्रत्ययेषु फलमस्ति न वेति स्याच्चिन्ता । नास्ति प्रत्ययव्यतिरिक्तं फलम् । किं तर्हि प्रत्ययमयमेवेतिचेदुच्यते—

**फलं च प्रत्ययमयं प्रत्ययाश्चाऽस्वयंमयाः ।**
**फलमस्वयंमयाद्यत्तत्प्रत्ययमयं कथम् ॥१३॥**

प्रत्ययमयं प्रत्ययविकारः फलमिति यदुच्यते तदयुक्तम् । यतः प्रत्यया अस्वयम्मयाः । अप्रत्ययस्वभावा इत्यर्थः । यदि तन्तवस्स्वभावसिद्धास्स्युस्तदा पटस्तन्तुमय इति शक्यते वक्तुम् । ते ह्यंशुमया अंशुविकाराः । न स्वभावसिद्धाः । तथाचाऽस्वयम्मयस्वभावेभ्य उत्पन्नं पटाख्यं यत्फलं तत्कथं तन्तुमयं स्यादिति । तथाचोक्तम्—'पटः कारणतस्सिद्धं सिद्धः कारणमन्यतः । सिद्धिर्यस्य स्वतो नास्ति तदन्यज्जनयेत्कथम् ॥' इति । तस्मात्प्रत्ययमयं फलं नास्ति । अस्त्वेवं तर्हि अप्रत्ययमयं फलम् । तदपि न सम्भवति । यदा पटस्तन्तुमयो न भवति तदा कथं हिरण्मयस्स्यादिति संक्षेपः ॥१३॥

माभूत्फलं, प्रत्ययनियमो भविष्यति । उक्तं हि भगवता— 'यद्यप्यसत्फलं ऽच प्रत्ययेभ्यः प्रवर्तते' इति । अत्रोच्यते—

**तस्मान्न प्रत्ययमयं नाऽप्रत्ययमयं फलम् ।**
**असद्यदि फलं तर्हि प्रत्ययाऽप्रत्ययाः कुतः? ॥१४॥**

प्रत्ययविकारो वा अप्रत्ययविकारो वा फलं नास्ति । एवं फलेऽसति तर्हि प्रत्यया अप्रत्ययाः कुतः? कथं सिद्ध्येरन्निति भावः । सति हि फले इमे अस्य प्रत्यया इमे अप्रत्यया इति वक्तुं शक्येत । विचार्यमाणं फलमेव नास्ति । ततश्चेयं प्रत्ययाऽप्रत्ययकल्पना न सङ्गच्छते । तदेवं नास्ति भावानां स्वभावतः समुत्पत्तिरिति सिद्धम् ॥१४॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु

प्रत्ययपरीक्षा नाम प्रथमं प्रकरणम् ।

सुबोधिनीव्याख्या सहित-

# माध्यमिककारिकासु ॥

## गतिपरीक्षानाम द्वितीयं प्रकरणम् ।

यद्यप्युत्पादप्रतिषेधात्प्रतीत्यसमुत्पादस्याऽनिरोधादिकं सिद्ध्यति, तथापि लोकसिद्धगतिक्रियाप्रतिषेधद्वारा अनागममनिर्गमं प्रतीत्यसमुत्पादं प्रतिपादयितु मुपक्रमते । यदि गमनं नाम नियतं स्यात्तद्गते वा अध्वनि, अगते, गम्यमाने वा स्यात् । सर्वथापि नोपपद्यत इत्याह—

गतं न गम्यते तावदगतं नैव गम्यते ।
गतागतविनिर्मुक्तं गम्यमानं न गम्यते ॥१॥

तत्रोपरतगमिक्रियमध्वजातं गतमित्युच्यते । अनुपजातगमिक्रियमगतमित्युच्यते । गमिक्रियया वर्तमानमध्वजातं गम्यमानमित्युच्यते । एवंचोपरतगमिक्रियं वर्तमानगमिक्रियायोगवाचिना गम्यते, इत्यनेन सहोच्यमानमसम्बद्धं स्यादिति कृत्वा गतं गम्यते इति न शक्यते वक्तुम् । एवमेवानुपजातगमिक्रियमगतमपि वर्तमानगमिक्रियया योगाभावादगतं गम्यते, इत्यपि न शक्यते वक्तुम् । यस्माद्गतागतविलक्षणं गम्यमानं न गम्यते—नास्ति तस्माद्गम्यमानं गम्यते, इत्यपि युक्तं वक्तुम् । ननु गन्तुर्यश्चरणाक्रान्तो देशः स तस्य गम्यमान इत्युच्यते । नैवम् , चरणयोः परमाणुपुंजरूपत्वादंगुल्यग्रावस्थितस्य परमाणोर्यः पूर्वो देशः स तस्य गते अन्तर्गतः । यश्चोत्तरः स तस्य अगतेऽन्तर्भूतः । न च परमाणुव्यतिरेकेण गमनमस्ति । तस्मान्नास्ति गतागतव्यतिरेकेण गम्यमानम् । यथा च चरणे पूर्वोत्तरदिग्विचारः कृत एवं परमाणूनामपि पूर्वोत्तरदिग्विचारः कर्तव्य इति संक्षेपः ॥१॥

गम्यमानमस्तीति शङ्कते पूर्वपक्षी—

**चेष्टा यत्र गतिस्तत्र गम्यमाने च सा यतः ।**
**न गते नाऽगते चेष्टा गम्यमाने गतिस्ततः ॥२॥**

चेष्टानाम चरणोत्क्षेपापक्षेपलक्षणा क्रिया । उत्तरदेशसंयोगो गतिः । एवंच व्रजतो गन्तुर्यत्र देशे चेष्टा तत्रैव देशे गतिरपि । साच चेष्टा न गते नाप्यगते। किं तु गम्यमान एव । यत्र हि गतिरुपलभ्यते तदेव गम्यमानम् । तस्माद्गम्यमाने गतिः । अवगतिरिति यावत् । एवं गम्यमानमस्तीति भावः ॥२॥

एवमपि गम्यमानं गम्यत इति न शक्यते वक्तुमित्याह—

**गम्यमानस्य गमनं कथं नामोपपत्स्यते ।**
**गम्यमानं विगमनं यदा नैवोपपद्यते ॥३॥**

इह गमिक्रिया योगाद्गम्यमानमिति व्यपदिश्यते । तथाच गम्यमानमित्यत्र एका गमिक्रिया उपयुक्ता । गम्यते इत्यत्रापि गमिक्रियायोग उच्यते । एवं चैकगमिक्रियाविशिष्टे गमिक्रियान्तरयोगस्याऽसम्भवाद्गम्यमानं गम्यते इति न शक्यते वक्तुमिति भावः । यतो गम्यमानं विगमनं सम्भवति अतो गम्यमानस्य गमनं न सम्भवतीति योजना ॥३॥

ननु गम्यमानमित्यत्र गमिक्रियायोगो नेष्यते, किं तु गम्यते इत्यत्रैव । एवंचेद्गम्यमानं गम्यत इति शक्यते वक्तुमित्यत्राह—

**गम्यमानस्य गमनं यस्य तस्य प्रसज्यते ।**
**ऋते गतेर्गम्यमानं गम्यमानं हि गम्यते ॥४॥**

यस्य वादिनो गम्यमानस्य गमनक्रियाया अभावेऽपि गम्यमानमिति संज्ञामत्रभाजो गमनमिति पक्षः, तस्य पक्षे ऋते गतेर्गम्यमानं प्रसज्यते । गमनक्रियां विनैव गम्यमानमिति स्यादिति भावः । अस्तु को दोषस्तत्राह—गम्यमानं हि गम्यते । लोके गमिक्रियाविशिष्टमेव गम्यमानमिति ज्ञायते, न तु गमिक्रियारहितमिति भावः ॥४॥

ननु उभयत्रापि गमिक्रियासम्बन्ध इष्यते गम्यमानमित्यत्र गम्यते इत्यत्र च । तथा च को दोषस्तत्राह—

**एवमपि गम्यमाने प्रसक्तं गमनद्वयं ।**
**येन तद्गम्यमानं च यच्च स्याद्गमनं पुनः ॥५॥**

येन गमनेन योगाद्गम्यमानसंज्ञां प्रतिपद्यतेऽध्वा तदेकं गमनम् । तत्र च गम्यमानेऽधिकरणभूते द्वितीयं गमनम् , येन तद्गम्यत इत्युच्यते । एतद्गमनद्वयं गम्यमानस्य गमने सति प्रसक्तम् । भवतु को दोष इतिचेदुच्यते । गमनद्वयाङ्गीकारे गन्तृद्वयप्रसङ्गो दोषः ॥५॥

किं कारणम् ? तत्रोच्यते—

**गन्तारं हि तिरस्कृत्य गमनं नोपपद्यते ।**
**यस्मादवश्यं हि क्रिया स्वसाधनमपेक्षते ॥६॥**

यथा छिदिक्रिया कर्तारमपेक्षते, एवं गमिक्रियापि कर्तरि व्यवस्थिता कर्तारमपेक्षते । न हि भवत्येकस्मिन्देवदत्ते गच्छति तत्र द्वितीयोपि कर्ता । अतः कर्तृद्वयाभावान्नास्ति गमनद्वयम् । ननु यदाऽयं देवदत्तः स्थितस्सन्भाषते, पश्यति च तदैकोऽनेकक्रियो दृष्टः । एवमेव गन्तर्यपि क्रियाद्वयं भविष्यतीति चेन्नैवम् , शक्तिर्हि कारिका, न द्रव्यम् । तथा च क्रियाभेदात्तत्साधनीभूतायाः शक्तेरपि भेद एव । नहि स्थितिक्रियया वक्ता स्यात् । वचनक्रियया वा द्रष्टा स्यात् । अपि च सुसदृशयोः क्रिययोरेकदा एकस्य कर्तृत्वं दृष्टम् । एवं गन्तृद्वयाभावान्नास्ति गमनद्वयम् । अतश्च 'गम्यमानं गम्यते' इति न युक्तं वक्तुम् ॥

अत्राह— यद्यप्येवं, तथापि गन्तरि देवदत्ते गमनमुपलभ्यते, देवदत्तो गच्छतीति व्यपदेशात् । तथा च गमनाश्रयगन्तृसद्भावाद्गमनं सिद्ध्यतीति । अत्रोच्यते— स्यादप्येवं, यदि गमनाश्रयो गन्ता स्यात् , स एव न सिद्ध्यतीत्याह—

**गन्तारं च तिरस्कृत्य गमनं नोपपद्यते ।**
**गमने सति गन्ताऽथ कुत एव भविष्यति ॥७॥**

यतश्च निराश्रयं गमनं नास्ति, अतो गन्तारं प्रत्याख्याय गमनं नास्ति । एवमसति गमने कुतस्तदाश्रयो गन्ता ॥७॥

ननु विद्यत एव गमनं, तद्वतस्तेन व्यपदेशात्। यदि गमनं न स्यात्तद्वतो देवदत्तस्य गच्छतीति व्यपदेशो न स्यात्। अत्रोच्यते— स्याद्गमनम्, यदि गच्छतीत्येव व्यपदेशस्स्यात्। नचैवं, गन्ता गच्छतीति खलु व्यपदेश इत्याह—

**गन्ता न गच्छते तावदगन्ता नैव गच्छति।**
**अन्यो गन्तुरगन्तुश्च कस्तृतीयो हि गच्छति ॥८॥**

इह गच्छतीति गन्ता, स तावन्न गच्छति। यथा न गच्छति तथाऽनुपदमेवोत्तरश्लोके उच्यते। अगन्तापि न गच्छति। अगन्ता नाम गमनक्रियारहितः। तस्य गमनक्रियया योगाभावात्सोऽपि न गच्छति। तदुभयव्यतिरिक्तोऽपि गच्छतीति न शक्यते कल्पयितुम्। कोहि नाम गन्त्रगन्तृविलक्षणस्तृतीयोऽस्ति, यो गच्छतीति कल्प्यते। तस्मान्नास्ति गमिक्रिया ॥८॥

अत्राह— नैवाऽगन्ता गच्छति, नाप्युभयविलक्षणः, किंतु गन्तैव गच्छतीति। एतदप्ययुक्तमित्याह—

**गन्ता तावद्गच्छतीति कथमेवोपपत्स्यते।**
**गमनेन विना गन्ता यदा नैवोपपद्यते ॥९॥**

'गन्ता गच्छति' इति वाक्ये एकैव गमिक्रिया। यया गच्छतीति व्यपदिश्यते। द्वितीयगमिक्रियाया अभावाद्गमनेन विना यदा गन्तेति न सम्भवति ततो गन्ता गच्छतीति न युज्यते। कामं गच्छतीत्यस्तु। गन्तेति तु न सम्भवतीति भावः ॥९॥

गमिक्रियायोगो गन्तर्येव यदा इष्यते तदा द्वितीयगमिक्रियाया अभावाद्गच्छतीति व्यपदेशो न घटत इत्याह—

**पक्षो गन्ता गच्छतीति यस्य तस्य प्रसज्यते।**
**गमनेन विना गन्ता गन्तुर्गमनमिच्छतः ॥१०॥**

यस्य वादिनो गमिक्रियायोगाद्गन्तेति पक्षः, गतुर्गमनमिच्छतस्तस्य पक्षे गमनेन विना गच्छतीति स्यात्। द्वितीयगमिक्रियाया अभावात्। अत्र श्लोके गच्छतीत्यस्य स्थाने गन्तेति प्रयुक्तः ॥१०॥

नन्वस्तु उभयत्रापि गमिक्रियायोगस्तत्राह—

**गमने द्वे प्रसज्येते गन्ता यद्युत गच्छति।**
**गन्तेति चोच्यते येन गन्ता सोऽन्यश्च गच्छति ॥११॥**

येन गमनेन योगाद्गन्तेत्युच्यते तदेकं गमनम्। स च गन्ता यत्र गच्छति, यां गतिक्रियां करोति तत् द्वितीयं गमनम्। तदेवं गमनद्वयप्रसङ्गः। ततश्च गन्तृद्वयप्रसङ्ग इत्यादिपूर्वोक्तदूषणं पर्यापततीति द्रष्टव्यम्।

ननु यद्यप्येवम्, तथापि देवदत्तो गच्छतीति व्यपदेशसद्भावादस्ति गमनमितिचेन्नैवम्, यतो देवदत्तव्यपाश्रयेणैवेयं चिन्ता। किमसौ गन्ता स गच्छति, उत तद्व्यतिरिक्तो गच्छतीति? सर्वथापि नोपपद्यते। येन गमनेन देवदत्तो गन्तेत्युच्यते स गच्छति। गमनद्वयप्रसङ्गेन गन्तृद्वयप्रसङ्गादन्यश्च गन्ता गच्छतीत्यापदेत ॥११॥

ननु देवदत्तः स्थित्युपमर्देन गमनमारभते, नह्यविद्यमानस्यारम्भः। तस्माद्गमनारम्भसामर्थ्यादस्ति गमनमितिचेन्नैवम्, स्याद्गमनं, यदि तदारम्भः स्यात्। स एव न सम्भवतीत्याह—

**यस्माद्गतो नारभते गन्तुमारभतेऽगतः।**
**नारभ्यते गम्यमाने गन्तुमारभ्यते कुह ॥१२॥**

यदि गमनारम्भो भवेत्स गते, अगते, गम्यमाने वा भवति। तत्र तावद्गते न गमनमारभ्यते। उपरतगमिक्रियं हि तत्। यदि नाम तत्र गमनमारभ्यते तद्गतमेव न भवति। एवमगतेपि गमनं नारभ्यते। अनागतगमिक्रियं हि तत्। अनागतवर्तमानयोर्विरोधात्। नापि गम्यमाने, तस्यैवाभावात्। गमनद्वयप्रसङ्गात्। गन्तृद्वयप्रसङ्गाच्च। तदेवं सर्वत्र गमनारम्भासम्भवादाह—गन्तुमारभ्यते कुहेति। कुत्र गमनमारभ्यत इत्यर्थः ॥१२॥

यथा च गमनं न सम्भवति तथा प्रतिपादयति—

**अतोऽस्ति गमनारम्भाद्गम्यमानं न वा गतम्।**
**यत्रारभ्येत गमनमगते गमनं कुतः? ॥१३॥**

देवदत्तस्य गमनारम्भात्पूर्वं गम्यमानमध्वजातं नास्ति । गतमप्यध्वजातं नास्ति। तथाच गतगम्यमानयोरभावादेव नैतयोर्गमनारम्भः।नन्वेतयोर्गमनारम्भाभावेप्यगते गमनारम्भो भविष्यतीतिचेन्नेत्याह— अगते गमनं कुत इति । अनुपजातगमिक्रियं अनारब्धगमिक्रियं च अगतमित्युच्यते । तत्र गमनारम्भ इत्यसम्बद्धमेतदिति भावः ॥१३॥

ननु विद्यत एव गमनं, तत्प्रतिपक्षभूतायाः स्थितेस्सद्भावात् । यस्य च प्रतिपक्षोऽस्ति तदस्ति, आलोकान्धकारवदिति चेन्मैवम् , गमनप्रतिपक्षतया या स्थितिर्भवता परिकल्पिता सा किं गन्तुरगन्तुरन्यस्य वा परिकल्प्यते? सर्वथापि न घटत इत्याह—

गन्ता न तिष्ठते तावदगन्ता नैव तिष्ठति ।
अन्यो गन्तुरगन्तुश्च कस्तृतीयोऽथ तिष्ठति ॥१४॥

यथा गन्ता न तिष्ठति तथा उत्तरश्लोके वक्ष्यति । अगन्तापि न तिष्ठति, तिष्ठत्येव सः, किमपरया स्थित्या प्रयोजनम् । एकया स्थित्या अगन्ता, अपरया तिष्ठतीति । तस्मादगन्तापि न तिष्ठति । स्थितिद्वयप्रसङ्गात् । गंतृगन्तृव्यतिरिक्तोऽन्यो नास्ति । अतस्सोपि न तिष्ठति ॥१४॥

यस्मादेवं तस्मात् —

गन्ता तावत्तिष्ठतीति कथमेवोपपत्स्यते ।
गमनेन विना गन्ता यदा नैवोपपद्यते ॥१५॥

यतश्च गमनं विना गंतैव न भवति तस्माद्गन्ता तिष्ठतीत्ययं व्यपदेशो न घटत इति भावः ॥१५॥

अत्राह— ननु विद्यत एव गमनं, निवृत्तिसद्भावात् । गतो हि गमनान्निवर्तमानः स्थितिमारभते । गमनाभावे कुतो निवर्तते इति । अत्रोच्यते—

न तिष्ठते गम्यमानान्न गतान्नाऽगतादपि ।
संवृत्तिश्च निवृत्तिश्च समे गत्या भविष्यतः ॥१६॥

इह गन्ता गतादध्वनो न निवर्तते । तत्र गत्यभावात् । नाप्यगताद्-

तत्रापि गत्यभावादेव। नापि गम्यमानात्– तदनुपलब्धेः। गत्यप्रसिद्धेश्च। तस्मान्न गतिनिवृत्तिरस्ति। नन्वन्यथा गमनं साधयामः, स्थितेर्हि प्रतिद्वन्द्वि गमनं, गमनस्य प्रतिद्वन्द्विभूता स्थितिः। तथा च परस्परप्रतिद्वन्द्वित्वाद्द्वयमपि सिद्ध्यतीति। अत्राह– संवृत्तिश्चेत्यादि। अत्र यद्गमनं स्थितिप्रसिद्ध्ये वर्णितं तत् 'गंता न तिष्ठते ताव' दित्यादिना अभिहितेन गतिदूषणेन समं निरस्तमिति यावत्। गतिप्रसिद्ध्ये उपात्तायां स्थितावपि 'स्थाता न गच्छते ताव' दित्यादिना पूर्वोक्तश्लोकद्वयव्यत्यासेन दूषणं समानमेवेति भावः।

ननु विद्यत एव स्थानं, तदारम्भसामर्थ्यादितिचेदत्राह— 'संवृत्तिश्च गतेस्समा' इति। यथा गमनारम्भो न सम्भवति तथा स्थानारम्भोपि न सम्भवति, 'गतो नारभते गंतु'मित्यादिनाऽभिहितस्य दूषणस्यैतत्श्लोकविपर्यासेनात्रापि सम्भवात्। एवं गतिनिवृत्त्या तुल्यं स्थाननिवृत्तिरपि प्रत्याख्येया। न तिष्ठते गम्यमानादित्यादिना गतिप्रसङ्गेऽभिहितदूषणवदत्रापि 'निवर्तते स्थीयमानान्न स्थितान्नास्थितादपि' इत्यादिदूषणस्य जागरूकत्वादिति भावः ॥१३॥

प्रकारान्तरेण गमनं न सम्भवतीत्याह—

**तदेव गमनं गन्तुः स एवेति न युज्यते।**
**अन्य एव पुनर्गन्ता गतेरिति न युज्यते ॥१७॥**

यदेव गंतुर्गमनं तदेव स गन्तेति न शक्यते वक्तुम्। गन्ता पुनर्गमनादन्य एवेत्यपि न शक्यते वक्तुमित्याशयः ॥१७॥

कथं न युज्यत इत्यत्राह—

**तदेव गमनं गन्ता स एव हि भवेद्यदि।**
**तदा कर्तुः क्रियायाश्च एकत्वं वः प्रसज्यते ॥१८॥**

यदि गमनं स्यात्तदा गंतृव्यतिरेकेण वा स्यादव्यतिरेकेण वा? उभयथापि न स्यात्। येयं गमिक्रिया सा यदि गन्तुरव्यतिरिक्ता स्यात्तदा अयं कर्ता इयं क्रियेति विशेषो न स्यात्। तस्माद्यदेव गमनं तदेव गन्तेति न शक्यते वक्तुमिति भावः ॥१८॥

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## ప్రతిష్ఠాపకులు

శ్రీశ్రీశ్రీరావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమేత్యాది బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, శ్రీ చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీమాన్ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి.ఏ., యల్.యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీమాన్ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి.ఏ., యల్.యల్.బి.

## కార్యనిర్వాహకవర్గము

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి ఏ., బి.ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం.ఎ. (ఆనర్సు) బి.ఇ.డి.

శ్రీ భమిడిపాటి సూర్యనారాయణశర్మగారు.

వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

కవికంఠీరవ, కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

ఐతిహాసికసమ్రాట్ శ్రీ బండారు తమ్మయ్యగారు.

భాషాప్రవీణ, శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

మధురకవితావిశారద,

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, యం ఎ., బి.ఇ.డి.

శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు.

